

# భారతి


సెప్టెంబరు

**1945**

సంపుటము 22 : : సంచిక 9

[విడిప్రతి 8 అణాలు]

# ఆంధ్రగ్రంథమాల పుస్తకముల పట్టిక

ఆంధ్రవిజ్ఞానసర్వస్వము (2 సంపుటములు) సంపు. 1 కి రు. 10-0-0

శ్రీ మహాఋషినిఘంటిత యోగశాస్త్రము—కా. సూర్యనారాయణయోగిని ... 5-0-0

భగవద్గీత (సంస్కృ.)—జె. రామారావుగారి వ్యాఖ్యానముతో 1, 2, 3 సంపులు మాత్రమే ఉన్నవి. సంపు. 1 కి ... 1-8-0

శతకకవులచరిత్ర—వం. సుబ్బారావుగారు ... 1-8-0

పారిభాషికపదకోశము (ఇంగ్లీషులోని శాస్త్రీయపదముల తెలుగుపదముల నిఘంటువు) ... 1-4-0

ఆంధ్రవాఙ్మయసూచిక (ముద్రితాముద్రితగ్రంథములపట్టిక) 1-0-0

శ్యామసుందరము—ఒం. సత్యనాథముగారు ... 1-0-0

జీవనప్రభాతము (న.)—కె. యన్. వెంకటరమణిగారు ... 1-0-0

భీష్ముడు (నాటకము)—పో. పిచ్చిరెడ్డిగారు ... 1-0-0

అవిమారకము (నాటకము)—మానపల్లి రామకృష్ణకవిగారు 0-10-0

కృషీవలవిజయము ... 0-8-0

వివాహతత్వము—బం. మల్లయ్యశాస్త్రిగారు ... 0-8-0

నిరుద్ధభారతము—మం. వెంకటశర్మగారు ... 0-8-0

శ్రీరామవిజయము (నాటకము) ... 0-8-0

ఆరోగ్యసాధనము— గాంధీమహాత్ముడు ... 0-8-0

గీతాబోధ ... 0-4-0

ప్రార్థనగీతావళి ... 0-4-0

హాలికోద్ధారము—(ప్ర) శేషాద్రిశర్మగారు ... రు. 0-4-0

మానవస్వత్వములు—థామస్ పెయిన్ ... 0-4-0

హిందీతెలుగు బాలశిక్ష—పం. ఆ. శాస్త్రిగారు ... 0-6-0

,, మొదటివాచకం ... 0-6-0

---

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల,

7, తంబుశెట్టి వీధి - - - జి. టి., మద్రాసు,

# కన్నమ్మ

**సెప్టెంబరు 6 నుంచి ఆరంభమగును**

ఆంధ్ర దేశములో
ముఖ్య కేంద్రము
లన్నిటియందును



**జెమిని చిత్రము..** తయారుచేసినవారు. రామనాథ్.. డైరెక్టర్. కొత్తమంగళం సుబ్బు.



# విషయానుక్రమణిక

## సెప్టెంబరు, 1945



## చిత్రములు

నీలాటి రేవులు (త్రివర్ణ చిత్రము); శ్రీ సిద్ధివినాయకమూర్తి, తదితర సాధారణ చిత్రములు, వ్యంగ్యచిత్రమును.



నీలాటిరేవుకు

— చిత్రకారుడు : అబ్దుల్ రహీమ్ సాహెబ్ —




సంపుటము 22 | సెప్టెంబరు, 1945
పార్థివ భాద్రపదము | సంచిక 9

# తిష్యరక్షిత

= శ్రీ కరుటూరి సత్యనారాయణ =

[వయసుచెల్లిన వృద్ధమూర్తి అశోకుని చిన్నరాణి తిష్య. కుణాలుడు అద్వితీయసుందరుడు; అశోకుని పుత్రుడు. తిష్య తన ప్రేమకు పాత్రుడైన కుణాలకుమారుని ఆకస్మికముగా ఒక ఉద్యానవనములో కలిసికొని తన హృదయము స్పష్టపరచినది:—]

ప్రాయము వ్రాలి, బుద్ధి పరిపాకమునందిన ఈవయస్సులో
నాయెడదన్ జనించిన యనంతమధూత్సవకాంక్ష లాత్మలో
మాయగజేయు నీజనకు మాంద్యము ముందట దోసిలొగ్గి, నా
కాయము వాడిపో పిరికికండల క్రుళ్లి, కృశింపుమందువా!

మతమును, నీతి, గౌరవము, మానవసంఘము స్వార్థబుద్ధితో
నతికిన దోయి! మాదృశుల అజ్ఞుల దా బిగియింపజూచి, సం
గతియె? కుణాల! భీతి గల కాలము జౌదల వంచి వీనికిన్
బ్రతికిన నాల్గునాళ్లు ననురాగము త్రుంచి చరింప శక్యమే?

## భారతి - పార్థివ భాద్రపదము

కలల జగాలలో నిలుచుకాలము బూడిదసేయు యత్నముల్
నలుపకు పుణ్యముండు, విరసంబుగ కోర్కెల గోసి, యూరకే
పలుకకు నీతిశాసనపు పద్ధతు, లుత్తరజన్మగాథలున్
తలిరుటెడందవాడ! ననుదార్చుము కమ్మని పూలసెజ్జకున్.

పువ్వుల హారతిన్ గొని, యపూర్వసుధాయితకాంతు లాత్మలో
నివ్వటిలంగ వచ్చితి వనీస్థలి కివ్విధి, యిందు నేమియున్
రవ్వయు రాదు! నాపడుచురక్తము తొందరసేయు, ఏకమై
గువ్వలజంటగా నెగురుకోరిక గల్గె కుణాల! రమ్మురా!

సుందరజీవితంబులు, అశోకుని యెండిన బుద్ధిఛాయలన్
పొందవు గౌరవంబు, సతమున్ కడలేని విరాగచర్చలన్
మ్రందెదు ఆ జరాకృశుని, మామను, నా మనువృత్తికోసమై
పొందుటయెడ? ఆపయిని పొందెడి భోగము లేద? చెప్పుమా!

హృదయము చంపి, వృద్ధపృథివీశుడు నిత్యము బోధివృక్షమున్
వదలడు, బౌద్ధభిక్షువుల పల్కుల తేనెల ద్రావి, పుల్కలన్
మొదలును, నాదు యౌవనము మేదినిపా లొనరించి, కంట నా
వదనము కాంచబోడు, పతిభక్తికి ఆహుతి తిష్యరక్షయా?

పోవుచున్నావుగా కోర్కె బూదికలిపి - బ్రామికొన నేమిగలదు, నీభావిజీవి
తంపు పొలిమేరలో దవదహనశిఖలు - ప్రాకికొన్నవి; నిద్దురవోకు—"పుత్ర"!



# కలభాషిణి కల్పనము



## = శ్రీ పిల్లలమఱ్ఱి వెంకట హనుమంతరావు =

ఆంధ్రసాహితీతీర్థములో కృష్ణదేవరాయల ఘట్టము పవిత్రమైనది. ఆ ఘట్టములోని కేగినవానికి పలు విధములైన నాదములు విన్పించును. ఋష్యష్టకముయొక్క దర్శనము లభించును. ఒకదెస వరూధిని ప్రవరాఖ్యునితో ప్రణయప్రబంధము నల్లుచుండుట గాంతుము; వేరొకచెంత సత్యభామ నలుకదీర్చు కృష్ణుని సందర్శింతుము; మఱియొకచో గిరికావసురాజుల ముగ్ధమోహనప్రణయము తెలియుదుము. ఈ సన్నివేశము లన్నిటి మించి యత్యాకర్షవంతమగు కలభాషిణి కలభాషణములను, ప్రణయప్రజ్ఞావిశేషములను గు ర్తింతుము.

కలభాషిణి పింగళిసూరనార్యుని కళాప్రతిభ నంతటిని పుణికిపుచ్చుకొనిన శిల్పమూ_ర్తి. ఈ పాత్ర మాంధ్రసాహితీలోకములో నపూర్వసృష్టి. కలభాషిణి యతిలోకసౌందర్యమూ_ర్తి. సంభాషణములో చతుర. కార్యసాధనములో నప్రతిమానప్రజ్ఞ కలది. కళాపూర్ణోదయావలోకనముచే పాఠకులకు కలభాషిణి ప్రణయమూ_ర్తిగా ద్యోతిలును. ఆమూ_ర్తికులుకు బెళుకులు, మాటలలోని కలస్వనము, ప్రవర్తనమందలి చొరవ పరస్పరప్రకాశితములై పాఠకుల మనసుల జూరగొనును. ఆంధ్రసాహితీపరులు సూరనార్యుని సృష్టికార్యమునకు జోహారులొనర్పకయుండరు.

'కలభాషిణి' యను పేరు నేరికొనుటకుపూర్వమే సూరన దాని చిత్రవిచిత్రగతుల భావించియుండును. 'నటముఖ్యుని ప్రియనందన' కనుకనే యట్టి నామ ముచితముగా నున్నది. పాఠకులు నామకల్పనములోని సూరనభావమును గు_ర్తింపరేమో యని ముందుగనే నామౌచిత్యమును నిర్వచించినాడు :

"కలభాషిణి యను పేరా
వెలది మును వహించు ; సహజవిలసత్కలభా
షలకు దగ జాల దిపు డది
కలికితనము జతురతయును గల పలుకులకున్.

పై పద్యములో కలభాషిణియొక్క గుణములను గూడ సూచించినాడు. ఆ పేరు కిపుడు చాలదట : ఇందుద్దేశించిన కలికితనము, చతురతలనే కవి ఉత్తరకథలో పొదిగినాడు. కావ్యాదిలో నున్న యీ పద్యము పాత్రప్రవేశమునకుపకరించినది.

కలభాషిణి యతిలోకసౌందర్యవతి యంటిమి. ఆమెలోని యీ గుణమే కలభాషిణీవృత్తాంతమంతటికిని బీజము. కవి యాపెరూపసంపదగూర్చి—

"మొదలు బలురేఖ గలదట, యదియుగాక
వయసు క్రొత్తట, వెలయాలివంగడమట
వనితచక్కదనంబును వన్నెలాడి
తనము గల్కితనంబును దరమె పొగడ ?"

అనినాడు. ఈ పద్యములో కవిభావము గమనింపదగినది. సహజముగా చక్కని రూపురేఖలు గలిగినదని చెప్పినాడు. తరువాత 'వయసు క్రొత్తట' అనుటలో వయసు వచ్చినపు డెట్టి యనాకారియైన స్త్రీయైనను చక్కదనము కలిగియుండునని యుద్దేశించినాడు. వయసు క్రొత్తకాబోలు-సౌందర్య మినుమడించిన దని తాత్పర్యము, ఇక 'వెలయాలి వంగడమట' అనుటలో వెలయాలివంశములోని స్త్రీ సహజసౌందర్యము లేకపోయినను కృత్రిమాలంకారములతో శోభ దెచ్చిపెట్టుకొను నను సూక్తి పొందించినాడు. తుది రెండు పాదములలో క్రమాభిప్రాయము కన్పించుచున్నది. సహజసౌందర్యవతి యగుటచే చక్కదనము, వయసు క్రొత్తయగుటచే వన్నెలాడితనము, వెలయాలగుటచే కల్కితనమును కలిగినవనియు—ఇన్ని సమకూడినదాని 'పొగడతరమె' యని పాఠకుల యూహకు వదలినాడు. తరువాత రచించిన ముక్తపదగ్రస్తాలంకారసహితమౌ సీసపద్యములో కలభాషిణీమూ_ర్తిని వర్ణించినాడు కవి. అంతటితో సరిపుచ్చక మఱి రెండు పద్యములు వ్రాసి కథాబీజమును సుస్థిరముగ నాటి

నాడు. 'కీర్తనపాత్రచిత్రమృదుగీతకలాకలనప్రవీణత' చేతను, 'నర్తననైపుణీవిలసనముల'చేతను విటుల చిత్తవిత్తముల 'అప్సరఃకీర్తిబలెన్' హరింపదొడగినదట! ఈ యుపమానమే కథాబీజ మైనది. ఈ విధముగా సూరనార్యుడు పాత్రప్రవేశముతో నుత్తరకథాబీజము వేసినాడు. ద్వారకాపురీ బాహిరోపవనములకు డోలికావిహారార్థమై యాపెను పంపి ప్రథమరంగము నావిష్కరించినాడు.

పాఠకులతోబాటు, నాకాశమార్గమున ద్వారవతి కేతెంచుచున్న నారదమణికంధరు లాదృశ్యమునకు ప్రేక్షకులైనారు. కలహభోజనుడైన గురువునకు తగిన శిష్యుడైనాడాగంధర్వకుమారుడు, వాని కన్నులు పడకపడక 'అమ్మగువల'పై బడినవి. అంతటితో నూరుకొనక 'వారి ప్రగల్భతా గరిమకు వెఱగంది' లోభావము మిక్కుటమై చనుచుండుటచేగాబోలు ప్రక్కనున్న ముసలిమునిచెవిన వేయకుంతనుండలేకపోయినాడు. వారలను చూచుచున్నకొలది మణికంధరుడు కవితాభావమునకు లోనైనాడు. దీనికి నిదర్శనముగా—

"తమిబూదీగెల దూగుటుయ్యేలల బం
తా లాడుచుం దూగు నా
కొమరుం బ్రాయపు గబ్బిగుబ్బెతల యం
ఘ్రు ల్చక్కగా జాగి మిం
టి మొగంబై చనుదెంచు తీవి గనుగొం
చే దివ్యమౌనీంద్ర! నా
కమ్మృగీనేత్రలమీద గయ్యమునకుం
గాల్దాచులా గొప్పెదున్."

అనినాడుగదా! మణికంధరుడు త్రిలోకసంచారియౌ నారదుని శిష్యుడుకాని సామాన్యుడు గాడు. అనేక కామినుల జూచియుండును. రంభాదినిలింపభామ లాతనికి క్రొత్తగాదు, యవ్వనములో నున్నాడు. 'గానవిద్యావిశేషాభిలాషంబున' నారదుని గొలిచి వచ్చుచున్నాడు, కలభాషిణిని జూచినాడు, వివశత జెందినా డా సౌందర్యమునకు. మనసులో పెరపెర పుట్టినది. కలభాషిణిపై ప్రేమాంకురము పొసగినది. గురూజీ ప్రక్కనుండుటచే తమాయించుకొని పైపద్యములో తన భావమును మరుగుననుంచి. బహువచనములో ప్రతిపాదించినాడు. నారదుడు మణికంధరుని భావమును గ్రహింపకపోలేదు. 'నాకమృగీనేత్రలమీద గయ్యమునకుం గాల్దాచులా గొప్పెదుఙా' అని పోల్చినాడు, దీనితో కొంపమునిగిపోయినది. కవి తానేమనుకొనినాడో దానినే ప్రేక్షకులకును తట్టవలెనని యాసించుచుండును. 'అప్సరః కీర్తిబలెన్' అని పోల్చిన కవివాక్యముతో మణికంధరుని వాక్యము శ్రుతిగొన్నది. నారదుడు 'తప్పేమి యొప్పేయగున్' అని పలికి యారాగములోనే పాటపాడినాడు. ఆవులించిన ప్రేగులు లెక్కించువాడు నారదుడు. 'సత్కవి వౌదు' వని మణికంధరుని వీపు చరచుటలో వ్యంగ్యముగా 'నీ మాటలోని భావము గుర్తించితిని లేవోయి' అని ఉద్దేశించినట్లు అరయగల్గుదుము. నారదుడుకూడ నాచెలుల నభినందించెనన్న వారి సౌందర్య మెంతటిదో యూహింపవలసినదే!

సరిగా నీ సందర్భముననే రంభానలకూబరులు దివ్యవిమానారూఢులై యీ దృశ్యమునకు ప్రేక్షకులైనారు, ఇంకేమున్నది? రంభ గురుశిష్యుల సంభాషణమును 'విశదముగ విననది.' ఎక్కడ తగులవలెనో యామాట లక్కడనే తగిలినవి. రంభ 'యొకింత కనలి'నది. 'మన సొకలాగై'నది. ప్రియునితో నారదుచెంత కేతెంచి యుచిత సపర్యల దీర్చి డోలికావిహారిణుల ప్రసంగమును దడవినది, 'అతిశయోక్తుల వర్ణనలం దూహ యొనర్పరో!' అని సాభిమానముతో మందలించినది. తన సౌందర్యమును ధిక్కరించు వనిత యుండునే యని గర్వించినది. జగన్మోహనమూర్తియగు నలకూబరుడు తనను గ్రహించుటే తన సౌందర్యాతిశయమునకు సాక్ష్యమని సగర్వమున బల్కినది. దీనితో నారదుడు వేసిన బీజ మంకురావస్థ జెందినది. 'ఐననిట్ల రా వెల్లదినంబులున్; సవతి యేగతి గల్గునొ మీదు గంటినే' యని నారదుడు రాబోవు సవతిపోరునకు బీజము వేసి రంభను మరింత కలచివేసినాడు. 'నినుబోలు వనిత నీకును' అను మాటలలో తన పన్నాగమును సూచించినాడు. ఇవ్విధముగా—డోలికా విహారిణుల సందర్శనము, మణికంధరుని సాదృశ్య కల్పనము, రంభ 'వలవని గర్వంబున కన్నుగాన కాడెడి యనుచితవాక్యములు' పరస్పర దోహదభూతములై కలభాషిణి పంట పండించుటలో ప్రధాన భాగము గొన్నవి.

'కలభాషిణి తన కనతిదూరంబున వినంబడు వారల సల్లాపంబు లాలకించి' 'అప్పు డట్లరుగు నలకూబరుని రూపలావణ్యాది సౌభాగ్యములకు మిక్కిలి మెచ్చుచు తదవలోకనంబునం దనియక కొంతమేర తద్విమానంబు క్రిందటి చాయ బూబొదరింద్ల యూరమిమఱుంగున వారి సల్లా

పంబు లాలకించుచుం జనెను.' తత్పరిణామముగా నలకూబ రునిపై మోహము జనించినది. రంభపై సీర్ష్యయు పెన్పొంది పొడమినది. దీనికి తార్కాణ మాపె యూపల్కులు:—

" ఇంతరూపవంతు నెంతయు దనకు నై
వసము చేసికొని యవార్యగర్వ
మతి జెలంగు భాగ్యవతి యీలతాంగి యె
వ్వతెయొకో! మనంగవలదె యిట్లు?"

స్త్రీజన్మ మటగదా సార్థకమైన దని భావించినది. ఇందులో నసూయారేఖ తళుక్కుమనుచున్నది. ఆ యతిలోక సౌందర్యవంతు దెవడో తెలిసికొనవలెనని ప్రేరణము కల్గి నది. కావుననే తన తోటలోనికి దిగిన నారదు నెటిగి ప్రణ మిల్లి యడిగిన ప్రథమ ప్రశ్న—'ఆ యేగినట్టి మహాత్ము త్ములు రంభానలకూబరులే' అని. దీనివలన కలభాషిణి మనసు సుగతమైనదిగదా! నారదు డామెమనోభావమును గుర్తించినాడు. కలభాషిణి యభిలాషమునకు పూర్వ సన్ని వేశము కలహబీజ ప్రస్తార విశేషమైనది. కావున నే నారదుడు—

" సవతి యన నింకనొకతెన్
భువిలోపల వేఱ వెదకబోవలయునె! యో
ధవలాక్షీ! నీవ కానే
రవె దైవనియుక్తి కొంత ప్రాప్తి కలిగినన్?"

అని సవతిభూమికకు ప్రాతిపదిక వేసినాడు. ఈ వాక్య ములలో కలభాషిణి యభిలాష ప్రతిఫలించినది. ఆతనిచే నభి నుతింపబడగోరియు, నాతని పలుకు నిశ్చితమగునట్లు తెలియు టకు కలభాషిణి—

"....అంతటి రూప
శ్రీ వైభవవతికిగాక సిద్ధించునె యా
దైవ నియుక్తియు మాబోం
ట్లేవిధమున బాల్పడిన నిద్ధవివేకా!"

అని శంకించినది. లోకములో వ్యక్తులకు తమ గొప్ప దనమును పలుమారు పలువురచే ననిపించుకొనవలె ననెడు కాంక్ష యుండుట సహజదౌర్బల్యము. అట్టిదే కలభాషిణిలో నున్నది. నారదు డిది కనిపెట్టినాడు. తాను రంభతో నన్న మాట చెల్లించుకొనవలసిన బాధ్యత నాతని వెన్నంటు చున్నది. కలభాషిణి నుబ్బించుటకే—

" రంభయొకప్పైన నీయుప్పరంతునైన
చక్కఁదే సీదు రూపసౌందర్యమహిమ
లెక్కఁడే కాక మిగుల నూహించిచూడ."

అనినాడు. ఈ విధముగా నారదుని నాటకమునకు ప్రధానపాత్రధారిణి కలభాషిణి యైనది.

ఇరువురకు పరస్పరముగా భక్తివాత్సల్యములు వృద్ధి నందినవి. 'ముదిత! నిన్నను జూచినట్లు తోచుచున్నయది; యొకింత నలిననాభుకొలువునకు వత్తువా' అని నారదుడు ప్రశ్నింప 'వత్తు; మిమ్ము జూతు వరమునీంద్ర' అను సమా ధాన మిచ్చినది. తన మనోభావ మడుగడుగున వ్యక్తీక రించుచువచ్చినది. 'వరమునీంద్ర' అని తొలుతనే సంబో ధించి నారదునికి క్షమావాక్కుల భంగ్యంతరముగా నందిం చినది. నారదునికి పూర్వ మొకానొక సందర్భమున ప్రక టింపబడిన కలభాషిణియొక్క ఏకసంథగ్రాహివిద్యాము జ్ఞప్తికి వచ్చి, యాతడు కలభాషిణీ మణికంధరుల ప్రణయమునకు దోహదము కల్పింపనెంచె. దానిచే మణికంధరకృతదండక మును పాడించికొనినాడు. కలభాషిణియు మణికంధరునిపై గల మక్కువ సూచించునట్లు కవితారచనావిధానమును ప్రశం సించినది. నారదసాహచర్యప్రభావము గొప్పదనియు, తా నభిలషించున దదియేననియు సూచించుచు—

" ఊరక యటు మిముబోటుల
చేరువ జరియింపగనిన సిద్ధింపవె యే
కోరికలైన? నజస్రము
గోరుదు మీవీణె మోచుకొని కొల్చుటకున్."

అని పల్కినది. నారదుడు కార్యకారణముల సమన్వ యించుకొనజాలినవాడు కావున నామెకోర్కికి సమ్మతించి నాడు. ఈ విధముగా కలభాషిణి తన యభిలాషాబీజమునకు పాదు గల్పించుకొనినది. కలభాషిణి రంభానలకూబరులను జూచినది తడవుగా నాచిత్రము గాఢముగా హత్తుకొని యామెను వెన్నంటుచునేయుండెను. రంభానలకూబరుల సంభా షణములోని పూర్వోత్తరములను తెలిసికొనవలె నను కుతూ హలము పుక్కిలింతలుకాజొచ్చినది. నారదునితో ప్రస్తావిం చుటకు మధ్య మణికంధరు డున్నాడని వినయభరంబున గొంకుచు నిల్చినది. అంత నాత డది యెఱింగి యెడముగా నేగినాడు. తరువాత కలభాషిణి తన మనఃపటము నారదుని ముం దుంచినది. 'వృథాభ్రాంతి యింతనంతను దానివెంబడి జని యొకపలుకు వింటి'నని వెల్లడించినది. 'వృథాభ్రాంతి'

యనుటలో తన యల్పత్వము, తన వాంఛయొక్క ఘనత్వము చెప్పకచెప్పి నారదుని సహాయము నన్యాపదేశముగా నర్థించినదాయెను. నారదునిచే కళాపూర్ణుని కథావిశేష మిసుమంత యెఱిగి రంభానలకూబరుల సంభాషణము నన్వయించుకొనినది. ఈ విధముగా ప్రథమాశ్వాసములో కలభాషిణి స్వరూపము; నారదుని కలహబీజము; తదనుకూలముగా కలభాషిణియభిలాష; తద్వాంఛాఫలసిద్ధికి నారదుని శుశ్రూషలు క్రమముగా నభివర్ణితములైనవి. ఇక తర్వాతికథ యంతయు ప్రథమాశ్వాసప్రస్తారమే యని తెలియగలుగుదుము.

ద్వితీయాశ్వాసములో కలభాషిణి జగన్నాటక సూత్రధారుడగు శ్రీ కృష్ణుని మన్నన లంది చెన్నొందినది. నారదునితో శ్రీ కృష్ణాంతఃపురములోని కేగినది. మణికంధరునికి లేని చనువు కలభాషిణి గైకొని పూర్వము నారదు డొసగిన యనుమతిని పురస్కరించుకొని యాతని వీణె తాను గ్రహించి మోచుకొనివచ్చుట కృష్ణుడు గని దాని నభినందించి యిదేమి యనిన ఏమియు లేదని వినీతి నిటునటు నొదుగుటలో కలభాషిణిలజ్జావినమ్రతలు గోచరమగును. కృష్ణునిచే 'నీ కిది కడు లెస్సబుద్ధి' యనిపించుకొనినది. అంతియగాక—

“నీమతిపెంపు బాడుకొను నేరుపులున్ మృదుమంజులస్వర
శ్రీమధురత్వముం గనుచు జిత్తములోపల నేను నెంతు ని
క్కోమలి గొంత నారదునకుం బరిచర్య యొనర్చునేని వి
ద్యామహిమంగడున్వెలయునంచునిముంగనుగొన్న వేళలన్.”

అని కలభాషిణిస్వరమును మెచ్చినాడు. దీనిని బట్టియు, 'నాకు మును మీరు చెప్పెడి యాకలభాషిణియె యిది' అను జాంబవతివాక్యమునుబట్టియు కలభాషిణియొక్క స్థానమెంత యుదాత్తమైనదో తెలిసికొనగలము. కృష్ణుని కరుణచే నారదునితో గానవిద్యనంతయు నభ్యసించినది కలభాషిణి. నారదుని కొన్నాళ్లుసంవత్సరములలో సపర్యలొనర్చి నమ్మకమైన ఆంతరంగికవర్తిని అయినది. అంతర్వాహినిగా మణికంధరునిపై ప్రణయము ప్రవహించుచు వచ్చినది.

గానవిద్యాభ్యాసము పూర్తియైన వెంటనే నారదుడు యదుభూషణు వీడ్కొని చనుచుండి కలభాషిణీమణికంధరుల నుపదేశముతో నాశీర్వదింపనున్నాడు. నారదునికి తాము నేర్చుకొనిన సంగీతవిద్య సాటిలేనిదో కాదో యని సందేహము కల్గినది. 'చదురు లెదిరిమదికి నెట్టిపగిదినైన సమ్మదంబొదవించుట పరమధర్మం బని తల్లంతురుగావున నట్టి కథలు గట్టిగ నమ్మరా' దను భావముచే నారదుడు తన విద్యనుగూర్చి 'సరసిజాక్షిచెలువ లాత్మ మెచ్చి సలిపినయట్టి ప్రశంసచందముల' నమ్మడాయె, 'తమ చెలులతోడ నేతత్ప్రసంగమున నేమి పలికి రది నిజంబు' అని తలచిన గురువుం జూచి కలభాషిణి చతురముగా భాషించెను. నారదుని సాహచర్య మాదినముతో సరి. తాను నాలుగేండ్లొనర్చిన శుశ్రూషాఫలితముగ తా నుద్దేశించిన ప్రతిఫలము గొను సమయము వచ్చినది. తాను తెగించి యడుగుటకు నారదుడు సామాన్యమానవుడు కాడుగదా! నూతనవ్యక్తియా యను కొన్న నాలుగేండ్లు సాహచర్య ముండెనాయె. పోనీ! నిరంతరసామీప్యవర్తనముచే నలవడిన చనువును పురస్కరించుకొని కోరుదమన్న నేవిధి నాదరించునో యనెడి భీతి యావహించినది. కలభాషిణి కళవళమందినది. దైవికముగ నాపెకు నారదుని సందేహము తన మనోభావమును వ్యక్తీకరించుటకు కొంత తావిచ్చినది, చెలులతోగాని తమ యంతరంగ భావములను యథార్థముగ పలుక రను నారదు వచనము కలభాషిణికి నుపాయము సేకూర్చినది. తనకు నగరిలోని జనములందు గల పరిచయమును సువ్యక్తమొనరించి యంతఃపురములోని చెలికత్తెల చెంతకు తా నరుగవచ్చునేమో యని యెత్తువేసినది. ఈ యెత్తును పోషించుకొనుటకు తన ప్రతిభ నుపయోగించి 'ఐన నేను మీదాన నగుట మీగానకథలు వడిన నవ్వేళ కొదవలు తడవరేమో' అని శంకించినది. నారదునికి తా నుపాయము చెప్ప సాహసించినది. తన్మూలముగా స్వప్రయోజనమును సాధించుకొననగునని యుబలాటపడినది. 'నా కపేక్షితమైన నాతిరూపు ధరింప సామర్థ్య మబ్బిన నామగువల సఖుల రూపము దాల్చి సముచితంబగు వేళ జని వారి హృదయంబు గనగవచ్చు'నని పల్కినది. 'సామర్థ్య మబ్బిన' అనుటలో వాచ్యముగా గాక నారదుని వరప్రసాదమునకై యర్రు చాచినది. స్వప్రయోజనాకాంక్షితము గాకున్న 'నా కపేక్షితమైన నాతిరూపు' అనుటలో వే రర్థము లేదుగదా! కేవల నారదోపయోగార్థమై సంకల్పించినచో నావాక్యోత్తరభాగమే చాలును. ఈ సూచనములోని కలభాషిణిభావ మెఱిగినాడు నారదుడు. సూరనార్యుడు తొలుతనే 'తగజాల దిపు డది కలికితనమును చతురతయును గల పలుకులకున్' అని యాపె స్వభావనిర్వచనము జేసినాడు. ఈ స్వభావమే యిందు ద్యోతిలును. 'ఇది నెపముగాను నిధీశసుతుని దా రంభయై కూడుట రమణికోర్కె' యని నారదుడు గుర్తించి 'అదియ

మదీయ కార్యానుకూలముకదా!’ అని సమన్వయించుకొని ‘నీ వలసినట్టి యంగనల రూపు దాల్చి’ తన కార్యమును నిర్వర్తించి రమ్మని పలికెను. తన్మూలముగా కలభాషిణికి వర మనుగ్రహింపబడినది; సంయమిసందేహము పోనడచినది; తుదకు నారదునిచే దీవెనలందినది. కలభాషిణి యెంత

నారదుడు కలభాషిణివృత్తాంతములోని ఉత్తర కథకు నిదివరకే బీజము నాటినాడు. ఈ నాల్గు సంవత్సరములలో కలభాషిణీమణికంధరుల పరస్పరావలోకనానురాగాభివృద్ధుల గుర్తించినాడు. కావుననే తుది యాశీర్వచనములో-

“ కొమ్మ మున్ను నీ వాత్మలో గోరినట్టి
కాంతు రంభామనోహరాకారు డగుచు
మెరయువానిని గూడి రమింపగలవు
నమ్ము పొ మ్మిక నీ భవనమునకు”

అనినాడు, ‘రంభామనోహరాకారు డగుచు మెరయువానిని’ అనుటలో నలకూబరు డనియు, నలకూబరవేషధారి యనియు నర్థద్వయము పొందించి ఉత్తరకథా రహస్యము సూచించినాడు, ఈ యర్థద్వయము కలభాషిణి నలరించిన దొకదెస; నారదుని కలహభోజన మధికము చేసినది వేరొకదెస. ఈ విధముగ కలభాషిణీనారదుల సంకల్పములు ప్రోదిగొన్నవి. మణికంధరుడు నారదాదేశానుసారంబుగ తీర్థయాత్ర కేగ, నారదుడు ద్వారకను విడిచి నిజేచ్ఛ జనినాడు.

తరువాత కలభాషిణిస్థితి దుర్భరమైనది, గానవిద్యావ్యసనమువలన నిదివరదాక కాలము గడిచెడిది. గంధర్వకుమారుడైన మణికంధరుని జూచికొనుచు తన వాంఛ నపనయించుకొనెడిది. మహాత్ముడైన నారదు డున్నంతకాల మితర వ్యావృత్తుల కవకాశమే లేక శుశ్రూషాదికములో మునిగియుండెడిది. మఱి యిపుడో! నారదుడు లేడు. మణికంధరుడైన నుండెనా యనిన నాతని ముందుగనే పంపి తరువాత వెళ్లినాడు నారదుడు, శ్రీకృష్ణుని మందిరమునకు వెళ్లుటకా, గానవిద్యాభ్యాస ముడిగినదాయె. ఇక కలభాషిణి కేమి తోచును? మిగిలినది నలకూబరునిపై వాంఛ యొక్కటే. దాని సాహచర్యము దినదినమున కామెకు మనస్తాపమును హెచ్చించుచు వచ్చినది; కాని యే విధమైన శాంతి నీయలేదు. కలభాషిణికి కాలము వెళ్లబుచ్చుట దుష్కర మనిపించినది.

అంత నొక్కనాడు విరామము గొనుటకై వీణె తీసికొని గృహారామములోని కేగినది. కొంత తడవునకు విచిత్ర సంఘటన తారసిల్లినది. సింహారూఢుడై యాకాశమార్గము నుండి యొక సిద్ధుడు కలభాషిణి యున్న తోటలోనికి దిగినాడు. ఈ సన్నివేశమున కాశ్చర్యభయములు ముప్పిరిగొనగా కలభాషిణి యా సిద్ధుని కర్ఘ్యపాద్యాదు లొసగి గౌరవించినది. మఱింత ఆశ్చర్యమునకు కారణముగా నాసిద్ధుడు కలభాషిణి పూర్వ వృత్తాంతమును, ప్రస్తుతావస్థను, మనోభావము నేకరువు పెట్టినాడు. తనకు దూరదృష్టి దూరశ్రవణములు గలవని ఋజువుచేసి చూపినాడు. నారదుడు మణికంధరునకు చేసిన ఉపదేశమాదిగా మణికంధరుని తీర్థయాత్ర, తపశ్చర్యలను విశదీకరించినాడు. కలభాషిణి సమ్మకమును చిలుకయొకటి వచ్చి చెప్పిన మాటలు ధ్రువపరిచినవి. ఆ కీరముఖమున మణికంధరుని తపోమహిమకు నింద్రుడు వెరగంది తత్తపోభంగమునకై రంభను పంపినట్లు తెలిసికొనినది. కలభాషిణి మనసులో నాశారేఖ పొడమినది. నారదునివలన వరము లభించినది గదా, దైవికముగా వచ్చిన యాసిద్ధుని మహిమచే నలకూబరుని చెంత కేగవచ్చునని యభిలషించినది. చిలుకమాటలబట్టి నలకూబరు డేకాంతముగా నున్నట్లు తెలిసినది, ఇంకేమి! సరిగా నిదే సమయము. రంభ లేకున్నపుడే నలకూబరుని జేరవలెనుగదా! అట్టి సమయమే లభించినది, ద్వితీయాశ్వాసాంతమున కీ విధముగా కలభాషిణివాంఛ ఫలించుటకు చక్కని మార్గ మేర్పడినది.

‘ఏకక్రియా ద్వ్యర్థకరీ’ యన్నట్లు నారదుడు ప్రసాదించిన వరము నారదునికిని, కలభాషిణికిని ప్రయోజనకరములు. అట్లే యుత్తరకథలో సిద్ధుడగు మణిస్తంభుడు కలభాషిణిని తీసికొనిపోవుటకు సమ్మతించుట యాతనికిని, కలభాషిణికిని ప్రయోజనకరములు. ఈ విధముగ గల్పించుట సూరనార్యుని యనల్పకల్పనాశక్తికి నిదర్శనము. కలభాషిణి పూర్వసన్నివేశములో నారదు నేవిధముగా లోగొనినదో యట్లే మణిస్తంభునిసైతము వాక్చమత్కృతులచేతను, గాననైపుణ్యముతోడను, పరిచర్యచేతను రంజిలజేసినది. నలకూబరుని పొందు లభించునిమిత్తము కలభాషిణి యెంత సేవయైన జేయును. మణిస్తంభుని దూరదృష్టి నామె బాగుగా నుపయోగించుకొనినది. రంభ మణికంధరుని చెంత నున్నదో, మరెచట నున్నదో యను శంక నివృత్తముగానిది యామె నలకూబరుని చెంత కేగజాలదుగదా! మణికంధరునితోడనే

రంభ సుఖించుచున్నట్లును, నలకూబరుడు పెన్విరాశిచే మణి కంధరుని తపోవనసమీపభాగమున నొక వనచూతావళిలో నున్నాడన్నట్లును సిద్ధునిచే నెఱిగినది. మణిస్తంభుడు పోబోవ తన హృదయము వ్యక్తీకరించినది.

"....మహాత్మ ! నిన్ను నాపాలి భాగ్య
దేవతగ నమ్మియుంటి నాజీవితంబు
నేమిగా జేసిపోయెద ? వెఱుగజెపుమ."

అని తన జీవితసర్వస్వము నలకూబరునికి నంకితము చేసినట్లు సూచించినది. మణిస్తంభుడు తప్పింపుకొన నటించి నపుడు వివశతజెంది—

"ఈ వేళన యాతనికడ
కే విధముననైన జేర్చు టింతియతక్కం
ద్రోవ మఱి లేదు నన్నుం
గావన్ క్షణభంగురములు కాంతల తాల్మల్."

అని మదిలోపలి చింద మేర్పడ జెప్పి తదుపాయము దిద్దుటకు ప్రభావధములు మఱి లేరని మొండిచరిచినది. "కలభాషిణిదీనాలాపములు పాత్రోచితములై రాతిగుండెనుగూడ గరగింపజాలియున్నవి." మణిస్తంభుడు పల్కిన ప్రతిమాటకు సముచితసమాధాన మొసగి యాపె ప్రాగల్భ్యమును సాటినది. 'సింహముపై నెక్కించుకొనిపోయిన తోడిసిద్ధులు వేరొక్కలాగుగ నెంతురు ; మీబోంట్ల సంస్పర్శనమాత్రంబు నస్మదాదులకు సమ్మతింప సుచితంబు గాదు' అను సిద్ధుని పలుకులకు 'ఉచితంబె మఱి నాదు ప్రాణహానికి నోర్చు టరసిచూడ' అని కఠినముగ బలికినది. ఇందు సిద్ధు డాపెను గొంపోవనిచో నాత్మహత్యకైన పాల్పడునని బెదరించుట కన్పించును. వేగిరపాటు హెచ్చైనది. తన చెలులు వచ్చి విఘ్నమొనర్తురేమో, పల్కులచే కాలయాపన మొనర్చుట కూడదని తన హృదయవేగమును ప్రదర్శించి—

"....కొనిపొమ్ము శీఘ్రంబ నీదు
వెనుక నిడుకొని నన్ను మద్విభునికడకు"

అని తన భావమును వాచ్యముచేసినది. ఎంతటి తెగింపు ! స్వప్రయోజనార్థమై యేతెంచిన మణిస్తంభుని భావముతో కలభాషిణియొక్క పీడనము శ్రుతిగొన్నది., తత్ఫలముగా సింహముపై నామె నిడికొని చయ్యన నింగి బయన మొనర్చినాడు.

దారిలో వారి కక్కజముగ రంభాసఖు లెదురైరి వారి సంభాషణావిధానమునుబట్టి రంభ నలకూబరునితో నున్నట్లును, మణికంధరు డెటకేగెనో తెలియనట్లును తెలిసిరి. ఈ వార్త చెవినిబడినంతనే కలభాషిణి క్రుంగిపోయినది. ఆశాభవన మొక్కమారు కూలినది. కలభాషిణిసౌందర్యమునకు రంభాసఖు లచ్చెరువంది—

"ఇక్కలికి గుత్తగొనుబో
తక్కక దివి నిమిషమున్న దైవతవిటులన్."

అని ప్రశంసించినారు. విచారగ్రస్తయైన యాపెకు వారి వాక్కులు మరింత దుఃఖము కల్గించియుండును ; అంతటి సౌందర్య మున్నను ఫలరహితముగదా యని వాపోయియుండును. కలభాషిణిని వారల వార్త తాపకరమై కలచినట్లు మణిస్తంభుడు గుర్తించి 'చింతిలవల'దనియు, 'నీ మనము శోకము సర్వము బుచ్చివైచెదన్' అనియు జెప్పి వికాసము గూర్చినాడు. కించిదాశాజ్యోతి పొడమినతరి నా కంఠీరవము ముందునకు సాగక నిలువబడిపోవుటచే కలభాషిణి చాల సంక్షుభిత యాయెను. తత్పరిణామముగ మేను చెమర్చినది ; కొప్పు విడబారినది ; చనుగుబ్బల పయ్యెద వాసినది. పిఱుంద పల్లటిల్లి సుస్థితి తప్పినది. భీతిచే చంచలాక్షి యైనది. మణిస్తంభుడు పైస్థితిని జూచి వెఱగందవల దని యనునయించి యటనున్న మృగేంద్రవాహనశక్తికి పూజసలుపవలె నను మిషతో సింహమును క్రిందికి దింపి కలభాషిణిని గుడికి దోడ్కొనిపోయి తద్బాహ్యమండపంబున నుంచి యాతడు దేవికి పూల దేనరిగినాడు.

కలభాషిణి నారదుని నిష్క్రమణము తర్వాత నెంతగా బాధపడినదో యంతకన్న నిపుడు వెతలజెందినది. తన సఖులను, గృహమును, వీణెను, పురమును వీడి, నలకూబరునైనను జేరక మధ్య నిట్లొంటి జిక్కినది. ఆపెమనసు పరిపరివిధముల పోసాగినది. ఇంతలో సుముఖాసత్తియనెడి ముదుసలిపడతి యొకతె తోడైనది. మణిస్తంభుని మాయ నంతయు ముక్తసరిగ నాత డేతెంచు ననెడి వేగిరపాటుతో జెప్పినది. 'సదమలరూప సుగానాస్పదవారవధూటి నట బలిగా నిడిన' మహారాజ్యవైభవము లభించు ననెడి శాసన వాక్యానుసారముగ నాపెను దెచ్చెనని విశదపరిచినది. కలభాషిణియు తచ్ఛాసన పఠనమువలన నందలి సత్య మెఱింగినది. మిక్కిలి దైన్యావస్థ జిక్కినది. అంతకుపూర్వ మెట్టి ఘనత్వమున ప్రకాశించెనో జ్ఞప్తికి దెచ్చుకొని ప్రకృతావస్థకు

పోల్చికొని దుఃఖించినది. ఇట సూరనార్యుడు కలభాషిణిపై పాఠకునికి కరుణ కలుగునట్లు చిత్రించినాడు. చూడుడు :

" ప్రజలకందఱకు నాపదలు వాపెడునట్టి
చక్రిపట్టణములో జననమంది
వారకామినినయ్యు గౌరవంబున సభ్య
జను లిటు చేర రమ్మనగ బ్రదికి
త్రైలోక్యగురుడు నారదమౌని ప్రియశిష్య
నిర్విశేషముగ మన్నింప నలరి
జగదీశు రాజవాసపుసతుల్ శిక్షగా
వింపంగ సంగీతవిద్య నేర్చి
తుద నొకానొక కపటసిద్ధుం డొనర్చు
శక్తిపూజకు బలిపైతి జర్చనేయ !
నెంతవారికిఁ దప్పింప నెట్లు వచ్చు
బ్రహ్మ దా మున్ను వ్రాసిన వ్రాతఫలము ?"

ఇంతగా నడలిన కలభాషిణి మనసు దిటవుపరుచుకొని 'తెగునే యనుభావ్య మెంతయు నంతయు ననుభవమునగాక' యనుకొనినది. ఆ కొలదికాలమును సుముఖాసక్తితో సుఖముగ గడుప నిశ్చయించినది. పరస్పర చరితముల వ్యక్తీకరించుకొనినారు. ఇంతలో మణిస్తంభుడు రానే వచ్చినాడు : వచ్చి కలభాషిణిని రమ్మని పిలుచుటయు, నది భయముచే నాముదునలిసాయ మర్ధించుటయు, వీని గాంచి సిద్ధుడు వేగిరపడుటయు, వృద్ధనారి యడ్డుపడుటయు, కత్తివ్రేటుచే వృద్ధసతి మెడ తెగుటయు క్రమముగా జరిగినవి.

శక్తిమహిమచే కలభాషిణీసిద్ధు లంతరిక్షమున కెగిరిపోయి మణికంధరుని తపోవనభూమి నొక మెత్తని క్రొత్తలిరాకు పాన్పుమీద పడినారు. మణిస్తంభు డంత కలభాషిణిని మదనావేశభరముతో పరిరంభము గావింప నాపె సైరింపనేరక యాదీనురాలు బిట్టుగ నాక్రోశించినది. ఈ సన్నివేశము కలభాషిణి కొకవిధముగ మేలొనగూర్చినట్లు భావింపవచ్చును. ఈ ఎలుగు విని చేరువనున్న పొదరింటిలో నుండి రంభతో సుఖించుచున్న నలకూబరుడు రక్షణార్థమై యేతెంచినాడు. ఈ రూపమును జూచినది : ఇంకేమి ; కలభాషిణి నారదవరప్రసాదముచే రంభవేషమును దాల్చినది. చిరకాలమునుండియు తనకున్న మనోభీష్టము నేటి కీ రూపమున ఫలించినది. రంభ వచ్చునేమో యను భయముతో కలభాషిణి యవకాశమును పుణికి పుచ్చుకొనుటకు వేగిరపడి మణిస్తంభుని గూర్చి యానలకూబరుడు విచారించుటకు దావిచ్చినది కాదు. ఇయ్యెడ కపటరంభయై కలభాషిణి ప్రవర్తనాసంభాషణములు ప్రౌఢతరములు. నలకూబరున కెట్టి యనుమానమును గలుగకుండునట్లు ప్రవర్తించుట యెన్నదగిన విషయము. తాను వేషము మారినదే తడవుగ నలకూబరు నుద్దేశించి—

"....అక్కటకటా ! యేమంచు నిన్దూఱుదుం ?
గేలం గైదువు గీదు వేమియును లేకే యిమ్మెయిన్వత్తురే?
చాలన్ దూరముగాఁగ నే నిటె పరిశ్రాంతిం గడు న్వొచ్చితిం
జాలుంజాలుఁ గరంబు మెచ్చదగు నీచందంబు ప్రాణేశ్వరా !"

అని సంబోధించుట యెట్లు సహజముగ నున్నదో తెలియుదుము. సమయోచితభాషణముల పొందించుటలో కలభాషిణి ప్రౌఢ. పిమ్మట తనవాంఛ సిద్ధింపజేసికొనినది. ఎంతటి ప్రజ్ఞాశీలి ! క్రొత్తవేషమైనను తడవుకొనక, సహజవర్తనమువోలె నటించుట నాట్యధర్మముగదా ! "నటముఖ్యుని ప్రియనందన" కిట్టి చాతుర్యము లేకపోవునా ?

అంతలో అసలురంభ రానేవచ్చినది. కలభాషిణి తోకత్రొక్కిన త్రాచైనది. నలకూబరు డనుమానించి జీవ్వ వకుట గాంచినది. తానే సత్యరంభయైనట్లు మెప్పించుటకు—

" అట్లయిన ప్రాణనాయక ! నిను గొగిట
దాయ నే వెఱతు, నీ మాయలాడి
యీరూపుతో మన కెడనేయ నేతెంచి
నదియొ తొల్లి యు నొక్క యసురజంత
జనకనందనకు రామునకును నెడనేయ
గడగి వచ్చుట వినబడుచునుండు...."

అని కాంతుని కంఠంబు నొకకేల గౌగిలించినది, నలకూబరు డిదమిత్థమని నిర్ణయింపలేక పోవుటచే సవతిపోరారంభమైనది. రంభ నెన్నిమాట లనవలెనో యన్నియు దులిపినది, మాటకు మాట సమాధాన మిచ్చినది. కలభాషిణి మాటలలో దీసిపోవునా? సత్యరంభనే కపటవేషధారిణిగా కట్టివైచినది. ఈ కలహమును దీర్పక నారదుడు వచ్చి యానందించి వెళ్లిపోయినాడు. దీనికి కారణభూతుడే నారదుడైనపు డాత డెట్లు తీర్పుదిద్దును ? నలకూబరునితో పరిహాసమాడినాడు. 'నీకు భావింపగ స్వాభావికమే యీ యాకృతిభావము' అని యెత్తిపొడిచినాడు, మణికంధరుడు తపస్సు నంతటిని ధారపోసి నలకూబరుని యాకృతి గొని 'చెడినవాడు పూర్తిగా చెడ సంకల్పించుకొని' రంభతో నున్నాడు. ఈ కపట నలకూబరునికొరకే యింతకు నీసవతి

పోరు ఘటిల్లినది. లోకములో సామాన్యముగా కలహము లిట్టి తేలికవిషయములపైనే వృద్ధియగునని చెప్పకచెప్పినాడు. కలభాషిణి తుదకు రంభ దేవసభకు ఋజువునకు రమ్మని నపుడు తన యసామర్థ్యమును ప్రకటింపక సగర్వముగా ప్రియుని కిచ్చిన సమాధానము నికషోపలమువంటిది.

"అప్సరస్త్రీలలో నగ్రగణ్యాత్వంబు
జగదుపశ్లోకితంబుగ వహించి
యూర్వశీమేనకాద్యుత్తమస్త్రీలు రా
వమ్మ పోవమ్మ నా నతిశయిల్లి
యెన్నండు నెచ్చోట నేవారిచే వ్రేల
జూపించుకొనక ప్రస్తుతికెక్కి
నలహూబరుండు ధన్యతరుండు నా గుణ
వతనంబుచే నీకు వన్నెదెచ్చి
యొప్పునే యింక గడపట నిప్పిశాచి
నాకు సరిచేసికొని దేవలోకసభను
నీవునూ నీవునుమ్మని యేవిధమున
గలహమాడెద నిది నీవె తలంచిచూడు."

తుదివరకు నలకూబరుని స్పర్శకై పెనగులాడినది ఎంతటి నమ్మకమైన మాటలతో కలిగించు గడుసరి కలభాషిణి. 'వెలయాలి'తనము పూర్తిగా నిట వినియోగించుకొనినది. 'ధరణి విడిచి దివికి నడు గటు వెట్ట'నని యాన పెట్టినది. దీనిచే పట్టువడినది. ఖేచరత్వము లేదని ఋజువయినది. 'హేతిఘాతనిమిత్తంబుచేతన కాయవియోగంబు నొందు'మని శాపము గొన్నది. తిరిగి మృగేంద్రవాహనాలయమునకు వచ్చిచేరుకొన్నది.

అట వ్రేటువడిన సుముఖాసత్తి పడుచుగా పరిణామ మందినట్లు కనుగొని, ఎఱిగి, కలభాషిణి తన వృత్తాంతము చెప్పబోవుచుండ మణికంధరు దేతెంచినాడు. ఆతని జూచి యెన్ని దినములో యైనది. అమితానందముతో నొండొరులు తమ పూర్వదశలను, ప్రకృతపరిస్థితులను సంభాషించుకొనినారు. 'మణిస్తంభు డంతలో నేతెంచి వారి గుర్తించి, తాను తపోవనములో జూచిన యద్భుతముల క్రమముగా విన్నవించినాడు. కలభాషిణీమణికంధరులు మాత్రము తమ చరితములే చెప్పుచున్నాడు గావున వినుచు మిన్నకుండిరి. సత్య నలకూబరుడు వచ్చినట్లును, అంతకుపూర్వమున్నవాడు కపటనలకూబరుడని ఋజువుపడి శాపమునందినట్లును విని కలభాషిణి మనసులో కళవళ మొందినది. మణిస్తంభుడు కలభాషిణివృత్తాంత మడుగగా నాపె క్లుప్తముగా జెప్పినది. తన శాపఫలమును దినుటకై దేవ్యాలయమునకు వచ్చినట్లు విశదపరిచినది. తనపై కెత్తిన మణిస్తంభుని ఖడ్గప్రభావము విని తానే దానిచే నంత మొందవలసియున్నట్లు తెలిసినది. తన చావునకు వెఱువక పరోపకారము దానివలన కలుగునుగదా యని సంతసించినది. కాని యామె మనసులోని శంకను దీర్చుకొనగోరి 'యా కపటనలకూబరు దెవడో కదా' యని ప్రశ్నించినది. దాని కటనున్న మణికంధరు డందుకొని తానే యని చెప్పుచు, తన వృత్తాంతము దెల్పినాడు. ఇరువురు లోలోన తమ చర్యలకు సంతసించినారు. ఇతఃపూర్వపు టనుమానములు నివృత్తములైనవి.

ఈ విధముగా మున్ను కలభాషిణీమణికంధరుల మధ్య నాటుకొనిన ప్రణయబీజము ప్రోదిగొని వృక్షమై పరోక్షమున ఫలము నందినది. కలభాషిణీమణికంధరుల ప్రణయము పవిత్రమైనది. విప్రలంభముచే పుష్టిపొందినది. శుశ్రూషాకాలములో నారదుని శాపభయముచే నాభావము వారి యంతరంగములందే దాగిపోయినది. . పరోక్షఫలమునకు, తమశీలము లన్యథాచెడిపోనందులకు దృప్తిజెంది, యిరువురును పరస్పర మెట్లు ప్రేమించుకొనిరో విశదీకరించుకొనినారు. ఇట కలభాషిణిపలుకులు మన స్తత్వప్రకాశితములు :

"నీ సౌందర్యవిలాసభాసురతనూ నిర్ణిద్రసౌభాగ్యమున్
నీ సంగీతవిశేషకౌశలము నీ నిర్దోషనానాగుణో
ల్లాసం బున్నను నప్పు డెంత పరమాహ్లాదంబు నొందించెనో
యాసుద్దుల్ హృదయైకసాక్షికము లేమన్నన్ వృథానిత్తరీ."

అని తన మనోభావమును వ్యక్తీకరించినది. తన భ్రాంతిని దూషించుకొనినది.

"శ్రీయుతమైన దివ్యమణి చేతికి నబ్బగ బాఱవైచి త
చ్ఛాయయొకింత యున్కిగని చాలగృశించితి గాజుపూసకై"

అని తన యవివేకమునకు నిందించుకొనినది. తుదకు తన భాగ్యశ్రీకి జోహారు లర్పించినది. 'తన మాట లిచ్చకము లనక నమ్మెదరా?' యని లజ్జాశోకములతో నవనతముఖి యైనది. మణికంధరుడు కలభాషిణిపై మక్కువను పురస్కరించుకొని, యాపెగుణములలోని పావిత్ర్యము నెఱిగినవాడగుటచే కలభాషిణి నాత డూరడించి మన్నించినాడు. నారదు డొసగిన యాశీర్వచనవాక్యములోని ద్వంద్వార్థమును వెల్లడించి కార్యముతో సమన్వయించినాడు. సుగాత్రీశాలీనుల

గాథ నెరిగించి మానవమనస్థితు లేవిధముగా ప్రణయకార్య ములందు చిత్రగతుల వర్తించునో తెల్లముగావించినాడు.

అంత ప్రసంగవశమున వచ్చిన సుగాత్రీశాలీనులే తామని యీ సుముఖాసత్తిమణిస్తంభులు ఋజువుజూపిన పిమ్మట కలభాషిణి తన శాపఫలము పండవలసియున్నది గాన వేగిరించినది. మణిస్తంభుడు 'వెఱతు నీపయి దెగ, మునుపటి పొత్తై చాలు'నని విరమించుకొని మణికంధరుని నియోగింప నాతడును తనకు రాజ్యవైభవము లేల యనియు, తానై కలభాషిణిని నరకుటకు జంకియు తిరస్కరించినాడు. కాని సుముఖాసత్తి యుపదేశమువలన ధృతి దెచ్చికొనినాడు. కలభాషిణికి కాలము సమీపించినది. కాని యది యత్యంత వికాసముతో, ముదముతో వర్తిలుట యాపె ధైర్యగుణము నకు నిదర్శనము. కలభాషిణి అక్కడనున్న వృద్ధదంపతు లకు నమస్కరించి దీవెనలందినది. 'దేవతవుగాక నరాంగ నవే'యని సుముఖాసత్తివంటి పతివ్రతచే ననిపించుకొనినది. తనంతట తాను మణిస్తంభునివద్ద కత్తిగొని, మణికంధరుని చేతి కిచ్చి, పోయి శక్తికి నభిముఖముగా పద్మాసనస్థయై కూర్చుండి గాంభీర్యవికాసములతో, నెట్టిభయము లేక వర్తిలుట స్త్రీజాతి కనన్య సాధారణ ప్రకృతిగదా! కలభా షిణి ప్రణయవాంఛ కెంతగా పాటువడెనో మృత్యువాంఛకు గూడ నంతగా నుత్సాహము జూపుట యాశ్చర్యజనకము! పైగా మణికంధరు నుద్దేశించి 'శంక లేక మెఱయింపుము చూచెద నుద్ధత ద్విషత్సంతతి కంఠఖండన విచక్షణ దక్షిణ బాహుశౌర్యమున్' అనియు, 'భ్రమయక చేమరువకునికి పటుశౌర్యమగున్' అనియు సవాలుచేయుటతో నాపె స్థయి ర్యము వెల్లడియగునుగదా! మణికంధరు డాపెతెలివి కరుదుపడుచు నెట్టకేలకు దన మది నూల్కొల్పి తద్వచన మును నడపినాడు. తన ప్రియునిచే నీ విధముగా కలభాషిణి కత్తివ్రేటు దిన్నది; శాపవాక్యము చెల్లినది.

ఇంతటి ప్రణయమూర్తి, ప్రజ్ఞామూర్తి యగు సౌంద ర్యస్వరూపము నొక్కమారు కత్తివ్రేటుకు గురియైన దనిన నొడలు జలదరించును. కనకపోయినను నాడు పెంచినంత మాత్రముననే కణ్వుడు వియోగభరమునకు వగచినాడే! తాను ప్రతిభావిశేషముచే కనిన కమనీయమూర్తియౌ కలభా షిణిని పింగళి సూరనార్యుడు పోషించి, పోషించి, సాహితీ లోకముదృష్టి సోకునట్లుగా నలంకరించి, తుద కసిపాల్గావిం చునా? సన్నివేశములకు లోనై సూరనార్యు డేమియు చేయలేకపోయినను, మానవాతీతమౌ శక్తి యొకటి తిరిగి కలభాషిణికి ప్రాణదానమిచ్చినది! అది వినువరకు పాఠక లోకము దుఃఖములో మునిగియేయుండును. ఈశక్తి ప్రసాద ముచే కలభాషిణి యమరత్వము బడసినట్లు భావింపవచ్చును. నిజపురిని మఱికొంతకాల ముంచున ట్లనుగ్రహింపబడి ద్వారకలో పడినది. దీనితో మన మనసులును కుదుట పడినవి.

పింగళి సూరనార్యుని కలభాషిణి కల్పనమున కచ్చె రువడని వా రుండరు. 'కృత్రిమరత్నము' లని దూషించి నను, కలభాషిణి సజీవమై యాంధ్రసాహితీలోకములో నెప్ప టికిని వర్తిలునదే. కలభాషిణి కారణజన్మురాలు, కళా పూర్ణోదయములో ప్రధాననాయిక. 'ఇది పూర్వజన్మములో బ్రహ్మయింట పెంపుడుచిలుక. సరస్వతీచతురాస్యుల రహస్యలీలలను, అందు పుట్టిన కళాపూర్ణోదంతమును రంభతో జెప్పినదని సరస్వతి శపింపగా ద్వారకలో వార కాంతయై పుట్టినది.' వారకాంతగా నున్న కలభాషిణి వృత్తాంత మంతయు నింతవర కెఱిగితిమి గదా! ఇక నుత్తరజన్మలోకూడ కలభాషిణి యున్నతదశనే పొందినది. సుముఖాసత్తి మణిస్తంభుల ప్రణయఫలితముగా నుద్భవిం చిన కళాపూర్ణునికి తాను భార్యయై మధురలాలస యను పేరుతో బరగి పట్టపురాణి యైనది. మణికంధరుడే సుగాత్రి తండ్రియొక్క యభిలాషానుసారిగా సుముఖాసత్తిమణిస్తం భుల కడుపున కళాపూర్ణుడై ప్రభవించినాడు. ఈ విధముగా కలభాషిణి మఱుజన్మములోగూడ మణికంధరునే భర్తగా బడసి వన్నెకెక్కినది. అందుచేతనే కళాపూర్ణోదయములో ప్రధాననాయిక యైనది.

ఒక్కమారు కలభాషిణిపూర్వోత్తరములను జూతము. మొదలు సృష్టికర్తృసాన్నిధ్యమున వర్తించి, మరు జన్మలో శ్రీ కృష్ణునాదరము బడసి సంగీతవిద్య నభ్యసించి, నారదు డాడించిన నాటకములో పాత్రయై నిలిచి మణికంధ రునిపై నున్న మోహచింతకు పరోక్షముగా ఫల మనుభ వించి, శక్తిప్రసాదమునకు యోగ్యురాలై వర్తించి, మూడవ జన్మలో తన మనోభీష్టమును కళాపూర్ణునిలో దీర్చుకొనినట్టి యుదాత్తచరితము గలిగినది. మూడుజన్మల వృత్తాంతము పొదిగి కథ నల్లి యందు కలభాషిణిపాత్ర మపూర్వముగ పోషించిన పింగళి సూరనార్యునికి జోహారులు.




నా కుక్క సినీమాతారయైన నాటినుండి

# వచనవాఙ్మయ ప్రథమాచార్యుడు



= శ్రీ నిడుదవోలు వెంకటరావు

తెలుగున తొలివచనకావ్యకర్తయు, వచన సంకీర్తన వాఙ్మయమునకు మూలపురుషుడును, వైష్ణవభక్తాగ్రేసరుడు నగు కృష్ణమాచార్యుడు కాకతీయచక్రవర్తులలో కడపటి వాడగు రెండవ ప్రతాపరుద్రుని కాలమున, ననగా క్రీ.శ. ౧౨౯౬ నుండి ౧౩౨౩ వఱకు గల కాలమున నుండెనని ప్రతాపచరిత్రమును, ఏకశిలానగరివృత్తాంతమును చెప్పుచున్నవి. తిరుపతిదేవస్థానమున సంకీర్తనాచార్యులలో ప్రథములు తాళ్లపాక అన్నమయ్యగారు (క్రీ. శ. ౧౪౦౮-౧౫౦౩) కృష్ణమాచార్యుని తమ సంకీర్తనలక్షణమున పేర్కొనుటచే పైకాలము ధ్రువమగుచున్నది. అన్నమయ్యగారి మనుమడు చిన్నన్న తన పరమయోగివిలాసమున నీతని ప్రశంసించియున్నాడు. ఇంతేకాక 'ఆచార్యసూక్తి ముక్తావళి'యందు కృష్ణమాచార్య ప్రశంస కలదు. వీనినిబట్టి చూడ కృష్ణమాచార్యుడు వైష్ణవమత వాఙ్మయమున కాంధ్రదేశమున ప్రథమాచార్యుడని చెప్పనొప్పును.

ఈతడు సింహాచలక్షేత్రనివాసి యని, సింహాచలనరసింహస్వామికి భక్తుడై యతని పేర ననేకసంకీర్తనలు రచియించెనని సింహాచలక్షేత్ర మాహాత్మ్య చరిత్రము తెలుపుచున్నది.

సింహగిరి నరహరివచనము లను పేర సంకీర్తనలు కృష్ణమాచార్యులవారివి నేటికిని వెలయుచుండుటచే నిది నిజమని చెప్పనొప్పును. ఆచార్యసూక్తిముక్తావళిలో -

"కృష్ణమాచార్యుల కీర్తనలనియు
నిత్యభోగము లయ్యె నేటికైన
మఱికొన్ని నాళ్లకు మళ్లి సేబనువాడు
మ్లేచ్ఛాధిపతి వచ్చి మిన్నురాయు
దివ్యవిమానంబు తెగటార్చి కోవెల
బారచాపల తైలభాసితముగ
జుట్టించి కాల్చిన నుడిసి యేడహములు
కాలి భక్త్యుక్తిచే గదలకుండె."

అని యొక యైతిహ్యము*కూడ పైవిషయమును ధ్రువము చేయుచున్నది.

మఱియు తిరుపతిక్షేత్రముపై మహమ్మదీయులు దండెత్తివచ్చినపుడు శ్రీ వేంకటేశ్వరస్వామిని సంబోధించుచు చెప్పిన వెంకటాచలవిహారశతకమున కూడ—

"కృష్ణమాచార్య సంకీర్తనంబులం జిక్కి
సింహాద్రియప్పని చేతగాదు".

అను వాక్యము కృష్ణమాచార్యుని సింహాచలక్షేత్రవాసమును, ఆతని సంకీర్తన ప్రశస్తిని తెలుపుచున్నది.

లక్షణశిరోమణిమతమున తెలుగున వచనరచన అయిదు విధములు: (౧) గద్య,

* విస్తరభీతి నీ యైతిహ్యము నీయలేదు.

(౨) బిరుదుగద్య, (౩) చూర్ణిక, (౪) వచనము, (౫) విన్నపము. వీనిలో కడపటి మూడు తెలుగుల రచనములను కృష్ణమాచార్యుడు రచించియున్నాడు. కృష్ణమాచార్యునికి ముందు గద్య, బిరుదుగద్య లున్నను వచనములు, విన్నపములు నున్నట్లు కానరాదు. కావుననే కృష్ణమాచార్యుని తొలివచనకావ్యకర్త యని పేర్కొంటిని.

౧. చూర్ణికలు.

కృష్ణమాచార్యుడు వీనిని రచియించినట్లు తాళ్లపాక అన్నమయ్యగారు సంకీర్తన లక్షణమున నిట్లు చెప్పినారు. చూర్ణికలక్షణము నీపద్యమున కలదు.

" ధర కృష్ణాచార్యాదిక
పరికల్పితపదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం
బరగును నిర్యుక్తనామభాసితమగుచున్."

(౨౪ పద్యము)

౨. వచనములు.

ఇవి వచనశతకము లని చెప్పనొప్పును. శతకములవలె వీనియందు మకుటనియమము, సంఖ్యానియమము నుండును. శతకములలో వృత్తజాతు లుండును. వచనముల కేవల గద్యముమాత్రమేయుండును. శతకములోవలె నొక్కొకయెడ సంఖ్యానియమము సడలుట గలదు. శతకములందువలె నిందు భక్తిరసము పొంగిపొరలుచుండును.

శైవవైష్ణవవాఙ్మయమున నిట్టి ప్రశస్త రచనము గల వచనము లెన్నియేని కలవు. శైవమున పురాతనశంకరవచనము లనుపేర 'నను రక్షింపవే భవానీమనోహరా' అను మకుటము గల వచనములు ప్రచారమున నున్నవి. వైష్ణవమున 'వేంకటేశ్వర వచనములు' ('వేంకటేశ్వరా!' అను మకుటము గలవి. తాళ్లపాక తిరుమలయ్యగారివి) భారతి ౨ సంపు. ౨ సంచికలో కొన్ని ప్రకటితములైనవి. వాని నొకపరి చదువుడు.

సింహగిరి నరహరివచనములు—'సింహగిరి నరసింహా నమో నమో దయానిధీ!' అను మకుటముతో నున్న వచనములు కృష్ణమాచార్యరచితములు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో గలవు. ఇవియే విష్ణునామ సంకీర్తనఫల మనుపేర తంజావూరి పుస్తకశాలలో నున్నవి.

౩. విన్నపములు.

ఇవి 'నమో నమో లక్ష్మీవల్లభా' అను మకుటము గలవి. ఈ విన్నపములు శఠకోపముని ద్రావిడవేదమునకు తెనుగు. కృష్ణమాచార్యుడు ద్రవిడవేదమును తెలుగుకావించినట్లు తాళ్లపాక చిన్నన్న పరమయోగివిలాసావతారికలో నిట్లు చెప్పినాడు:

"శఠమతరాద్ధాంతసంహారి యైన
శఠకోపముని బోలు శఠకోపమౌని
వేదంబు తెనుగుగావించి, సంసార
ఖేదంబు మాన్పిన కృష్ణమాచార్యు"

అని ప్రత్యేకముగ పేర్కొనినాడు. విన్నపము మచ్చుతునక:—

"అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! మీకు పునఃపునఃప్రదక్షిణ నమస్కారంబు చేసి నా తుచ్ఛమనస్సున మిమ్ము వర్ణించెద. వాక్పతిబృహస్పతి దివస్పతులకైనను వర్ణింపనలవికాని మీ దివ్యతిరునామములు

వర్ణించుచున్నాడనే దేవ ! అచ్యుత! అనంత! ఆశ్రితరక్షక ! అఖిలాండకోటి బ్రహ్మాండ నాయక! ఆదిమధ్యాంతరహిత.........

శరణాగతవజ్రపంజరా! నాదురితంబులు ఖండించి మీదాసానుదాసులకు దాసుండనై వర్తించే బుద్ధి పుట్టించి నాదుర్గుణంబులు చూడక మీ పతితపావనబిరుదు ప్రతిష్ఠించి పతితుండనైన నన్ను రక్షించవే ఆశ్రితజన మందార ! అఖిలలోకాధార ! అఘదూర ! నమో నమో లక్ష్మీవల్లభా !"

తెలుగువాఙ్మయమున మధురకవితా శాఖకు చెందిన యిట్టిరచనములకు పర్యాప్తమైన పరిశీలనమేని లేదు. ఈ వచనముల యందును, విన్నపములయందును వెల్లివిరియు భావములు విశ్వజనీనములై, రవీంద్రుని గీతాంజలిని దలపించుచుండును. వైష్ణవ మతవాఙ్మయమున నభిమానము గలిగి పరిశ్రమచేయువా రీవచనములను, విన్నపములను సంపాదించి ప్రకటించిన భాషావాఙ్మయ చరిత్రకారుల కవి యత్యంతోపాదేయములగుటయే కాక భక్తజనులకు పారాయణ యోగ్యములుగకూడ నుండును.

కేవలమతసంప్రదాయపేటికలయం దడగి యున్న యిట్టి కృతిరత్నములను వెలికిదీసి సాహితీసౌధములో ప్రకాశింపజేయుట సాహిత్యోపాసకుల కర్తవ్యము. అప్పుడు కృష్ణమాచార్యుని కాంధ్రవాఙ్మయమున గల స్థానము కాలమే స్థిరీకరింపగలదు.



# ఉషస్విని

[గేయనాటిక]



## = శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు =

### సారాంశము

అది యుగసంధికాలము. అంధకారావృతమైన లోకము కౌలాసురు పాలనకు వశమైనది. మానవజాతీయనాయకుడైన యుగపురుషు డొక్కడే ఆ అసురశక్తిని ధిక్కరించినవాడు. అతడు తత్ఫలితముగా పశ్చిమగిరిసానువున శిలువపడి స్వాతంత్ర్యోషస్సునకు ఎదురుచూస్తున్నాడు. కాలకింకరులవలన యుగపురుషుడు సహించు హృదయవేదనలకు సోదరి వారుణి, మాతృమూర్తి ధారుణి ఏకైకసాక్షులై, ఉపశమనవాక్కు లందిస్తున్నారు. యుగపురుషుని ఆత్మేశ్వరి ప్రాచీదేవి ప్రియునికి దూరముచేయబడి, పూర్వసాగరవలయితమైన జంబూద్వీపమందు ప్రవాసిని లోకవిముక్తికొరకును నవయుగోదయము నాసించి తపోనిమగ్న అయివున్నది.

పశ్చిమసాగరకుమారి వారుణిసహకారమున ప్రాచీదేవితపఃఫలముగా ఉగాదిప్రాతస్సున స్వాతంత్ర్యోషస్విని ఉదయించి యుగపురుషుని బంధనమోచన మౌతుంది. కౌలాసురు పాలన మంతరిస్తుంది.

[బృందగానం]

చీకటి చీకటి లోకమంతటా,
చీకటి చీకటి నాకవాటిలో,
చీకటీ!...కటిక చీకటీ!...

చీకటింటి వాకిలి తెరిచే
శ్రీ ఉషస్వినీసముజ్జ్వలోదయ మెపుడో?
ప్రాకులాడు జీవరాశి దినకరు
కాక దేర్చి సాకు నాయుషస్విని
ఈ కరాళయామినీ ప్రవాహిని
రేకువిరిసి దారిజూపు టెపుడో?
చీకటి చీకటి లోకమంతటా.

సమర సంకులత సర్వదిశల దు
ర్మరణవిరావము లెల్లెడల,
జరాపరాజిత మానవజగతీ
పునరుజ్జీవన విభాత మగునా?
ధరావలయమున ప్రభాతమగునా?
కరాళయామిని కరగి తరలునా?
చీకటి చీకటి లోకమంతటా.

ఆకలిమండే లోకపుగుండెల
అమృతశాంతిరూపిణి ఉషస్వినీ-
విమలకాంతిరూపిణి ఉషస్వినీ-
చరణధ్వని విననగునో!-
దినకరాగమన మగునో!
చీకటి చీకటి లోకమంతటా,
చీకటి చీకటి నాకవాటిలో,
చీకటీ!...కటిక చీకటీ!...

దృశ్యము ౧

[బృందగానం మందంగా విరమించినపిమ్మట ప్రశ్నోత్తరరూపంగా ప్రకటన]

* అఖిలభారతరేడియో - మద్రాసు కేంద్రము వారి అనుమతిని.

యుగపురుషుని పశ్చిమదిగ్గిరి
కటకతటమ్మున
బంధితు జేసినవా డెవడు?—
కాలాసురుడు!—కాలాసురుడు!
యుగపురుషుని శాతనిశా
త్రిశూలమున
గ్రంథితు జేసినవా డెవడు?—
కాలాసురుడు!—కాలాసురుడు!
యుగయుగాలు తరతరాలుగా
సొగసిన
యుగపురుషుని హృదయవిహా
యసమున
రగిలే వేదనతుదిఘడియెప్పుడు?—
కాలాసుర కరాళశక్తిని కరగించే
దివాకరోదయ మయినప్పుడు!
ఆ దివాకరోదయ మెప్పుడు?—
ఎప్పుడు?.
ఉగాదిప్రాతర్ముహూర్తమప్పుడు!

యుగపురుషుని నిగళబద్ధగళ
విగళితశ్రుతులు
భుగభుగమని లేస్తున్నాయి!!

[అల్పనిశ్శబ్దానంతరం యుగపురుషుని గానం.]

యుగపురుషుడు

హే కాలాసురమూర్తీ!
గాఢతిమిర చక్రవర్తీ!
వేలవేల వత్సరాలు
ఏలితి వీ త్రిభువనాలు
బానిసలను హాలాహాల
పానము చేయించావు.
లోకస్థుల మూకబాధ
నాకళించి నాగుండెల,
ధిక్కరించి నీ కరాళ
శక్తిని, శిలువైనా నిట!

ఆశోషస్వినికొరకై
హాహారవములు జగతిని
ఆవరించి ఆవరించి
అణగి నశించాయి.
ఆ వేదన నాలోలో
ఆవిరులై, కావిరులై,
అంధనిశావరణము నీ
రంధ్రము జేసింది!!

[గానరావం విశమిల్లగానే కింకరనాయకుని ప్రవేశం]

కింకరనాయకుడు

రండోయీ, పలలాశనులారా!
కాలాసుర కింకరులారా!
తెండోయీ కలతకలల,
గుండెల నెత్తురుపిండే
కొఱతవెతల,
క్షితితలమున పండే
గాఢవేదనా రహస్యగాథల!
రండోయీ, పలలాశనులారా!!

కింకరుల మూక

భూగోళపు టంచులనుండీ
పాతాళపు మంచులనుండీ
నిర్జీవ నిశీథిని చెరలో
పునరుజ్జీవోషస్విని
కనుమూసిన

భూగోళపు టంచులనుండీ
పాతాళపు మంచులనుండీ
కాలకింకరుల మోస్తున్నాము!
కరాళపాశము తెస్తున్నాము!

నాయకుడు

కృంగని యీ బాధాజీవిని
లొంగదీయ రండోయీ!

మూక

రెక్కలేని మా లోహపాదములు
ధిక్కరించు వారిధిరహాధారులు
దాటీ......
నాకలు మునిగిన కెరడులపై
కాటకమెరిగిన పెరడులపై
పయనించిన భూతాలము మేము!
పరుగుపరుగుమని వస్తున్నాము!

నాయకుడు

వేదనయవనిక చించండి!
గుండెల రంపము లుంచండి!

మూక

చురచుర మండే మేకులమై
తొరతొర పొడిచే బాకులమై
—యుగ
పురుషుని గుండెల కండలు నమిలే
రక్కసికోరలు విచ్చాము!
రగిలే వేదన తెచ్చాము!!

... ... ...

[రణగొణధ్వని విరమించిన నిశ్శబ్దంలో యుగ
పురుషుని కంఠం]

యుగపురుషుడు

అంతులేని అవధిలేని
ఆ వేదన, ఆ వేదన...
అంతరాన ఆరిపోని
ఆశాదీపారాధన!...

జంబూద్వీపాంతరవా
సంబున ప్రాచీప్రేయసి
పశ్చిమదిగ్గిరినిబద్ధ
ప్రాణేశ్వరు మోక్షలక్ష్మి
ప్రణయతపఃఫలమా సు
క్షణికము నను దరిసేనా?
తరుణోషస్విని ప్రాత
ర్భువనమ్మున విరిసేనా?—
నా బాధలు, మాతృమూర్తి!,
ఓ ధారుణి! విన్నావా?
నా వేదన, సహోదరి!,
ఓ వారుణి! విన్నావా?

ధారుణి

ధీరసుందరకుమారా! నీ
ఘోరశైల కారాగారము
చేరువనే నేనున్నాను;
ధారుణిమాతను, విన్నాను!

వారుణి

అగ్రమానవా! ఆశాజ్యోతిని
ఆరనీకుమోయీ,
అంతరంగవేదిక నైరాశ్యము
జేరనీకుమోయీ,
ఓరిమి విడకోయీ!
వ్యగ్రమైన నీ ఆర్తిభర మ్మొద
లో గ్రహించి నీ సోదరి వార



# ఇండియాకు సహాయపడండి

అది ఎల్లాగ అంటే ఈ విధంగా :




మీ స్వంత వస్తువును, లేదా మీరు ఉపయోగించేదానిని సాధ్యమైనంత ఎక్కువ కాలం వచ్చేటట్టు చెయ్యండి. క్లుప్తంగా వుండడం ఫేషన్ అయిపోవడమే కాకుండా, అది దేశభక్తిలో కూడిన విధిగా కూడ ఉంది. సప్లయిలపై జరిగే వొత్తిడిని తగ్గించడానికి మీరు సహాయపడకపోతే, ఇండియాలోని పేద ప్రజలు అష్ట కష్టాల పాలవుతారు.

స్వవిషయంగా చూసుకుంటే కూడ, ప్రతినిత్యం క్లుప్తంగా వుండడం ప్రతినిత్యం కొద్ది డబ్బును ఆదా చేసుకొనడం అన్న మాట. ఇప్పుడు మీరు మిగల్చుకొనే రూపాయలు త్వరగా పెద్ద మొత్తంగా కాగలవు.



ఎలక్ట్రిసిటీ తక్కువ వాడండి

**1** అవసరం లేనప్పుడు ఫాన్‌లను ఉపయోగించవద్దు. దీపాలను ఉపయోగించవద్దు.



**2** పైపులలో నీటిని జాగ్రత్తగా వాడండి. అదనపు ఖర్జీలు యిచ్చుకొనడమెందుకు ?



**3** విలువగల బహుమతులు యివ్వవద్దు.



ప్రయాణాలు మాని డబ్బుకూడబెట్టండి.



**5** పింగాణీ పాత్రల బదులు లోహపు పాత్రలను ఉపయోగించండి.

సంవత్సరానికి ఒకసారి తప్ప కొత్త బట్టలు కొనవద్దు.

## సాధ్యమైనంతవరకు ఏదీ కొనవద్దు.

AAA 6

ఇండియా ప్రభుత్వపు సమాచారం, బ్రాడ్‌కాస్టింగ్ శాఖవారి ప్రకటన.

ఉగ్రతపము చేసే ప్రాచీప్రియ
దగ్గరకే పయనించేను!
భగ్నమర్త్యలోకానికి ప్రణయో
ద్విగ్నకాంతి తెచ్చేను!

దృ శ్య ము ౨

[ప్ర క ట న]

యుగాంతమునకూ యుగోదయానికీ
నడుమగలుగు నాసంధిసమయమున
యుగపురుషుని విడివడిన వియోగిని
జగతీమోచన సాధకయోగిని
ప్రాచీదేవత పవిత్రజంబూ
ద్వీపాంతరమున వెలిసినది,
పశ్చిమవారిధికన్యక వారుణి
నిశ్వాసమ్ముల బిలిచినది

[స్త్రీ కంఠంతో గానం చేరువచేరువగా విని పిస్తుంది.]

వారుణి (ప్రవేశం)

తెల్లరెక్కల దోడిగి
తేలివస్తున్నాను,
నల్లచీకటితెరల
నడచివస్తున్నాను,

ప్రాచీతపస్వినీ
పట్టుకొస్తున్నాను
లోకమిత్రుని త్యాగ
మోచనంపు సువార్త!

హృదయనాథుని వీడి
ఎదప్రసూనము వాడి
వదలబోకుము ధైర్య
మోహా ప్రాచీదేవి!

ప్రా చీ దే వి

అపరాంబుధికన్యా, వారుణి! నా
ఆత్మేశుని సహజస్మి, వారుణి!
అరుగుదెంచినావా!-సుదిగిన నా
ప్రణయమూర్తి గన్నావా?

వా రు ణి

నాకళ్లల్లో నే గన్నట్టివి,
నా గుండెల్లో నే విన్నట్టివి,
లోకబాంధవుని మూకవేదనలు
సేకరించి తెచ్చా నీకోసము,
శోకవిమోచని ప్రాచీదేవీ!

ప్రా చీ దే వి

ఏవేవీ నీ వాలికకన్నుల
లోలో మరిగే దృశ్యాలు,
హాలాహలపు రహస్యాలు?...
కరాళసత్యము కదిలే తెరపై
తరుణోషస్విని నృత్యా లవిగో!
పశ్చిమగిరిపై ప్రాచీతారక
ప్రతిబింబించిన ముత్యా లవిగో!...
పాతాళాండము బీటలువారెనో,
ప్రభాతడిండిమ ప్రతిధ్వనించెనో,
ప్రతిరుతు లేవో ప్రాకెడి! ప్రాకెడి!
ప్రతీచిసోదరి! విన్నావా??

[డిండిమధ్వని, నెమ్మది నెమ్మదిగా ప్రతిధ్వనులు వినిపిస్తాయి.]

వా రు ణి

తరగ తరగలై తనువుపులకలై
విన్నానమ్మా, ప్రాచీసోదరి!
విన్నానమ్మా, విన్నాను!!

ప్రతిరుతులు (దూరంనుంచి చేరువగా)

ప్రాచీవియోగినీ! పలుకుతున్నా మోప్ర
తీచీకుమారి వారుణి!, ఆలకించండి!
పాతాళగోళమ్ము బ్రద్దలైన నినాద
ప్రతినిధ్వనులము మా పలుకు లందుకొనండి!
ఆకాశధారుణుల ఆదిపుత్రికలార
అనుసరింపుడి మాఅదృశ్యపాదధ్వనుల్
రోచీసముజ్వలోపసిదేవి వేంచేయు
ప్రాభాతఘటికలా పాతాళమున దాగె,
ప్రాచీతపస్వినీ పాదమంటినగాని
పలకనంటున్నాయి, వెలికిరాకున్నాయి!
జలజాతముకుళాల జంటతేరుల నెక్కి-
అరుదేరి వేవేగ ఆ పుణ్యఘటికలను
ఆవాహనముచేసి తేవాలి, తేవాలి!
పరచీకొని రండమ్మ ప్రతిరుతులవెన్నంటి,
బ్రతిమాలి తెండమ్మ ప్రాభాతఘటికలను !!

దృ శ్య ము 3

[ప్రకటన : బృందగానం : స్త్రీ కంఠాలు]

ప్రాచీదేవత పాదముమెట్టిన
పట్టులు పచ్చికప ట్లయినాయి!
వారుణీసోదరి తేరు నటించిన
తీరము లామనిసీమ లయాయి!
నదీనదమ్ములు, కానలు, కొండలు,
అదిరిపడే వారిధికెరటమ్ములు,
గాఢతామసీగహ్వరవిహ్వాల
కవాటఘంటలు కదిలాయి!—
కదలికదలి మృదులమధురచేతనతో
కలతనిదుర మేల్కొన్నాయి!
ఉషోదేవతాప్రసవముహూర్తపు
ఘటికలు ఘంటల రథములపై
తృషార్తమయి వస్తున్నాయి !!

[ఒక రథముపై వారుణీప్రాచీదేవులు, వారిని వెన్నంటి మరొక తేరుపై అధివసించిన ఉషాదేవి ప్రవేశం]

వ ణి

ఓశుభఘటికములారా!
ఆశాళల నలముకునే
ఆ రక్తిమ విప్లావము
అర్థమేమి? అర్థమేమి?

ప్రా చీ దే వి

జలధిసుతా! నీమోమున
నలదిన కుంకుమమట్టుల
కలకల తూరుపుకనుమల
తెలవారిన జాడ లవే!

వా రు ణి

అదిగో, నీ కావిమోవి
మెదిలే చిరునవ్వులపై
మృదులమృదుల రక్తరాగ
సుధలు ప్రిదులుతున్నాయి,
సోదరి ప్రాచీదేవీ!
తెలవారే శుభఘటికల
తేరున మన మున్నామా?—
పలపల నిక శ్రీయుషసీ
ప్రాభాతోదయమేనా?—
సోదరి ప్రాచీదేవీ!

ప్రా చీ దే వి

వేదన లుడిగే వేళ,—
ఆదిమయుగపురుషుని ఆ
వేదన లుడిగే వేళ,—
వేగుజా మిదే నెచ్చెలి వారుణీ!

[ఇంతలో ప్రాచీదేవి, వారుణి భూమండలం చేరుకుంటారు.]

[ప్రాచీదేవి : వారుణి]

ధారుణిమాతా! ఉషోముహూర్తపు
వారువములపై వచ్చాను, యుగ
నాయకు మోక్షము తెచ్చాను!!

త్యాగమ్ములో దివ్య
    రాగోదయము విచ్చు
తేజోముహూర్తమ్ము
    తెచ్చినారమ్మా!
    వచ్చినారమ్మా!
మూగకంఠమ్ములో
    ముక్తి రక్తిమ మొలక—
ప్రాచిరుజ్వలకాంతి
    పలకరించిందా?—
రోచిరుజ్వలశాంతి
    చిలకరించిందా?

యుగపురుషుడు

శిలువపై నా గుండె
    శిథిలమైన నిశీథ
నరకకూపము తల్పు
    తెరిచినారమ్మా!
    పిలిచినారమ్మా!

క. అంధాంతరాళజలధీ
మంథనమనుభూతమయ్యె, మహాద్రికారా
బంధనము సడలె,నుదయా
ద్రిం ధవళారుణసువర్ణదీప్తులు రగిలెన్!
వేదఋషి ప్రోక్తమ్మగు
నాదిప్రాభాత మేదో యుషసీపలయ
శ్రీరమ్మై, శ్రీయుషసీ [సలపెన్!
స్వాదుమహాస్వనల ఘుంగ్రుచాయల

[ఫలశ్రుతి : బృందగానం]

గణగణగణ గణగణ గణగణ
    ఘంటల గజ్జెల గుర్రాలు!
కలకలకల కలకల కలకల
    శ్రీయుషస్వినీ రథ్యాలు!
పలపలపల పలపల పలపల
    తెలతెలవారే కిరణాలు!

ఛలఛలఛల ఛల్‌ఛల్ ఛల్‌ఛల్
ఘులుఘులుఘులు ఘుల్‌ఘుల్ ఘుల్‌ఘుల్
    కిరణపుకల్లోం కదిలింది!
    మరణపు తిమిరం చెదిరింది!
    తూరుపుగొళ్లెం ప్రిదిలింది!
వేకువ రేకులు, వేకువ రేకులు
వెలుగుల తరగలు, వెలుగుల తరగలు
లోకమంతటా విరిశాయి!
ఉషాతుషారం కురిశాయి!!



# పాల్కురికి సోమనాథునికాలము



= శ్రీ చిలుకూరి నారాయణరావు =

ఈ విషయమై పండితారాధ్యచరిత్రపీఠికలో విపులముగా చర్చించినాను. అంతకంటె ఎక్కువ చెప్పడానికి ఇప్పటి స్థితిలో ఆధారము లంతగా లేవు. ఎంత నచ్చజెప్పినా, ఒక వాదము ఇష్టములేనివారు పదేపదే మొదటికి వస్తూఉంటారు. వారితో వాదించి ప్రయోజనము లేదు. "ఒక వ్యక్తి ఇట్లా అన్నాడు, మరొక వ్యక్తిన్ని అట్లాగే అన్నాడు. అందుచేత ఈయన చెప్పిన మాటలు విశ్వాసపాత్రములు కావు" అని వ్యక్తుల అభిప్రాయములను తమ వాదమున కుపబలముగా చేసుకొనేవా రాత్మతృప్తి పొందడాని కధికార మున్నదికాని, సత్యము ఆమార్గములో లేకపోవచ్చును. అందుచేతనే నిష్పక్షపాతమైన విమర్శన మావశ్యకము. పాల్కురికి సోమనాథు డేకాలమువాడయితే మనకేమి? మనకు కావలసినది అతని గ్రంథములు; వాటి మూలముగా మనము పొందగల విజ్ఞానానందములుమాత్రమే. అయినా చరిత్రజిజ్ఞాసువులకు కాలనిర్ణయసమస్యలు మనస్సును ఆందోళన పెట్టడము సహజము; అనివార్యము.

పాల్కురికి సోమనాథుని కాలనిర్ణయము చాలా క్లిష్టమైనదని పండితారాధ్యచరిత్రపీఠికలో మనవిచేసినాను. తత్త్వనిర్ణయమునకు కొన్ని మూలవిషయములను గురించి నిశ్చయము కలుగవలెను. అట్టి మూలవిషయములే నిశ్చయములుకానప్పుడు తత్త్వనిర్ణయమునకు డొంకతిరుగుడుగా ప్రయాసపడడము నిష్ఫలముగదా. పాల్కురికి సోమనాథుని కాలమును నిర్ణయించడానికి ప్రాతిపదికములైన మూలాధారము లేవి?

౧. బసవేశ్వరుని కాలము, ౨. ఉద్భటచరిత్రమును వ్రాసిన సోమరాజుకాలము, 3. పిడుపర్తి సోమనాథుని కాలము, ౪. కొండవీటి దండకవిలెకాలము, ౫. పైరెండింటిలో పేర్కొనబడిన ప్రతాపరుద్రు డెవరు అనేవిషయము, ౬. సోమనాథుడు తనకు సమకాలికులుగా పేర్కొన్నవారి కాలము, ౭. ఇతరాధారములు.

పైవాటిలో ఒక్కటిన్ని సందిగ్ధావస్థలో లేనిది లేదు. బసవేశ్వరుని కాలమును నిశ్చయముగా నిర్ణయింపగల శాసన మొక్కటిన్ని లేదు. అయినా, గ్రంథస్థమైన సాక్ష్యమునుబట్టిన్ని, జనశ్రుతినిబట్టిన్ని బసవేశ్వరుడు చారిత్రకపురుషుడని ఒప్పుకోకతప్పదు. కథలలో ఎన్ని అసందర్భములున్నా అతనికిన్ని, బిజ్జలునికిన్ని గల సంబంధము నొప్పుకోకతప్పదు. ఈ బిజ్జలుడు రెండో బిజ్జలుడే అయితే ౧౧౬౦ సం.ర ప్రాంతమువాడు కాబట్టి బసవేశ్వరుడుకూడా ౧౧౬౦ సం.ర ప్రాంతమువాడే అనవలెను. ఈ తేదీ మన అన్వేషణమునకు ప్రథమాధారముగా ఏర్పరుచుకొన్న సర్వేరాయి. దీనిని కదలిస్తే ముందుకు సాగడము కష్టము.

సోమరాజు ఉద్భటకావ్యములో "శాలివాహనశాకాబ్దము దెద్దెసాసిరదనానూఱ సందనాల్వత్తునాల్కనెయారంజితచిత్రభానువవర్శ్వజోత్సి త్రైకాదశీవనజారాతితనూజవాసరదోళ్" అని నేనున్న, వెంకటసుబ్బయ్యగారున్న చూచిన అన్ని ప్రతులలోను పాఠ మున్నది. "నూఱెంసంద" అనే పాఠ మొక్కదానిలోను లేదు. తాము "నూఱెంసంద" అనే పాఠమును చూచినట్లు సమాధానము చెప్పిన నరసింహాచార్యులవారు తత్త్వజిజ్ఞాసకులయినా తామట్టి పాఠమును చూచిన వ్రాతప్రతిని పరిశోధకుల యెదుట పెట్టవలసిన బాధ్యత ఉండేది. ఆ ప్రతిని చూపవలసినదని కోరినా వారట్లు

చేయకపోవడము చారిత్రకుల దురదృష్టము గాని వేరు కాదు. నరసింహాచార్యులవారు శివంగతులయినారు. వారా పాఠమును చూచినారే అనుకొందాము. అప్పటి కిన్ని "నూజిం" అనే పాఠము సరికాదని సులభముగా కనుగోవచ్చును. "శా. శ. ౧౧౮౪ చిత్రభాను ఆశ్వీజ శుద్ధ ఏకాదశీ బుధవారము" అని నరసింహాచార్యులవారి పాఠము.

"శా. శ. ౧౪౮౪ చిత్రభాను ఆశ్వీజశుద్ధ ఏకాదశీ బుధవారము" అని కర్ణాటకసాహిత్యపరిషత్, మైసూరు ప్రాచ్యలిఖితగ్రంథభాండారము, ఇతరత్ర ఉన్న ప్రతులలోని పాఠము.

ఈ రెండు సంవత్సరములకున్ను ౩౦౦ ఏండ్ల భేద మున్నది. కాబట్టి ఒకటి ఏ బార్హస్పత్య సంవత్సరమైతే రెండోదికూడా అదే అవుతుంది. శా. శ. ౧౪౮౪ సం. రము చిత్రభాను ఆశ్వీజ శుద్ధఏకాదశి బుధవారమే. అందుచేత దీనినిగురించి సందేహించ నక్కరలేదు. కాని శా. శ. ౧౧౮౪ చిత్రభాను ఆశ్వీజశుద్ధ ఏకాదశి ఆదివార మవుతుంది గాని బుధవారము కాదు. అందుచేత ఇది సందేహించదగినది. ఈ సందేహమునకు నరసింహాచార్యులవా రిచ్చిన సమాధానమేమంటే శా. శ. ౧౧౮౩ వృష సం.ర ఆశ్వీజ శుద్ధ ఏకాదశీ బుధవారమనిన్ని, ఇట్టి వారముల తప్పు లక్కడక్కడ శాసనాలలో కనబడుతవనిన్ని. కాని ఈ పద్యము శాసనములోనిది కాదు గదా. అది ఒక కావ్యములోనిది. కవి స్వయముగా వ్రాసినది. పోనీ, ఒక సంవత్సరమును తప్పించి సంవత్సరముల పేళ్లను చెప్పే ఆచార మాకాలములో ఉండేదంటారా? ఉంటే ఆకాలపు అన్ని శాసనాలలోను అట్లే ఎందుకు లేదు? ఆనాటి సంప్రదాయముప్రకారము సంవత్సరముల పేళ్లను ఒక యేడు వెనుకకు జరిపి చూచుకోవలె నని కదా ఆచార్యులవారి సూచన? అట్లు జరుపవలె నని ఏ సంప్రదాయగ్రంథములో నయినా ఉన్నదా? అన్ని వివరములలోను సరిగా సరిపోయిన పాఠమును విడిచి కిట్టించుకోనవలసిన పాఠమునే పట్టుకొని ఏల ప్రాకులాడవలెను? వ్యాకరణదోషము నూహించుకొని తత్త్వమును మరుగుపరిచే సవరణ నేల చేయవలెను? వ్యాకరణమునకు ప్రాధాన్య మిచ్చి భాషాసంప్రదాయము మరుగుపరచడముకంటె ఘోర ముండబోదు. కేవలాంధ్రవైయాకరణు లిట్టి ఘోరముల నెన్నిటినో చేసినారు. కాని, ఇట్టి తత్త్వనిర్ణయపు పట్టులో అనాలోచితమైన మార్పులను చేయడము మరింత ఘోరముకదా! ఇంతకును శబ్దమణిదర్పణకారుడు బ్రహ్మదేవుడా? కర్ణాటక భాష నంతటిని అవలోడనము చేసి ఆభాషకు సంపూర్ణ లక్షణమును నిర్మించినాడా? శబ్దమణిదర్పణములో అనుక్త, దురుక్త, అత్యుక్త, హీనోక్తలక్షణము లెన్నో ఉన్నవి. కన్నడకావ్యములలో ఎక్కడను కనబడని 'అత్తణిం' మొదలయిన పంచమీవిభక్తిరూపములను, 'దపం' మొదలయిన క్రియాప్రత్యయరూపములను ఉదాహరించిన మహానుభావు డీ శబ్దమణిదర్పణకారుడే కదా. "నానూజ్ సంద" అనుటలో వ్యాకరణదోష మేమున్నది? శబ్దమణిదర్పణకారు డన్నాడన్నమాత్రముచేత అది దుష్టప్రయోగ మవుతుందా? "నానూజ్ సంద" అనేది దుష్టప్రయోగముకాదు. అట్టి ప్రయోగము లెన్నో కర్ణాటకవాఙ్మయములో ఉన్నవని పండితారాధ్య చరిత్రపీఠికలో చెప్పియే ఉన్నాను.

కాబట్టి, సోమరాజుకాలము శా. శ. ౧౧౮౪, క్రీ. శ. ౧౨౬౨ సం.రము కావడము సత్యము. అందుచేత పాల్కురికి సోమనాథుడు క్రీ. శ. ౧౨౬౨ సం. రమునకు పూర్వుడు కాడు. ఆసంవత్సరమునకు తరువాతివాడే.

సోమనాథుడు కులోత్తుంగరాజేంద్ర చోళుల పేళ్లను స్మరించినాడు. ఈవిషయమై నా పండితారాధ్యచరిత్రపీఠికలో చర్చించినాను. దానినిబట్టి చూచినా సోమనాథుడు క్రీ. శ. ౧౨౧౬ సం.రమునకు తరువాతివాడే అవుతాడు.

సోమనాథుడు బసవేశ్వరునికి సమకాలికుడు కాడన్న మాట స్పష్టమేకదా. సమకాలికుడయితే బసవనిగురించిన్ని, అతనికి సమకాలికుడైన మల్లికార్జున

పండితారాధ్యునిగురించిన్ని ఆరీతిగా వ్రాయడుగదా. బసవని కాలము క్రీ. శ. ౧౧౬౦ ప్రాంతముగనుకను, మొదటి ప్రతాపరుద్రుడు అదేకాలమువాడు గనుకను సోమనాథుడు మొదటి ప్రతాపరుద్రుని కాలమువాడు కాడన్నమాటకూడా స్పష్టమేకదా. అందుచేత పిడుపర్తి సోమన్న వినికిడివలన చెప్పిన ప్రతాపరుద్రుడు రెండో ప్రతాపరుద్రు డన్నమాట స్థిరపడుతున్నది. పాల్కురికి సోమన వృద్ధాప్యమున ఓరుగల్లుప్రాంతమును విడిచి తన జన్మస్థానమునకు పోవడానికి కారణము కొలదికాలములో దేశము తురుష్కాక్రాంతము కాబోతున్న దనేది పిడుపర్తిసోమన్న తెలిపిన ప్రతాపరుద్రుడు రెండో ప్రతాపరుద్రు డయితేనే సరిపోతుంది.

గణపతిదేవుని శాసనములను, ఇతరశాసనములను ఉదాహరించి పాల్కురికి సోమన గణపతిదేవుని కాలములోను, రుద్రాంబ కాలములోను, రెండో ప్రతాపరుద్రుని కాలములోనుకూడా ఉన్నాడని తెలుపుతూ బసవపురాణ పండితారాధ్యచరిత్ర రచనాకాలములను పండితారాధ్య చరిత్రపీఠికలో సూచించినాను.

ఇట్లుండగా కొండవీటిదండకవిలెలోనిదని గురునాథశర్మగా రుదాహరించిన శాసనమును పట్టుకొని దానిలోని ప్రతాపరుద్రుడు మొదటిప్రతాపరుద్రుడే అని చెప్పదొరకొనడము స్వీయవాదమును స్థాపించవలె ననే పట్టుదల తప్ప మరొకటి కాదు. వీరేశలింగముగారు, వీరభద్రరావుగారు, వీరభద్రశర్మగారు గొప్ప పండితులే. కాని, 'ప్రమాదోధీమతామపి.' వ్యక్తులితర విధముల నెంతటి గొప్పవారయినా తత్త్వనిర్ణయముపట్టున తగిన ఆధారములు లేనిదే వారిమాటలను ప్రమాణములుగా అంగీకరింపవీలులేదు.

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాసిన వ్యాసము ప్రకారము పండితారాధ్యచరిత్రపీఠికలో నేను చేసిన సోమనాథుని కాలనిర్ణయము స్థిరపడుతున్నది. సోమశేఖరశర్మగా రుదాహరించిన శాసనములోని రెండ్రేవుల మల్లినాథుడు రెంటాల మల్లినాథుడు కాజాలడని శ్రీ తమ్మయ్యగారి వాదము. 'రెండ్రేవుల' 'రెంటాల' అనే రెండుపదములున్ను గ్రామనామములు. ఏకగ్రామమునకు రెండుపేళ్లతోను వ్యవహార ముండవచ్చును. ఒకటి రెండోదానికి వికారము కావచ్చును. ఆదవాని, ఆదోని; నంద్యాల, నందేల; కందనోలు, కర్నూలు; రాయచూరు, రాచూరు — మొదలయిన వెన్నో ఉదాహరణము తీయవచ్చును. అట్లే రెండ్రేవుల, రెంటాల అనే రెండు పేళ్లున్ను ఏకగ్రామమునకెందుకు చెందకూడదో తెలియదు. ఛందోబద్ధమైన ద్విపదపాదములో 'రెంటాల' అని ఉండడముచేత 'రెంటాల'అనే పేరే సరియైనదని తమ్మయ్యగారి వాదము. రెండుపేళ్లలోను ఛందస్సుకు సరిపోయిన పేరునే కవి వాడుకొన్నాడంటే, ఆక్షేప మేముంటుంది? రెండ్రేవులకే రెంటాల అనేది పర్యాయనామమని సోమశేఖరశర్మగారితో నే నేకీభవిస్తున్నాను. కరస్థలి సోమనాథయ్య, విశ్వనాథయ్య, గోడగిత్రిపురారి మొదలయిన పాల్కురికి సోమనాథుని సమకాలికులనుగురించి తెలిపే శాసనములు గణపతిదేవుని కాలము నాటివి కావడము, అట్లే తనకు సమకాలికుడని పాల్కురికి సోమన తెలిపిన రెంటాల (రెండ్రేవుల) మల్లినాథుని గూర్చిన శాసనము కూడా గణపతిదేవుని కాలము నాటిదే కావడము, దేచమాంబ పేరుకూడా ఉదాహరింపబడడము, వీటి నన్నిటినీ చేర్చి నిష్పక్షపాతముగా ఆలోచిస్తే పండితారాధ్యచరిత్రపీఠికలో, నేను చేసిన సోమనాథుని కాలనిర్ణయము సరియైన దనిన్ని, దానిని సోమశేఖరశర్మగారి వ్యాసము స్థిరపరుస్తున్న దనిన్ని చెప్పక తప్పదు.

ఇక నీవిషయమై ఇతర ప్రామాణికాధారములు దొరికేవరకు ఇప్పుడున్న ఆధారములతోనే చర్విత చర్వణముగా వాదమును పెంచుకొనుటవలన లాభము లేదని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

# దళవాయి - మహామంత్రి

## = శ్రీ సత్యదుర్గేశ్వరకవులు =

శ్రీకృష్ణదేవరాయల పుత్రుని ఎవరో కొందరు దుండగీండ్రు వధింతురు. విధివశమున ఆ నేరము తిమ్మరుసుపుత్రునిపై బడును. వెంటనే రాయలవారు తండ్రికొడుకులను దర్బారునకు రప్పించి పరుషోక్తుల వారిని దూషింతురు. అందుకు జవాబుగా దళవాయిఅయిన తిమ్మరుసుపుత్రుడు, మహామంత్రి అయిన తిమ్మరుసు ఈవిధముగా ఉపన్యసింతురు:—

చెప్పుడుమాట లాత్మ బరిశీలన సేయక, సంభ్రమించి, ఎ
ల్లప్పుడు మీదు శ్రేయమున కాత్మ బయల్పడ పాటుపడ్డ మా
అప్పను ఇట్టు లీప్రభువులందరి ముంగట ఆడిపోసె దీ
విప్పుడు; ధర్మమా ఇది? మహీశ్వర! నీయటువంటివానికిన్?

వెనుక త్వదీయసోదరుని వీరిడినుండి తొలంగజేసి ని
న్నొనరగ మంచివాడ వని ఉర్వికి ఏలికచేసినందుకా
జనకుడు ద్రోహియాట; నృపచంద్రమ! కాటికి కాళ్లుజాపియున్
ఘనతరమైన పాపపరిఘమ్మునకున్ గమియించె దేలొకో!

అవలోకింపవుకాని, ఈఅవని అధ్యక్షించు ఉద్దేశమే
అవనీనాయక! అప్ప కున్నయెడ దా నానాడె కైసేయు; ఈ
యువరాజున్ పొలిపుచ్చనేల యిపు? డీవూహింపలేకున్న ఈ
నివహంబైన గ్రహింపదా ఇతని వాణీశీలపూజ్యార్థముల్!

చిరుతతనంబునుండి కడు చెల్మి దలిర్పగ జూచినందుకున్
సరిగ సమీక్షసేసిన, విశాంపతి! మోసము నీకు మంత్రియే
జరిపెనో; నీవె ఆతనికి జల్పితివో, ఇపు డీమహాసభాం
తరులయినన్ గ్రహింపరె? ఎదన్ జెడి నీవు గ్రహింపకుండినన్.

(అంత సార్వభౌముడు బేడీలు వేయును)

మనుజవరేణ్యా! ఈ దురవమానముతో దనివొందకుండ ఇం
కను మము జిక్కులన్ జొనుపగా గమకించెద; వట్టులైన, నీ
మనమున రేగియున్న అనుమానమనోవ్యథ ఒక్క నాపయిన్
గనుక పితన్ ద్యజించి ఎట కంపెదవో నను బంపు మీక్రియన్.

## భారతి – పార్థివ భాద్రపదము

ఎంత దారుణమయ్యె, నీయంతవాని-ఇట్లు యోజింపకుండ శిక్షించెదకట!
నవనవోన్మేషితమ్ము మనమ్ము నీది-అట్టి దీనాడు పాషాణమైన దేమొ!

కన్నెత్తిచూడ శక్యముకానియట్టి ఉత్కలరాజు జితుజేయగలిగె నీకు
పూర్వ్వలం దేరికి పొందజాలని రాయచూరిని గృహావిధి జూపె నీకు
ఎల్లప్పుడున్ విక్రమించెడి భామినీనృపతులచేత మ్రొక్కించె నీకు
నీయంతవాడు లేనేలేడు లోకాన అను కీర్తి కలిగింప దనరె నీకు

ఇతడు సామాన్యుడే? మంత్రివృషభు;డట్టి-వాని విశ్వాసద్రోహివై ప్రభువరేణ్య!
ఇట్టు లవమానపరచి శిక్షించుచుంటి-విపుడు; లేదొక్కొ! పాపపు వెరపు నీకు.

అని దళవాయియైన సుతు డాత్మ గలంగి ఉపన్యసింపగా
దనయ! అనంతమైన వసుధాతల మేలెడు చక్రవర్తి ఈ
ఘను; డదెకాక, సత్కవి; అఖండవిశారదు; డీత డింకనున్
దనరిన రాజ్యమెల్ల బహుధా పురణించి సుఖంబులందెడున్.

ఒక మనమట్టు కీనృపతిఉల్లము మార్పువహించెనన్న అం
దుకు మన రోజు లిప్పుడు గతుల్ చెడియుంటయె కారణమ్ము; మె
ట్టుకు గడు మంచివా డిత; డెటుం బరికించిన,భారతార్థభూ
మికి ఎనలేని రాజపరమేష్ఠి; అనర్హుడు నింద; కర్భకా!

మీరును మేము స్నేహితులమే అయినన్ గతమేమి లేకయే
వైరులమైతి మిప్పుడు నృపాల! విధిక్రియ; అంతెకాని, త
ప్పేరిది లేదు; శిక్ష విధియింపుము; శీర్షమె త్రుంచెదో,భవ
ద్ధారుణి వీడిపొమ్మనెదొ,దగ్ధమొనర్చెదొ ఏమిచేసెదో!



# చెదలు

[ కథానిక ]

= శ్రీ కొడవటిగంటి కృష్ణమూర్తి =

వెంకాయమ్మగారు చెప్పేటంతవరకూ మా ఇంటి సంగతి నాకు తెలియనే తెలియదు. మా నాన్న-శంకరయ్య-ఆ రోజులలో గజం ఏడు అణాల చొప్పున కొన్నాడు. అప్పుడిదంతా తుమ్మల అడివి. సాయంత్రం అయింతరువాత ఇటువేపు రావటానికే జనానికి భయం వేసేది. మండువాఇల్లు కట్టిద్దామా, లేక డాబాఇల్లు కట్టిద్దామా అని చాలారోజులు మథన పడ్డాడు మా నాన్న. ప్రస్తుతం దిట్టమైన గోడలు కట్టి పైన రెల్లు, లేక తాటాకులు ఏర్పరిచి, తర్వాత పెంకులుగాని, లేక డాబాకాని ఏర్పాటుచేసుకో వచ్చునని కొంతమంది సలహాకూడా ఇచ్చారు. అయితే మండువాఇల్లు ఆ రోజుల్లో ఫేషన్ కావటంవల్ల, అదే కట్టించాలని ఆయన తేల్చుకున్నాడు.

ఆ రోజుల్లో ధనికులకు డబ్బు వడ్డీకి ఇయ్యటమో, లేక దివాలాతీసినవారి పొలాలు కొనటమో, లేక గాలీ, వెల్తురూ రాని భవనాలు కట్టించటమో రివాజు. వాళ్లకి సరిపోగా మిగిలిన ద్రవ్యాన్ని ఖర్చు చేసే మార్గం లేదు. అసలు ఎక్కువధనంతోనే అవసరం వుండేది కాదు. తినటానికి తిండీ, కట్టుకోటానికి బట్టా దాటిపొయ్యేది కాదు వారి అవసరాలు. కాకపోతే ఇటు రామేశ్వరమూ, అటు కాశీ వెళ్లి రావటం. కొంతమంది అటువంటివి చేసి వున్నడబ్బు ఖర్చు చేయటం ఇష్టంలేక, బైటవుంచితే దొంగలు ఎత్తుకుపోతారన్న భయంతో ఇంట్లో గొయ్యి తవ్వి, ధనాన్ని పూడ్చి, పైన మంచం వేసుకుని ప్రాణం విడవటం కూడా కద్దు. వడ్డీకి ఇయ్యటానికీ, భవనాల్ని కట్టించటానికీ తాహతు లేదు మా నాన్నకు. తిండికీ, బట్టకూ సరిపోయే అయివేజు వచ్చే భూవసతి వుంది. కాకపోతే నివసించటానికి ఓమాదిరి గృహం లేదు. ఆయన తరంలోనే ఒక గృహం అంటూకూడా ఏర్పాటుచేస్తే ఆయనతర్వాతవారికి ఏ లోపమూ లేకుండాపోతుంది. అందుచేత ఆయన గృహనిర్మాణానికి పూనుకున్నాడు.

"ఏమిటోయి బావా—అడుసు పెట్టి కట్టిస్తున్నావేమిటి?" అన్నాడు వెంకాయమ్మగారి భర్త.

"ఇప్పటికి ఇలా పోనిస్తూ" అన్నాడు మా

"పిల్లలు గలవాడివికదా, ఇల్లు కొంచెం గట్టిగా వుండద్దూ?"

"నీకేం బాబూ! తండ్రిచాటుపిల్లవాడివి. 'ఇల్లు కట్టిచూడు—పెళ్లిచేసి చూడు' అన్నారు పెద్దలు. నీకీరెండూ పట్టించుకోనక్కర్లేదు. మరి నా సంగతి నీకు తెలియనిది ఏముంది?" అన్నాడు మా నాన్న.

"ఏదన్నా కార్యం తలపెట్టినప్పుడు అది బాగా చెయ్యటం అవసరం. నీకు చెప్పాలిసినవాడిని కాదనుకో—"

"అబ్బాయి, ఇటు చూడు! స్థలం అంటే చౌకగా దొరికిందికాని తీరా ప్రయత్నం ఆరంభించేటప్పటికి ఎంతైందో తెలుసునా? ఇంకా పునాదులే తయారుకాలేదు. ఎటుపోయి ఎటు వస్తుందో. మన రాఘవయ్య ముందూ వెనకా చూచుకోకుండా ఇల్లు కట్టి, అది పూర్తిచేసే తాహతు లేక అప్పుతెచ్చి చివరకు దివాలాతియ్యటం మనం ఎరగం? చివరకు ఆ ఇంట్లో గృహప్రవేశం చేసే గీతకూడా లేకపోయింది

వాడికి. ఇంకా ఎంతో గ్రంథం వుంది." అన్నాడు మా నాన్న.

మా ఇల్లు పూర్తిఅయి గృహప్రవేశం అయింది. చుట్టాలూ, పక్కాలూ, వాళ్లూ వీళ్లూ చాలామంది వచ్చారు. మా నాన్నకు కొంచెం పలుకుబడి బాగానే వుండటంవల్ల పీటలమీదనే చాలా ఖర్చు కలిసివచ్చిందని వినికిడి. మేము ఇల్లు కట్టించుకోవటమేమిటో— దానికి వూళ్లోవాళ్లు డబ్బు ఇచ్చుకోవటమేమిటో! చాలామంది మట్టిగోడలు బాగా లేవు అని చెప్పినట్టు తోస్తుంది. మా నాన్న త్వరలోనే ఆ మట్టి అంతా గీకించి సున్నం పూయించాడు. అప్పటినించీ అది చూడటానికి సున్నంతో కట్టిన ఇల్లుఅల్లేనే వుండేది. అంతతో వూరుకోక పైన చక్కగా సున్నంకూడా కొట్టించాడు.

ఇదంతా నేను చెప్పగా విన్నదే. నా చిన్నతనంలోనే మా నాన్న చనిపోవటంవల్ల ఆయన్ని నేను ఎరగను. "వోరి నువ్వుట్రా!" అని మానాన్న పేరుతో నన్ను గుర్తించటంతో చూస్తే ఆయన గొప్పవాడు కామాలు అనుకునేవాడిని. నాకు వడుగు అయింతర్వాతనే మాఅమ్మకూడా మరణించింది.

నా చెల్లెలుకు వివాహం అయి అది అత్తవారింటికి పోయింది. క్రమేపీ నావివాహంకూడా మా అన్నయ్యే చేశాడు. నాభార్య కాపరానికి వచ్చింతర్వాత మేము భాగాలు పంచుకోవటం కొంత గోల జరిగింది. మానాన్నా, అమ్మా లేకపోవటంవల్ల మా భాగాలపంపిణీలో ఇతరులు జోక్యం కలుగచేసుకున్నారు. ఇద్దరన్నదమ్ములు పెద్దవాళ్లయింతర్వాత భాగాలు పంచుకోవటం రివాజు. అసలు మేము అంత వరకూ భాగాలు పంచుకోవటం కొంతమందికి ఆశ్చర్యం కలిగించివుండవచ్చు. తాను పెద్ద అయేదాకా వదినెగారి చేతిల్లో పడే సూటీపోటీ మాటలూ అవీ విషంగా పరిణమించి, సమయంకోసరం కనిపెట్టుకు కూచుంటాడు చిన్నవాడు. నావిషయంలో ప్రత్యేకత నాలోనే వుందో, లేక మావదినెగారిలో వుందో చెప్పలేను. ఆవిడ సూటీపోటీమాటలు అనే రకం కాకపోవచ్చు. నేనూ అవి అర్థంచేసుకునే తెలివితేటలు కలవాడిని కాకపోవచ్చు. ఏమైనా నాభార్య కాపరానికి వచ్చింతర్వాత పరిస్థితులు మారినై.

మొదట్లో నాభార్య సౌమ్యంగా వుండేది. ఎందుకనో దానిలో మార్పువచ్చింది. ఇది కేవలం దాని లోపమే అని అనుకోటానికి వీల్లేదు. అసలు మా మామగారికి మా అన్నదమ్ములం పంచుకుంటే చూడాలని వుండేదిట. ఆయనతోపాటు మాఅన్నయ్య మామగారికికూడా అటువంటి వుద్దేశ్యమే వుండటంవల్ల ఈసమస్య మమ్మల్ని దాటి పెద్దచేతుల్లోకి పోయింది. ఫలితం రోజూ నాభార్య గునియటమూ, విసుక్కోవటమూ. అంతటితో ఆగక నెపం నామీదికి వచ్చింది. కారణం నాభార్యఆత్మకు శాంతిని చేకూర్చటానికి నేను ప్రయత్నించకపోవటం. అది చెప్పేవి సాధారణంగా నాకు అర్థం అయేవి కావు. అర్థం అయిన వాటికి సమాధానం చెప్పే శక్తి నాలోలేదు. చివరకు నేను ఇంత వోబయ్యాని కాకపోతే పంపిణీ ఎప్పుడో జరిగేది అని నాకు తెలిసింది!

అదికాక మాకు ఇంకో చిక్కు వచ్చిపడింది. మా ఇంట్లో ఎక్కడ చూచినా చెదలే! ఇవి మొదట మా అన్నయ్యగదిలో మూల బైలుదేరి అక్కడ వున్న జాజిచెక్క పెట్టె అడుగును తినేశినై. వాటిని జాగ్రత్తగా గీకిపారేశాం. తర్వాత పైన మండువాదగ్గిర కనిపించినై. అశ్రద్ధచేశాం. నాభార్యకు వాళ్లమ్మ పెట్టిన పట్టుచీరె దణ్ణెంమీద వున్నది వున్నట్టు చెదలు పట్టింతర్వాత కొంచెం గోల అయింది. ఒకరోజున ఒక మేకును తీసుకుని ఇల్లంతా గాలించాను గీకుతూ. మేము గమనించలేదు కాని అనేకచోట్ల పట్టినై చెదలు. వెల్తురు బాగా లేని మూలల్లో ప్రతిచోటా వున్నయి. వూరగాయజాడీల వెనక తండోపతండాలు. ఒక రోజల్లా శ్రమపడి అన్నింటినీ గీకేశాను. నిచ్చెన వేసుకుని పైన అన్నిచోట్లా దులిపేశాను. కాని ఏమీ లాభంలేకపోయింది. వొళ్లుపులకరించినట్లు మర్నాటికి అన్ని చోట్లా చెదలే! తారు పూయమని చాలామంది సలహా ఇచ్చారు. కొంత తెచ్చి అవి పట్టినచోట్లల్లా

పట్టించాను. అప్పటికి గాని మా ఇంట్లో శాంతి కొంత ఏర్పడలేదు.

అయినా మూడురోజుల ముచ్చటే. చెద తాగుపూసిన పైన ప్రదేశంలో మళ్లీ ఆరంభం అయినై. అలమారాల్లో చెక్కలు పుచ్చిపోయినయ్యనీ, పేటలు చెడిపోయినయ్యనీ, పుస్తకాలు—మా నాన్న సోగు చేసిన అనేక గ్రంథాలు— ఎందుకూ పనికిరాకుండా పోయినయ్యనీ రోజూ వార్తలు! కప్పుకువున్న వెదురు బొంగులు మాకళ్ల ఎదటే పుచ్చి, వాటితాలూకు మట్టి అనేకసార్లు మావిస్తళ్లల్లో పడింది. కప్పువిప్పి అంతా శుభ్రం చెయ్యమని పెద్దవాళ్లు సలహాఇచ్చారు. ఈగోలలో మాభాగాలు పంచుకోవటం కొంచెం వెనకపడింది.

ఒక మంచిరోజు చూచి పెంకులన్నీ విప్పించాము. పెంకులకింద మట్టి చేరుకుని చెదలు విహారం చేస్తున్నై. అనేక బొంగులు ముట్టుకుంటే పూడిపోయినై. ఇంకా మా అదృష్టం బాగుంది కనక మేము త్వరలోనే మేలుకున్నాం. లేకపోతే ఎప్పుడో ఇల్లు విరిగి మామీద కూలేదే. అయితే కప్పు సంపూర్ణంగా తీసెయ్యటంవలన చెదల సమస్య పైభాగంలో వదిలిందికాని గోడలకు ఇంకా బోలెడు తుట్టెలు అలాగే వున్నయి.

"అబ్బాయి, మూలస్థానం ఎక్కడో వుంటుంది మీరు పైపైన వీటిని దులపటంవల్ల కించిత్తూ ప్రయోజనం వుండదు. అయినపని అయింది. ఆపుట్టలున్నచోట తీసిపారేయించి మళ్లీ కట్టించండి!" అని వెంకాయమ్మగారు సలహాయిచ్చింది. అది సబబుగా వుంది. అయితే ఒకచోట-పుట్ట వున్నచోట-పలుగుతో ఇటికెల్ని తీసిచూచాం. ఒకఅడుగు మేర ఖాళీ చేశాం. చిత్రమేమిటంటే, చెదలు ప్రతిచోటా గోడలోనించి బైటికి రాలేదుకాని ప్రతిఇటికెకూ మధ్య వున్నయి! మేము ఖాళీచేసిన చోట స్పష్టంగా కనిపిస్తూనేవుంది ఇటికెల మధ్య అవి ఎలా వున్నదీ. ఇంకోమూల తవ్విచూచాం. అక్కడా అంతే. నాకు అనుమానం పోయి ఏమీ చెదలులేనిచోట పలుగుతో కొన్నిరాళ్లు తీసిచూశాను. త్రం! చెదలు పైకి రాలేదుకాని ఇటికలమధ్యగా రాధారులు ఏర్పరుచుకుని తిరుగుతున్నై! వీటి మొదలు ఎక్కడ - వీటిని తీశెయ్యటం ఎలా అనేవాటికి సమాధానం చెప్పటం నావశం కాదు. మాఅన్నయ్య ఇది చూచేటప్పటికి బేజారైపోయినాడు. గోడలన్నీ పరిపూర్ణంగా పడగొట్టి, మళ్లీ ఇల్లు కడితే తప్ప గత్యంతరం లేదని నాకూ, మాఅన్నయ్యకూ అర్థంఅయింది.

ఇంతలో ఇంకో వుపద్రవం వచ్చింది. మా పేటంతా తగలబడిపోయింది. వంటచేసి బైటపడేసిన బొగ్గులలో నిప్పు వుండటంమూలాన ఒక ఇల్లు తడికెలు అంటుకుని ప్రారంభం అయిందనీ, ఎవరో వీథిలోనించి పారేసిన సిగిరెట్టుమూలంగా తగలపడ్డదనీ రకరకాల వదంతులు పుట్టినై. ఏకారణం అయితేనేం మాపేట అంతా తగలబడింది. మా ఇల్లు తగలబడటానికి అనుకూలంగా సామగ్రి లేకపోవటంవల్ల అది తప్పిపోయింది. కాని ఈగోలలో రాత్రిపూట ఇళ్లు తగలబడటంవల్ల బైటపెట్టిన సామాను కొంతమంది ఎత్తుకుపోయినారు. మాబిందె పోయిందంటే మాబట్టలు పోయినై అని వార్తలు. మావదినెగారి బట్టలపెట్టె మొదలైన ఇతరచిల్లరసామగ్రి పోయింది మా ఇల్లు తగలబడకపోయినప్పటికీ! నమ్మండి, నమ్మకపొండి- ఎటు చూచినా మసిబట్టి కప్పులులేని గోడలే మాఇంటి చుట్టూ! అప్పటినుంచి రాత్రిపూట వంతులు వేసుకుని కాపలాలు కాచాము. వీథివెంట ఎవరన్నా సిగిరెట్టు కాలుస్తూ పోవటం అసంభవం-ఇంకా తగలబడాలిసినదేమీ లేకపోయినప్పటికీ. ఈగోల తెలియక ఎవడో కొత్తగా వచ్చి సిగిరెట్టు గోడపక్కగా పారెయ్యటం జరిగి అది చూచిన నలుగురూ అతన్ని చితకపొడిచారు. అతని నేరం ఏమీ లేకపోయినప్పటికీ అతనికి బాధ తప్పలేదు. తేలుకుట్టిన మర్నాటినించీ చెప్పులు తొడుక్కున్నట్టుగా ప్రవర్తించాం అందరమూ!

వానాకాలం రాకపూర్వమే తాటాకులూ, పెంకులూ తెప్పించి అందరూ కప్పులు వేసుకున్నారు మాఇంటిచుట్టూ మళ్లీ ఇళ్లు మామూలుగా తయారై నేత్రానందంగా వుంది. కాని మాఇంట్లో ఇంకా పరిస్థితులు చెదలరూపకంగానే వుంది వీటిని దులిపి, మానాన్న చేసినట్టు మట్టితోకాక మంచి పునాదితో కట్టిన గోడలు అమర్చి, కప్పువేస్తేనేగాని మేము వుండటానికి తగిన ఇల్లు తయారుకాదు. ఇది ఎప్పటి కవుతుందని నాప్రశ్న!. ఇది అయితేగాని మేము భాగాలు పంచుకోమా అని మామీద వాత్సల్యం ప్రకటించేవారి ప్రశ్న!

# ప్రకృతి శాస్త్రసిద్ధాంతాలు

## 3. కాల, అంతరాళములు

'విద్యార్థి'

౧. సంవత్సరములు:—గ్రహములన్నీ సూర్యుని చుట్టూ తిరుగును. ఒకచుట్టు పూర్తిగా చుట్టివచ్చుటకు పట్టేకాలము గ్రహ-వత్సర మందురు. ఈసంవత్సరముల కాలమానము వివిధగ్రహాలకు వివిధవిధములుగా ఉండును. భూమండలంతో పోల్చితే బుధగ్రహవత్సరము మూడునెలలుమాత్రమే; వరుణుని సంవత్సరము మన ౧౬౫ సంవత్సరాలకు సమానము.

౨. ఋతువులు:— నాలుగు హేతువులవల్ల ఋతువులు సంభవిస్తున్నవి. ప్రతివత్సరమూ సూర్యుని చుట్టూ భూమిప్రదక్షిణము; ౨౪ గంటల కొకసారిగా భూమి దాని అక్షరేఖపైననే తిరుగుట; భూమిఅక్షరేఖలంబమునుంచి ౨౩½° వాలుటయు, భూమిఅక్షరేఖ ఎల్లప్పుడూ ఒకేదిక్కుకేసి ఉండుటయును; భూమియొక్క గోళాకారము—ఈనాలుగును ఋతువులకు హేతువు లగుచున్నవి. సూర్యుని నిలువుకిరణములు సూటిగా భూమధ్యరేఖపై ఏడాదిలో రెండు హ్రస్వసమయములందు పడుచున్నవి. అవే దక్షిణాయన (మార్చి ౨౧), ఉత్తరాయణ (సెప్టెంబరు ౨౨) సంధికాలములు. వీటినే మహావిషువ జలవిషువము లందురు. భూమిమీద ఎల్లెడలా ఈ రెండురోజులూ సమరాత్రిందివమైన కాలము. దక్షిణాయనమునుండి ఉత్తరాయణమువరకును భూగోళఉత్తరార్ధము సూర్యునికేసి మొగ్గి దక్షిణార్ధము దూరగిలియుండును. ఈసమయ మంతేయు ఉత్తరధ్రువమున ఒకటే పగలు, రాత్రి ఉండదు; దక్షిణధ్రువమున ఒకటే రాత్రి, పగలు ఉండదు. ఈ పగళ్లు ఉత్తరాన రాత్రుళ్లకన్న దీర్ఘమైయుండును. ఉత్తరగోళార్ధములో కర్కసంక్రాంతిరోజు జూన్ ౨౧ కన్న దీర్ఘమైన పగలు ఉండదు. ఈనాడు సూర్యుని నిలువుకిరణాలు భూమధ్యరేఖకు ౨౩½° ఉత్తరంగా ఉన్న కర్కవృత్తంపైన పడును. సూర్యకిరణాలు ఎక్కడైనా ఇతరత్రాకన్న ఎక్కువ నిలువుపాటుగా పడినప్పుడు రాత్రుళ్లకన్న పగళ్లు దీర్ఘమై ఎక్కువ ఎండ కాస్తుంది. ఈఋతువునే వేసవి అందుము. ఉత్తరభాగాన వేసవికాలమానము దక్షిణభాగాన శీతకాలమాన మగును.

3. పగలు, రాత్రి:—భూమి నిరంతరము దాని అక్షరేఖపైననే తిరుగుచుండును. కనుక ఏ సమయమందైనను సూర్యుని సూటికిరణములు భూమిపై సగభాగం మీదనే పడును. అందువల్లనే రాత్రి, పగలు వెన్నంటుకొనివచ్చును.

దివారాత్రముల దీర్ఘత్వము భూమధ్యరేఖనుండి కల దూరమునుబట్టి యుండును. భూమధ్యరేఖవద్ద పగలు ఎప్పుడును 12 గంటలపాటు ఉండును. రాత్రి ఎప్పుడును 12 గంటలపాటు ఉండును. ఉత్తర దక్షిణ ధ్రువములకు ఆరునెలలపాటు పగలు, ఆరునెలలపాటు రాత్రి యుండును. ఈ రెండు 'అతి' వేళలనడుమను రాత్రిపగళ్ల 'సేపు' మారుచుండును.

ఇతరగ్రహములు చాల సూర్యునిచుట్టు తిరుగుటేకాక తమ అక్షరేఖలపైననే తిరుగుచుండును. వివిధగ్రహములకును పగటిరాత్రుల మానము భేదించి యుండును. బృహస్పతి అందాజాగా పదిగంటల కొకసారి చొప్పున అక్షరేఖపై తిరుగుకొనును. కనుక ఆ గ్రహము పగలు, రాత్రులు అయిదేసి గంటలసేపు ఉండును. శుక్రుడు సూర్యుని చుట్టివచ్చేలోపున తన అక్షపై ఒక్కసారే తిరుగును. కనుక ఒకపక్కన నిత్యరాత్రి, రెండవప్రక్కన నిత్యపగలే.

౪. కాలము, వేళకట్లు:—సూర్యుని చూచి వేళ చెప్పుట పూర్వ మాచారముగ నుండునది. ఇంచు మించు తలపైకి సూర్యుడు వచ్చినపుడు (మిట్ట)మధ్యాహ్నమనేవారు. ఇందువలన ఒకవిధము కుదురక చాల అసౌకర్యము కలిగేది. రైలుదారులు, టెలిగ్రాఫులు కట్టిన తర్వాత ఈ విధమున వేళ చెప్పుట బాగులేదు. ౧౮౮౩ లో అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వమువారు వేళగీతలు ఏర్పరచ సంకల్పించారు. దేశాన్ని నిలువునా నాలుగుభాగాలుగా విభజించారు. వీటిని తూర్పు, మధ్య, పార్వత, పాసిఫిక్ గీట్లు అంటారు. ఏ గీటు కాగీటుకు వేళ తూర్పువైపున ఉండే పక్కగీటుకన్న ఒకగంట వెందలకడగా ఉంటుంది. న్యూయార్కులో మధ్యాహ్నం ౧౨ గంట లైతే చికాగోలో పూర్వాహ్ణం ౧౧ గంటలు, డెన్వరులో ౧౦ గంటలు, సాన్‌ఫ్రాన్సిస్కోలో ౯ గంటలు అవుతుంది.

భూరేఖలు అనేవి ఉత్తర దక్షిణధ్రువాలను భూతలంమీద ఊహలో కలిపే సుటీరు చిన్న గీతలు. ఇవి ఉత్తర దక్షిణంగా ఉండును. ఈ రేఖలు భూమధ్యరేఖను, దానికి సమాంతరంగా ఉండే ఇతర తూర్పుపడమర రేఖలను సమకోణంలో గీసుకొనును. వర్తులానికి అంశలు ౩౬౦ కనుకను, భూమధ్యరేఖయు దాని సమాంతరరేఖలన్నియు వర్తులములు కనుకను కాలమానానికి వీలుగా భూతలంమీద ౩౬౦ భూరేఖలు నిర్దేశించారు. వీటిలో ఒకటి ఆద్య రేఖ. ఈరేఖ ఇంగ్లండునందలి లండనులో జేరిన గ్రీనిచ్ మీదుగా నున్నది. ఈ ఆద్యరేఖతో ప్రారంభించి మనము కాలము గుణిస్తాము. రోజుకు ౨౪ గంటలు కనుక ఈ ౩౬౦ భూరేఖలను ౨౪ ప్రమాణరేఖలుగా విభజన చేశారు. ఈప్రమాణరేఖలు ఒకదానికొకటి ౧౫ అంశలు దూరమై యుండును; వేళకు ఒకగంట వ్యత్యాసముగా ఉండును. హిందుస్తాన్‌లో ౮౨½ భూరేఖపైన, అనగా ౫½ ప్రమాణరేఖపైన ఉన్నాము కనుక ప్రామాణికంగా మన గడియారాలు తిరగవలె నంటే లండన్ ప్రామాణిక వేళకు మన వేళ ౫½ గంటలు ముందుకు ఉండును.

౫. భూతలంపైన స్థాన నిరూపణ:— సాగర యానంలోను, వాయుయానంలోను ఒక సమయంలో ఎక్కడ ఉన్నదీ తెలుసుకునే ఉపాయం అవసరము. అందుకు అన్ని దేశములకూ ఒకేపద్ధతి ఉండుట అవసరము. ఉదాహరణకు ఒక చోటినుండి మరొకచోటికి ఓడలో సముద్రంమీద పయనించేప్పుడు ఓడ కాప్టన్ దారితప్పకుండా సాగటు మెలాగో గ్రహించాలి. ప్రమాదమేదైనా తటస్థిస్తే ఓడస్థితినిగురించి రేడియోలో తెలుపగలగాలి. కమాండర్ బైర్డ్ ఉత్తరధ్రువానికి విమానయాత్ర వెళ్లినప్పుడు, తా నక్కడ ఉన్న సంగతి సరిగ్గా తెలుసుకోవటం అవసరమైనది. వాస్తవంగా తాను ఉత్తరధ్రువానికి వెళ్లివచ్చినట్టు రుజువుచేయుటకు అతడు సాక్ష్యం చూపవలసివచ్చినది. భూతలంమీద స్థాననిరూపణకు ఒకేపద్ధతి ననుసరించుటకు లోకంలోని నాగరిక దేశాలు అంగీకరించినవి. ఫలానా స్థలం భూమధ్యరేఖకు ఎన్ని అంశలు ఉత్తరంగాగాని, దక్షిణంగాగాని ఉన్నదో చెప్పి, ఆద్య భూరేఖకు తూర్పుగాగాని పడమరగాగాని ఎన్ని అంశలున్నదో చెపితే ఏ స్థానమైనా సరిగా ఇక్కడ అని నిరూపించవచ్చును. ఇలా ఫలానాస్థలము భూమధ్యరేఖకు ఉత్తరానగాని, దక్షిణానగాని ఉన్నదని చెప్పవలసివస్తే అది ఉత్తరంగాను, లేదా దక్షిణంగాను ఇన్ని అక్షాంశము లున్నదంటాము. అలాగే గ్రీనిచ్ ఆద్యభూరేఖకు తూర్పునగాని, పడమరనగాని ఉన్నదనవలసివస్తే అది తూర్పుగాను, లేదా పడమరగాను ఇన్ని రేఖాంశము లున్నదంటాము. లోకపటాల పుస్తకం తీసి అక్షాంశములు, రేఖాంశములు (′) అనే గుర్తున నిమేషములని, (″) గుర్తున నిమేషములు క్షణములని విభక్తమైన వేమో చూడండి. ప్రతి (°) అంశకును ౬౦ నిమిషములు, ప్రతినిమిషమునకును ౬౦ క్షణములు కలవు. భూమధ్యరేఖవద్ద ఒక అంశ ౬౯ మైళ్లకు సమానము. కనుక భూమధ్యరేఖవద్ద నిమిషములో ఎన్నిమైళ్లుండునో, క్షణములో ఎన్ని అడుగులుండునో ఊహించుకో

తగిన పరికరాలతో నావికుడు సముద్రముమీద తానెక్కడ నున్నదీ మైలులో స్వల్పభాగమువరకును నిరూపించుకొనగలడు.

౬. గురుత్వాకర్షణము:—సర్ ఐసక్ న్యూటన్ గాథ అందరికీ తెలిసిఉంటుంది. ఆయన ఒక సీమ రేగుపండు చెట్టుక్రింద కూర్చున్నపుడు ఒక పండు తలమీద పడిందనీ, అంతట ఆయన అది నేలకేసి ఎందుకు పడవలసివచ్చిందా అని ఆలోచనకుదిగాడనీ చెబుతారు. ఈప్రశ్ననుగురించి ఆయన ఆలోచించగా చివరకాయన అంతవరకు ఎవరూ గ్రహించని కొన్ని గొప్పవైన సత్యాలను సూత్రీకరించాడు. అయితే అంతకు ముందనేకులు సీమరేగుపండ్లు, ఇతరవస్తువులు నేలమీద పడటం చూస్తూనేవచ్చారుకాని హేతువేమా అని ఎవరూ అంతగా పట్టించుకోలేదు. సామాన్యమైన ఇతరఘటనలనేకంలాగానే ఇదిన్నీ యాదాలాభంగా గ్రహించారు. అయితే పండు పడటమనే సామాన్య విషయంలో ఒక మహాప్రశ్నకుహారము న్యూటన్‌కు తోచింది. చిన్నవిగాని, పెద్దవిగాని ఏవివిధపదార్థమయమై ఈ బ్రహ్మాండమున్నదో ఆపదార్థములన్నిటికిని గల ఆకర్షణశక్తినిగూర్చి ఆయన కొన్ని పరమ ప్రధానమైన నైసర్గికధర్మములను తేల్చెను. ఈశక్తినే గురుత్వాకర్షణశక్తి అందుము. ఈఆకర్షణ భూమిచేత కలిగినపుడు ఆ విశిష్టమైన శక్తిని గురుత్వము అందుము. అన్నిపదార్థములనూ భూకేంద్రముకేసి లాగే శక్తి అది. అంటే గురుత్వశక్తివలన పదార్థములు నేలపై పడును. వాటిలో వస్తుపరిమాణము ఎంత ఎక్కువో, వాటి పరస్పరఆకర్షణ అంత బలీయముగా ఉండును. దేనినైనా మనం తూకం తూచేప్పుడు శక్తినే కొలుస్తున్నాము. రెండు వస్తువులమధ్యదూరం ఎక్కువైనకొద్దీ ఒకదానిపైన ఒకటి "లాగుడు"శక్తి తగ్గునని న్యూటన్ గ్రహించాడు. రెండు వస్తువులమధ్య నుండే దూరపువర్గు హెచ్చినకొద్దీ విలోమముగా గురుత్వాకర్షణశక్తి మారును. రెండు వస్తువుల మధ్య నుండే దూరమును రెట్టిస్తే 'లాగుడు'శక్తి అందులో పావువంతు ఉండును. దూరాన్ని మూడింతలు చేస్తే 'లాగుడు' తొమ్మిదోవంతు ఉండును. ఈ సిద్ధాంతమును యిలా చెప్పవచ్చును. పెద్దవిగాని, చిన్నవిగాని అన్ని పదార్థములను వాటిమధ్య నుండే దూరపువర్గుకు సరియైన శక్తితో ఒకదానినొకటి ఆకర్షించుకొనును.

చంద్రమండలమును విశేషించి అధ్యయనము చేయుటకు ఆధునిక శాస్త్రజ్ఞులలో న్యూటన్ (౧౬౪౨-౧౭౨౭) మొదటివాడు. ౨౪౦ వేల మైళ్ల దూరమున్నా చంద్రుడు గురుత్వమువలన భూమికక్ష్యలోనే పట్టుబడియున్నందున భూమినిచుట్టి తిరుగును. చంద్రునికికూడ భూమిపై ఆకర్షణమున్నది. ఇంచుమించుగా చంద్రబలమువల్లనే పోట్లు పుడుతున్నవి. నీరు భూమికన్న మరింత తేలికగా కదలనౌతుంది కనుకను, రాసిపడినది కనుకను. కొన్ని అందులో కొంత కొన్నిచోట్ల వాస్తవంగా రాశీభూతమై, ఇతర తావుల నుంచి జరగిపోతున్నది. ఇందువల్లనే తీరమున ఒకచోట పోటు, మరొకచోట ఆటు కలుగుతున్నవి.

ఈ గొప్పశక్తి-గురుత్వాకర్షణశక్తివలన చంద్రుడు స్థానే ఉంటూఉండటమేకాక సూర్యునిని, గ్రహములను అదే శక్తి వాటి అంతరాంతరస్థాయిలో ఉంచుతున్నది. నిజానికి నక్షత్రముల గతులు, నక్షత్రగణముల గతులు అన్నీ గురుత్వాకర్షణశక్తిచేతనే నియమితమౌతున్నవి.

-'దిసైన్సు ఆఫ్ ఎవరిడేలైఫ్'లో నుంచి.



"సాహసించే బిడ్డల జీవన జ్యోతి తప్పకుండా ప్రకాశించును."

ఒక రాయల్ ఇండియన్ వైమానికునకు విమానమును నడుపుటకు తన రెండు రెక్కలే కాక ఇతర యోగ్యతలుకూడా గలదని నిదర్శించ బడినది.

ఇతనికి గుణములలో నెల్ల అగ్ర గుణమైన "ధైర్యము" గలదు. దీనినే "నరముల పటుత్వము" అనికూడ అందురు.

దీనికి తోడు తాను తన కార్య నిర్వహణములో ఇంతకు ముందు చూపిన బుద్ధి కుశలత., ఇప్పుడు నిర్వహించుచున్న తన కార్యపు గొప్పతనము., తనయొక్క, తన దేశముయొక్క భావి శ్రేయస్సుకు ఇప్పటినుంచే వేయు పునాది, వీటి నన్నిటిని గమనించితిమేని వీడు ఉత్తమమైన బిడ్డలలో నెల్ల ఉత్తముడని, వీని జీవన జ్యోతి తప్ప కుండా ప్రకాశించునని గ్రహించగలము.

ఏ రిక్రూటింగ్ ఆఫీసరు అయినను దరఖాస్తును పెట్టు విధానమును బోధపరుచును.



సిద్ధివినాయకుడు

లేపాక్షిలోని వీరభద్రస్వామి దేవాలయపు ఆవరణయందు ఒక బండమీద మలిచిన శిల్పము

Courtesy : Archæological Survey of India.

# వినాయకచతుర్థి

= శ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావు =

"గణానాం త్వా గణపతిగ్ం హవామహే - కవిం కవీనా ముపమశ్రవ స్తమం
జ్యేష్ఠ రాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత - ఆనః శృణ్వ న్నూతిభిః సీద సాదనం" (ఋగ్వే. II. 28. 1)

[ఈ సమస్తదేవగణములకు నీవే ప్రభుడవు; నాయకుడవు; బుద్ధిమంతులందఱిలో నీవే బుద్ధిమంతుడవు. ప్రఖ్యాత పురుషులలో నీ వగ్రగణ్యుడవు. మా ప్రార్థనలు, పూజలు, యజ్ఞములు లోనగు సమస్త కర్మలకు నీవే రాజవు; ఓబ్రహ్మణస్పతీ! యజ్ఞస్థానము నధిష్ఠింపుము.]

ఈ పార్థివసంవత్సర భాద్రపద శుద్ధ చతుర్థి (10-9-45) సోమవారము వినాయకచతుర్థి. దేశమంతటను ఆనాడు గణపతిపూజలు జరుగగలవు. శక్తిగలవారు గణపతి నవరాత్రిఉత్సవములు చేసి తొమ్మిదిరోజులు నృత్తగీతవాద్యములతోను, హరికథాదిపుణ్యకాలక్షేపములతోను, కమ్మని విందులతోను బంధుమిత్రులనుకూడ తనిపి, సర్వసిద్ధిప్రదుడగు విఘ్నేశ్వరుని పూజించి, ఆ దేవుని యనుగ్రహము పొంది ధన్యులగుదురు. భాద్రపదశుద్ధచతుర్థినాడు ప్రతి సంవత్సరము గణేశుని ముఖ్యముగా ఎందుకు పూజింపవలెను ? మాఘశుద్ధచతుర్థినాడును, చైత్రశుద్ధచవుతినాడునుకూడ మన దేశములో పంచాంగకర్తలు గణేశపూజ లేల విధించుచున్నారు ? ఇవన్నియు ముఖ్యముగా మనము తెలిసికోవలసిన విషయములు. ఇందుకు కొంత ఖగోళపరిశీలనము మిక్కిలి అవసరము.

## నక్షత్రములనుబట్టి మాసనామములు

సూర్యుడు అస్తమించగానే తూర్పున కొన్ని చుక్కలు ఉదయించును. ఆ చుక్కలు రాత్రియంతయు నాకాశమున మెఱసి, సూర్యోదయ మగువేళకు పడమట నస్తమించును. అదేవేళకు మరికొన్ని చుక్కలు తూర్పున నుదయించును. పున్నమనాడు సూర్యు డస్తమించువేళకే చంద్రుడు తూర్పున నుదయించును ఆవేళచంద్రోదయమప్పుడు తూర్పున నే చుక్క ఉదయించునో ఆచుక్కనుబట్టి ఆ నెలకు పేరు ఏర్పడినది. చిత్తానక్షత్రముతో కూడిన చంద్రుడుగల పున్నమ ఏమాసమున వచ్చునో ఆమాసము చైత్రమాసమగును; విశాఖతో కూడిన పున్నమి కలది వైశాఖమాసము ; జ్యేష్ఠతో కూడిన పున్నమ కలది జ్యేష్ఠము; ఆషాఢతో కూడిన పున్నమ కలది ఆషాఢము ; శ్రవణయుక్తమైన పున్నమి కలది శ్రావణము ; భాద్రపద నక్షత్రసహితమైన పున్నమి కలది భాద్రపదము ; అశ్వినితో పున్నమి కలది ఆశ్వియుజము ; కృత్తికతో పున్నమి కలది కార్తికము ; మృగశిరతో పున్నమి కలిసిన మాసము మార్గశిరము; పుష్యమితో వచ్చు పున్నమ కలది పుష్యము ; మఘతో పున్నమ కలది మాఘము ; ఫల్గునీనక్షత్రసహితమైన పున్నమి కలది ఫాల్గునము.

## కార్తెలు, మూఢము

ఈ విధముగా ఆయామాసములనుబట్టియు, కాలగతులనుబట్టియు చుక్కలు మన భూమిచుట్టును తిరుగు

చున్నట్లు కనబడును. ఈ పరిభ్రమణసందర్భములలో కొన్ని చుక్కలు సుమారు రెండువారముల కాలము సూర్యునితోనే ఉదయించి, సూర్యునితో అస్తమించుచు, రాత్రులు ఏ వేళప్పుడు చూచినను మనకు కనపడవు. ఆ దినములు ఆ నక్షత్రమునకు 'కార్తె'దినము లందురు. సూర్యాస్తమైనతరువాత సూర్యోదయ మగు వరకును, రాత్రి ఏ వేళచూచినను ఏ నక్షత్రపు కార్తెలో ఆ నక్షత్రము మనకు కనబడదు. గ్రహముల విషయములో ఈ కాలమును మూఢ మందురు. మూఢమన బడు దినములలో గ్రహములును, కార్తెలో ఆ చుక్కలును రాత్రుల కానరావు. మూఢము పోగానే గ్రహములును, కార్తె అంతరించగానే నక్షత్రములును తూర్పున సూర్యోదయకాలమునకు ముందు ఉదయమగును.

## నక్షత్రములతో దేవతలకు సమన్వయము

మన పూర్వఋషులు ఏ నక్షత్రములు ఏ స్థానమున నున్నపుడు భూమిమీది వాతావరణస్థితి యెట్లున్నదో గమనించుచు కొందరు దేవతలను కొన్ని నక్షత్రములతో నన్వయించిరి. ఏ నక్షత్రమును ఏ దేవతతో సమన్వయించిరో ఆ వివరములు కొన్ని కృష్ణయజుర్వేదమునందలి నక్షత్రేష్టిభాగములో స్పష్టముగా తెలిపియున్నారు. కృత్తికకార్తెలో తాపము దుస్సహముగా నుండును. కనుక ఆ దినములు "అగ్నికత్తెర"దినములనిరి. కృత్తికచుక్కలకు అగ్నితో సంబంధము కలదు గనుక అప్పుడు ఇండ్లు నేయుటకు తాటికమ్మలుకూడ నరకకూడ దని నిషేధించిరి. "కృత్తికానక్షత్ర మగ్నిర్దేవతా" అని కృత్తిక అగ్నియే యని నిరూపించిరి, అదేవిధముగా స్వాతికార్తెలో గాలివాన లధికము. ఆ కార్తెలోనే తుపానులు, ఉప్పెనలు సంభవించుట అనుభవసిద్ధము. చరిత్రప్రసిద్ధమైన బందరు ఉప్పెన 1864 సంవత్సరము నవంబరు ఒకటవ తేదీని స్వాతికార్తెలోనే సంభవించినది. వాయువుయొక్క "మహాబలము" మన కాదినములలో ఘోరముగా ప్రదర్శింపబడుచున్నది. కావుననే "స్వాతీనక్షత్రం వాయుర్దేవతా" అని కృష్ణయజుర్వేదము. ఇది యొక లెక్క.

రెండవది: సూర్యాస్తమానము కాగానే తూర్పున నుదయించు చుక్కల విషయములో అప్పటి భూమిమీది వాతావరణస్థితిగతులను, విశేషములను బట్టి మరి కొందరు దేవతలతో ఆ చుక్కలకు సంబంధము కలిపిరి. జ్యేష్ఠమాసములో జ్యేష్ఠనక్షత్రము సూర్యాస్తమానము కాగానే తూర్పున నుదయించి మెఱయుచుండును. అప్పుడే నైరృతిపర్వవాయువు (South-west Monsoon) ప్రారంభమగును. వర్షములు బాగుగా కురియనారంభించును. కాబట్టి జ్యేష్ఠానక్షత్రము వర్షప్రదుడగు ఇంద్రు డనిరి. "జ్యేష్ఠానక్షత్రం ఇంద్రో దేవతా" అని శ్రుతి.

తరువాత ఆషాఢమాసములో సూర్యాస్తమానము కాగానే తూర్పున పూర్వాషాఢ ఉత్తరాషాఢ నక్షత్రములు ఉదయించును. అప్పటికి తొలివర్షముల ధర్మమా యని వేండ్రము తగ్గి లోకము చల్లబడును. ఆ తరుణములో ప్రాణులలో స్త్రీపురుషసమాగమవాంఛ (Sexual urge) కలుగుచున్నది. ఈ విషయము మహాకవి కాళిదాసు మేఘసందేశములో ఎంతో రమ్యముగా వర్ణించినాడు. అప్పటికి ఎనిమిది మాసముల నుండి ఏకాంతవాసశిక్ష ననుభవించుచున్న కుబేర శప్తుడు యక్షుడు ఆషాఢ ప్రథమదివసమున మేఘము లావరించిన పర్వతసానువును చూడగానే వాని మనస్సు చలించినది; భార్యమీద ధ్యానము పోయినది; ఆమెకు వర్తమాన మంపవలెనని సంకల్పము కలిగినది. కాని కామార్తుడైనందున యుక్తాయుక్తముల నారయక, ధూమజ్యోతిస్సలిలమారుతసంయోగముచే నేర్పడిన మేఘము తన సందేశమును తన భార్య కందజేయ గలదో లేదో, ఔత్సుక్యముచేత పరిగణింపక, మేఘముచేతనే ఆమెకు సందేశమంపెనని కాళిదాసు చేసిన వర్ణనము ప్రకృతిని ఎంతో చక్కగా అనుసరించియున్నది. మన్మథుడు చెఱుకువిలుకాడు. ఆ విల్లే ధనుస్సురాశి. విరాట్పురుషుని ఊరుయుగప్రదేశము ధన్వి; "ధన్వీ. చోరు యుగమ్"అని ప్రమాణవచనము.

కొంతకాలము ఏకారణముచేతనైనను దూరముగా పోయిన బంధువులును, మిత్రులును మనకు

కనబడినపుడు అట్టి ప్రథమసందర్శనము మన కెంతో సంతోషకారణము. అదేవిధముగా ఏ పరిభ్రమణములవలననో, ఏసంయోగములవలననో మనకు కొంతకాలము కనబడకపోయిన నక్షత్రస్వరూపులైన దేవతలు—మనకు వరము లిచ్చి రక్షించి పరమోపకారము చేయు దేవతలు - తిరిగి సూర్యోదయమునకు ముందు తూర్పున నేనాడు కనబడుదురో, ఆనాడు ఆనక్షత్రాధిదేవతలకే తప్పక ముఖ్యముగా పూజచేయు చుండిరి. మన దేవతలకు ప్రీతిగా పండుగదినము లీవిధముగానే ఏర్పడినవి. ఈయంశము స్పష్టముగా వేదములో వక్కాణింపబడినది.

"ప్రాత ర్యావాణా ప్రథమా యజధ్వమ్,
నోతన సాయమ స్తి దేవాయా అజుష్టమ్"
(ఋగ్వే. V-77-1)

ఈమంత్రమున కర్థ మేమనగా:—సూర్యోదయాత్పూర్వము తూర్పుదిక్కున ఏనాడు ఏనక్షత్ర ముదయించునో ఆనాడు ఆనక్షత్రసంబంధమైన దేవతను ముఖ్యముగా ముందు పూజింపవలెను. లేదా, రెండవ పక్షములో, సూర్యాస్తమానము కాగానే తూర్పున నుదయించు నక్షత్రముల దేవతలనైనను ఆనాడు పూజింపవచ్చును. అభ్యంతరము లేదు.

## Heliacal rising : Acronycal rising

చుక్కలు మొదలగు ఖగోళసంచారులు సూర్యోదయమునకు ముందుగా తూర్పున నుదయమగుటను పడమటి దేశములవారు Heliacal rising అందురు. మనము ఉషఃకాలోదయము అనవచ్చును. సూర్యాస్తమానము అయినతరువాత అవి తూర్పున నుదయించుటను వారు Acronycal rising అందురు. మనము సాయంసంధ్యాసమయోదయ మనదగును. ఈనక్షత్రముల విషయమై విశేషపరిశోధన చేసిన ఎమిలిన్ ప్లంకెట్ దొరగారు ఈవిషయమై వ్రాసిన ఈక్రింది వాక్యములు మనము చక్కగా గ్రహింపదగును:*

"It is probable that the heliacal rising of certain bright stars in these constellations at some special season of the year, rather their culmination at noon or mid night may have been the occasion for taking interest in them."

సాధారణముగా పురుడుపుణ్యాకాలములపుడు మన యిండ్లలో చేసికొను శుద్ధిపుణ్యాహవాచనకర్మలో మన పురోహితులు తైత్తిరీయబ్రాహ్మణము (I. 5-2-1) లోని ఈక్రిందిమంత్రములను చదువుటకూడ మన మీసందర్భములో ముఖ్యముగా గమనింపవలసిన విషయము:—

"యత్పుణ్యం నక్షత్రమ్, తద్వద కుర్వీతోపవ్యుషమ్, యదావై సూర్య ఉదేతి అథ నక్షత్రం నైతి యావతి తత్ర సూర్యో గచ్ఛేత్, యత్ర జఘన్యం పశ్యేత్ తావ త్కుర్వంతి యత్కారస్యాత్ పుణ్యాహఏవ కురుతే"

కాబట్టి సూర్యోదయకాలమునకు ముందు ఉషఃకాలములో తూర్పున ఏచుక్కలు ఉదయించునో గమనించి ఆనక్షత్రాధిదేవతలను ఆనాడు తప్పక పూజించి వారి పండుగచేయుట వేదకాలమునుండి మన దేశములో ఆచారమైయున్నది. కనుక భాద్రపద శుద్ధచవుతినాడు విఘ్నేశ్వరనక్షత్రములు తూర్పున సూర్యోదయమునకు ముందు ఉదయించుటచేత ఆ దినము మనమందరము విఘ్నేశ్వరుని పూజించుచున్నామని తెలిసికోవలెను.

## విఘ్నేశ్వరుని నక్షత్రరూపము

ఏనుగతొండము, లంబోదరము, ఎలుకవాహనముతోకూడ నక్షత్రస్వరూపుడగు విఘ్నరాజు ఉత్తరాకాశమున నానాడు సూర్యోదయాత్పూర్వము తూర్పున నుదయించును. తొలినాడు విఘ్నేశ్వరచవుతి. మరునాడే ఋషిపంచమి. కాబట్టి సప

* 'Ancient Constellations and Calenders' by Emmeline Plunket. Page 249.

ఋషుల ప్రక్కనే మనము విష్ణ్వీశ్వరనక్షత్రములను చూడగలము. సప్తమహాఋషులను చుక్కలు ఏడును ఏడు కొంగలు ఎగురుచున్నట్లు కనబడునని భాసకవి ఎంతో రమ్యముగా వర్ణించినాడు.* పడమటి దేశముల వారు ఇవి నాగలివలె ఉన్న వందురు. కాని ఆ దేశములలోకూడ The Great Bear or Ursa Major (భల్లూకము-పెద్ద ఎలుగుబంటి) అనియే వాడుక. ఈ భల్లూకము సంగతి శ్యమంతకమణిసందర్భములో మరల ముచ్చటించుకొందము.

## ఈ రూపము ఆకాశముననున్నట్లు ఇతర దేశములవారి సాక్ష్యము

ఈ యెలుకరూపమును, ఏనుగరూపమును హిందువులేగాక ఇతర దేశములవారుకూడ ఆకాశమున గమనించి గ్రంథస్థముచేసిరి. ఇట్లనుటకు ప్రబలనిదర్శనములు కలవు. గ్రిమాల్డి (Grimaldi) దొరగారు రచించిన Catalogue of Zodiacs and Planispheres Etc. అనే గ్రంథముయొక్క 31 పుటలో చీనా నక్షత్రపటలముల పట్టికలో నెం 146 రు నమోదులో ఎలుక రూపము గ్రంథస్థముచేయబడెను. ఆ తరువాతి నెం 147 లో ఈ యెలుక సప్తఋషుల ప్రక్కనే ఉన్నట్లు తెలుపబడినది. మరియును ఆ గ్రంథముయొక్క 143-వ పుటలో నెం 1179 రు నమోదులో రాగిరేకుమీద బొమ్మలు చిత్రింపబడినట్లు కలదు. అందులో నొక చోట సింహము, కన్య బొమ్మలు కలవు. సింహమునకు మీద కొంచెముదూరములో ఏనుగ, మనుష్యుని బొమ్మ లున్నవి. కాబట్టి గజముఖుడు, లంబోదరుడు, మూషకవాహనుడు నైన నక్షత్రరూపుని మన హిందువులేగాక ఇతరదేశములవారుకూడ గమనించి గ్రంథస్థము చేసిరని స్పష్టముగా ఋజువు కనబడుచున్నది.

## [illegible]తలు నక్షత్రములా ?

ఈ ప్రశ్న అనేకులు వేయుచున్న ప్రశ్న. యజుర్వేదపురుషసూక్తములో "అహోరాత్రే పార్శ్వే నక్షత్రాణి రూపమ్" అని భగవంతుని గూర్చిన శ్రుతి వాక్యము మరువకుడని నా విన్నపము. నక్షత్రఇష్టిలో ఏ నక్షత్రము ఏ దేవతతో సమన్వయించబడినది కొంత మాచియున్నాము. దేవశబ్దమునకు తేజస్సుకలది; మెఱయునది; ప్రకాశముగల నక్షత్రము - వెలుగు, తేజస్సు అని యర్థము. ఉదయము, అస్తమానము చంద్రునికివలె తేజస్సునందు భేదములుఉండవచ్చును.† కాబట్టి ఆకాశమున తేజస్సుతో మెఱయు నక్షత్రములను దేవతాభావముతోనే మనవారు అనాదినుండి పూజించుచువచ్చిరి. ఇటీవల జ్యోతిశ్శాస్త్రములో పడమటి దేశములలో క్రొత్తయుగమును స్థాపించిన సర్ విలియమ్ హెర్షెల్ గారు ఆకాశరంగమునంతయు క్రమప్రకారము ఏబదియేండ్లు పరిశీలించి "Quicquid Nitct Notandum" అనే మకుటముతో అద్భుతముగా పనిచేసిరి. ఆ లాటిన్ వాక్యమునకు ఇంగ్లీషు అర్థము—"Whatever shines should be observed" (తేజస్సు కలిగి మెఱయుచున్న ప్రతిదానిని ఓపికతో పరిశీలింపుము) అని. ఈ మకుటమును ఇటీవల ఇంగ్లండులోని "Royal Astronomical Society" అనగా రాజరాజేంద్రుని సాహాయ్యసన్మానములను పొందుచున్న జ్యోతిశ్శాస్త్రసంఘము వారు కూడ ధరించుచున్నారు. ఇవి ఈనాటి ముచ్చటలు. వేదకాలమునాడు మనవారు అంబరమున గోచరించు ప్రతి తేజోమూర్తిని జాగ్రతగా పరిశీలించి దేవభావముతో పూజించిరి. కాబట్టి నక్షత్రములను దేవతలనుటలో తప్పులేదు. పొరపాటు కాదు. అది వేదసమ్మతము; నవీనశాస్త్రసమ్మతము.

* "ఋజ్వాయతాంచ విరలాంచ నతోన్నతాంచ సప్తర్షివంశకుటిలాంచ నివర్తనేషు."

(స్వప్నవాసవదత్త)

† "Deva means a shining or luminous star; luminosity; light itself subject to appearance and disappearance like the Moon on days of Full moon and New moon" R. Shama Sastri : 'Vedic Iconography'

## చైత్రశుద్ధచవుతి

భూభ్రమణములు మొదలగు ననేకకారణముల వలన ఒకనాటి సూర్యోదయమునకు ముందు ఉదయించిన నక్షత్రము మరునాడు నాలుగు నిమిషములు ముందు ఉదయించును. పదునైదు దినములలో 15 × 4=60 నిముషములు, అనగా ఒక గంటకు ముందు ఉదయించును. నెలరోజులలో రెండుగంటల ముందు ఉదయించును. ఆరునెలలలో పండ్రెండుగంటల ముందు ఉదయమగును. అనగా సూర్యాస్తమానము వేళకు తూర్పున నుదయించును. కాగా, భాద్రపద శుద్ధచవుతినాడు సూర్యోదయమునకు ముందు తూర్పున నుదయించిన విఘ్నేశ్వరుడు చైత్రశుద్ధచవుతినాడు సూర్యాస్తమానమైనతరువాత తూర్పున కనబడును. కాబట్టి ఆనాడుకూడ—పైనుదహరించిన వేదవాక్యమునుబట్టి—గణేశపూజ విధింపబడినది.

ఈనాడు అస్సాముగాష్ట్రి మనబడుచున్న కామరూపదేశములో విఘ్నేశ్వరుని పండుగ ఏప్రిల్ నెలలో చైత్రశుద్ధచవుతినాడు చేయుచుందురని అక్కడ Geological Survey లో కొంతకాలము పనిచేసిన నామిత్రులు శ్రీ డా. సి. మహదేవన్ యం. ఏ., డి. యస్. సి. గారు నాకు నిరుడు సికింద్రాబాదులో తెలిపిరి. మనము సెప్టెంబరునెలలో చేయు వినాయకపూజ కామరూపదేశస్థులగు అస్సాము రాష్ట్రపు ప్రజలు మార్చినెలలో ఏల చేయవలెనో అని మహదేవన్ గారు సంశయించుచుండిరి. గణేశనక్షత్రములు మార్చినెలలో సూర్యాస్తమానమైన తరువాత తూర్పున నుదయించునుగనుక పై వేదవాక్యముప్రకారము అపుడు గణేశపూజ వేదచోదితమే నని నేను తెలియచెప్పినతరువాత వారి సంశయము తొలగెనని సెలవిచ్చిరి.

## మాఘశుద్ధ చతుర్థి

లెక్కప్రకారము చైత్రశుద్ధచవుతినాడే వినాయకనక్షత్రదర్శనము మనకు సూర్యాస్తమానము కాగానే తూర్పున లభించవలసినది. కాని విఘ్నేశ్వర నక్షత్రములును, సప్తఋషులును ధ్రువసమీపమున కానవత్తురు. ధ్రువునకును, ధ్రువునిచుట్టు నతిసమీపములో ప్రదక్షిణముచేయు లఘుఋక్షపు చుక్కలకును ఉదయాస్తమానములు లేవు. "నాస్తమేతి నచోదయమ్". ఆనక్షత్రములకు సప్తఋషులును, విఘ్నేశ్వర నక్షత్రములును ఎంతో దూరమందు లేవు. క్రాంతి వృత్తస్థములగు అశ్విని, భరణి, కృత్తిక మొదలగు నక్షత్రములవలె తూర్పున ఉదయకాలప్రథమదర్శనము మొదలు సాయంసమయప్రథమదర్శనమునకు మధ్య ఈ విఘ్నేశ్వరనక్షత్రములకు ఆరునెలలు గడచిపో నక్కరలేదు; సప్తఋషులు మఘనక్షత్రముతోనే ఉదయమగుదురు. ఆప్రక్కనున్న విఘ్నేశ్వరుడు అంతకుముందే ఉదయమగును. కనుక మాఘశుద్ధచతుర్థి నాటికే ప్రత్యక్షముగా విఘ్నేశ్వరుని సాయంకాలమున సూర్యాస్తమానము కాగానే చూడగలుగుదుము. ఈకారణముచేతనే మన పంచాంగకర్తలు గతానుగతికముగా మాఘశుద్ధచతుర్థినాడుకూడ గణేశపూజ విధించిరి. కీర్తిశేషులు, జ్యోతిశ్శాస్త్రపండితులు నగు యల్. డి. స్వామికన్నుపిళ్లె-దివాన్ బహదూరుగారు కూడ ఈ మాఘశుద్ధచవుతి గణేశచతుర్థియని వ్రాసియున్నారు

## విద్య-వినయము-విజ్ఞానము-విఘ్నేశ్వరుడు

విద్యార్థులకు విద్య చక్కగా వచ్చునట్లు విఘ్నేశ్వరుడు వరమియ్యగలడు. విద్య వినయమువలన సాధింపనగును. విద్యకు పరమప్రయోజనము వినయము. భర్తృహరి చెప్పినట్లు "విద్య యొసగును వినయంబు" "వినయులగుచున్ మహోన్నతి దనర్చు" చుండుట విద్వాంసలక్షణము.

విఘ్నేశ్వరునికి దూర్వలతో పూజనొందుటయందు ప్రీతి అధికము. మనలో ననేకులు గడ్డిని చాల చులకనగాచూచుచుందురు. "మనముకాళ్లతో త్రొక్కి దొమ్మాడుకొనిపోవు వెధవపచ్చగడ్డిపరకలు" అని గడ్డిపరకలను గూర్చి నీచముగా, తేలికగా మాటలాడుట

చాలమందికి అలవాటు. దేనినైనను నీచభావముతో నిరసించుట మంచిది కాదు. "అవివేకులు నిందించినను నాకు గడ్డిపరకయందే ప్రీతి యధిక"మని విఘ్నరాజు దూర్వలతో పూజకోరుచున్నాడు. అనగా సృష్టిలో అల్పము స్వల్పము నని తోచు ప్రతివిషయమును శ్రద్ధతో పరికించినకొలది దాని మహత్త్వమేకాని యల్పత్వము గోచరించదు. ఆ మూలముగా విజ్ఞానాభివృద్ధియై సద్విద్య యలవడును. మానవకోటికి పెంపుడు తల్లి యని పూజనొందు గోమాత ఆ గడ్డియే తిని, జీవించి, మానవజీవనము పోషించుటకు మిక్కిలి అవసరమైన పాల నిచ్చును. ఆ పాలవలన పెరుగు, వెన్న, నెయ్యి మొదలగువానిని మనము తయారుచేసికొనుచున్నాము. విద్య నభిలషించి, విఘ్నేశ్వరప్రీతిగా దూర్వలను కోయు విద్యార్థి అవి యెట్లు పుట్టి పెరిగినవో గమనింపవలయును. వేసవి ఎండలకు మండుకొని పోయిన భూమి తొలివర్షములకు చల్లబడును. ఆవరకు ఎవ్వరకును కానరాక ఏ మూలనో ఒదిగియుండిన గరికి విత్తనములును, ఇతర ఓషధిజాతుల విత్తనములును జలస్పర్శమాత్రచేత అద్భుతవికాసము నొంది, విజయవంతముగా పెరుగుచు విజృంభించుచుండుట పరికించుకొలది ఇంద్రజాలమా యని ప్రకృతిపరిశోధకులకు దిగ్భ్రమకలిగించును. వృక్షజీవుల ఉత్పత్తి, అవి కోమలముగా, ఏపుగా ఎదుగు క్రమము శాస్త్రదృష్టితో పరికించువారికి ఎంత విజ్ఞానాభివృద్ధియగును ?

## ఇరువదియొక్క పత్రులు

వ్రతకల్పములో విఘ్నేశ్వరునికి ఇరువదియొక్క పత్రుల పూజ ఇష్టమని చెప్పబడినది. ఆ పత్రు లేవేవి యనగా:—౧. మాచిపత్రి, ౨. వాకుడు, ౩. మారేడు, ౪. దూర్వ, ౫. ఉమ్మెత్త, ౬. రేగు, ౭. ఉత్తరేణి, ౮. తులసి, ౯. మామిడి, ౧౦. గన్నేరు, ౧౧. నీలపుపూవులు పూయు విష్ణుక్రాంతము, ౧౨. దానిమ్మ, ౧౩. దేవదారు, ౧౪. మంగ, ౧౫. వావిలి, ౧౬. జాజి, ౧౭. వెలగ, ౧౮. జమ్మి, ౧౯. రావి, ౨౦. నల్లమద్ది, ౨౧. జిల్లేడు. ఇందు ఒక్కొక్క ఓషధి ప్రయోజనములనుగూర్చి ఒక్కొక్క గ్రంథము వ్రాయవచ్చును. అటువంటి అద్భుతశక్తులు గల ఈ ఓషధులను ఈ మాసములో పరిశీలించుటవలన ఎటువంటి విజ్ఞానాభివృద్ధి కలుగునో, ఈ యోషధుల పత్రులను మనము స్వయముగా మన చేతులతో కోసి తెచ్చి వానితో విఘ్నరాజును పూజించినపుడు ఆ స్పర్శసంపర్కముల మూలముగా నెటువంటి శారీరక, ఐహిక, ఆముష్మిక విశేషములు సాధింపబడునో ఆ వివరములను వృక్షశాస్త్రవేత్తలు పరిశోధించి తెలిసికొని లోకమునకు ప్రకటించి మహోపకారము చేయవలసియున్నది. బహువిధప్రయోజనములు లేని కార్యక్రమము మన పూర్వులు విధించియుండరని నా దృఢవిశ్వాసము. ఓషధిశాస్త్రపరిశోధకులు (Botanists) ఓపికతో నవీనవిజ్ఞానవిషయదృష్టితో వీని ప్రయోజనములను తాము గమనించి, సమన్వయించి ప్రకటించి లోకుల కృతజ్ఞతకు పాత్రులగుదురుగాక !

## ఖగోళదృశ్యములలో విఘ్నేశ్వరుని కథ

పురాణముల ననుసరించి విఘ్నేశ్వరుని కథను విఘ్నేశ్వరచరిత్ర మను పేరుతో నేనీవఱకు ప్రకటించియున్నాను. అందలి సారాంశ మిది. గజుడను మహారాక్షసు డొకడు ఈశ్వరునిగూర్చి ఘోరతపస్సు చేసి, మెప్పించి, ఈశ్వరుడు తన హృదయములో నుండునట్లు వరము బడసెను. ఈశ్వరుడు తనలో నుండుటచేత గజుడు ఎవరికిని లొంగక ఎల్లలోకముల నేలుచుండెను. పార్వతి ఈశ్వరునకు దూరమైపోయెను. విష్ణుమూర్తి, బ్రహ్మ, పార్వతి, ఇంద్రుడు, నారదుడు వీరందరును కుట్రచేసి, మాయవలన రాక్షసుని గెల్చి, చంపి, ఈశ్వరుని పైకి తేవలయునని నిశ్చయించిరి. విష్ణుమూర్తి ఆటకాడు; నంది గంగిరెద్దు; బ్రహ్మ డోలు; ఇంద్రుడు వీరణము; నారదుడు సన్నాయిగాడు—ఈ మాయ వేషములతో వారు గజాసురుని ఆస్థానమునకువెళ్లిరి. వేషధారులగు బ్రహ్మేంద్రులు "డోలుకంతవాడు లేదు. వీరణమున కింతవాడు లే"డని మెప్పువడసిరి. వీరి ఆటపాటల్లకు సంతోషించి గజుడు

"మీ కేమికావలెనో ఇచ్చెదను. కోరుకొను" మనెను. "నీ ప్రాణమే కావలె"నని నిజరూపములతో బయల్పడిరి. "సరే, నా ప్రాణము ఇచ్చెదను; కాని ఈశ్వరునకును, నాకును అవినాభావసంబంధ ముండునట్లు నా చర్మము వదలక ఎప్పుడును ఈశ్వరుడు ధరింపవలెను. నా ముఖమునకు ఎప్పుడును మొదటిపూజ జరగవలెను. నా కీ రెండువరములు ఇచ్చి మీరు నా ప్రాణము తీసికొనుడు" అని రాక్షసుడు చెప్పెను. విష్ణుమూర్తి అందు కంగీకరించెను. నంది వెళ్లి తన వాడికొమ్ములతో గజుని గుండెలు చీల్చి ఈశ్వరుని బైటకు తెచ్చెను. పార్వతి ఒడలు నలచుకొనిన పిండిబొమ్మ మొండెమునకు గజుని శిరస్సు అతికి ప్రాణము పోసి గజముఖుని తయారుచేసిరి. ఈశ్వరుడు గజుని చర్మము వదలక ధరించెను. గజముఖుడు కుమారస్వామితో బహిరంగముగా పోటీచేసి గెల్చి విఘ్నాధిపత్యముతో ప్రథమపూజాగౌరవమును పొందెను.

ఇక ఖగోళములో అశ్విని, భరణి, కృత్తిక నక్షత్రములు మూడును నాగవీథి యనియు, రోహిణి, మృగశిర, ఆర్ద్రనక్షత్రములు గజవీథి యనియు పురాణములన్నియు తెలుపుచున్నవి. "ఆర్ద్రానక్షత్రం రుద్రో దేవతా" అని నక్షత్రఇష్టి. కాబట్టి ఆర్ద్రనక్షత్రము రుద్రుడు - ఈశ్వరుడు. ఈయీశ్వరుడు గజవీథిలో - ననగా గజునిలో నిరుకుకొనియుండవలసి వచ్చెను. పిమ్మట, రాశివిభాగము వచ్చినది. మొదటి మూడురాసులును మేషము, వృషభము, మిథునము. అందు మేషము అశ్విని + భరణి + కృత్తిక $\frac{1}{4}$; వృషభము కృత్తిక $\frac{3}{4}$ + రోహిణి + మృగశిర $\frac{1}{2}$. ఈ వృషభరాశియే నంది. ఈవృషభము వచ్చి గజుని చంపినది. కాగా మృగశిరలో సగము, ఆర్ద్రనక్షత్రము పూర్తిగాను, పునర్వసులో $\frac{3}{4}$-ఇవి మిథునము లోనికి పోయినవి. గజవీథినుండి - అనగా గజునిలో నుండి ఆర్ద్రను వెలికితీసి, వృషభము ఆర్ద్రకు వాహనమును, ధ్వజమును నై ఆర్ద్రను మిథునములో చేర్చుటకు తోడ్పడినది. అంతకుముందు గజుని మూలముగా వేసైన పార్వతీపరమేశ్వరమిథున మిప్పు డేకము కాగల్గినది. గజచర్మరూపమును స్ఫురింపకేయు చిన్న చుక్కలు అనేకముగా ఆకుద్రసమీపమున మీదుగా నున్నవి. పార్వతీపరమేశ్వరులకు ముద్దుబిడ్డడై, గజముఖుడై, పునర్వసుచుక్కలకు సమీపములో సప్తఋషుల ప్రక్కనే విఘ్నేశ్వరు డున్నాడు. శివకేశవులందు భక్తిభావము గలవారికి విఘ్నేశ్వరుడు ప్రథమపూజ్యుడై ఖగోళములో సంబంధము కలుపుచున్నాడు. శివాలయములలో నందులు Zodiacal Bull (వృషభరాశి) సంజ్ఞకములై యున్నవి.

## శ్యమంతకోపాఖ్యానము

సత్రాజిత్తనువాడు సూర్యునారాధించి దినమునకు 8 బారువుల బంగారము నిచ్చు శ్యమంతకమను మణిని సంపాదించెను. ఆమణిని ఉగ్రసేనుని కిమ్మని శ్రీకృష్ణుడు సత్రాజిత్తు నడిగెను. సత్రాజిత్తు ఇయ్యనని చెప్పివేసెను. పిమ్మట వాని తమ్ముడు ప్రసేనుడు ఈమణి మెడలో వేసుకొని వేటకు వెళ్లెను. అడవిలో వానిని సింహము చంపెను. జాంబవంతుడు సింహమును చంపి, మణిని తీసుకొని తన కుమారుడాడుకొనుటకు వాని ఊయెలకు వ్రేలకట్టెను. శ్రీకృష్ణుడు మాయచేసి తన తమ్ముని చంపి మణిలాగుకొనెనని సత్రాజిత్తు అపవాదువేసెను. ఆ యపవాద నివృత్తికొఱకు శ్రీకృష్ణుడు అడవికి పోయి, ప్రసేనుని శవమును, సింహముశవమును చూచి, అడుగుల జాడను బట్టి జాంబవంతుని గుహకు వెళ్లి వానితో 28 రోజులు మహాయుద్ధము చేసి గెలిచి మణితోను, వాని కూతురు జాంబవతితోను తిరిగివచ్చి, సత్రాజిత్తుని పిలిపించి, కథ అంతయు చెప్పి మణి ఇచ్చివేసెను.

ఈకథలో నీక్రింది ఖగోళచమత్కారములు గమనింపదగియున్నవి:—మఘ + పుబ్బ + ఉత్తర $\frac{1}{4}$-సింహరాశి. సప్తఋషులు మఘనక్షత్రముతో నుదయింతురు. సప్తఋషులకు సంస్కృతములో బృహదృక్షము, అనగా పెద్దఎలుగుబంటి అని పేరు. ఆ పెద్దయెలుగుబంటియే పైకథలో జాంబవంతుడు. సప్త

ఋషులలో పడమటిచుక్కలు రెండును ఇటు మఘ, అనగా సింహమును, అటు ధ్రువుని చూపును. ధ్రువుడు చిన్న ఎలుగుబంటి (Ursa Minor)అనే లఘుఋక్షము లోనివాడు. చిన్న ఎలుగుబంటే జాంబవంతుని కుమారుడు. ఈమణితో వాని నాడించుచు దాది ఇట్లు పాడెనని విష్ణుపురాణములో స్పష్టముగా కలదు.

" సింహః ప్రసేన మవధీ
త్సింహో జాంబవతా హతః
సుకుమారక మారోదీ
స్తవ హ్యేష శ్యమంతకః"

('శ్యమంతకమణి ధరించి అడవికి వచ్చిన ప్రసేనుని సింహము చంపినది. సింహమును మీయయ్య జాంబవంతుడు చంపి ఆమణిని తెచ్చి నీకిచ్చినాడు. ఇదుగో ఈమణి నీదే. ఆడుకో, ఏడువకు, నాయనా.')

శ్యమంతకమణి ఆకాశము నుండి సింహరాశిని, సప్తర్షి మండలమును, లఘుఋక్షమును దాటి పడిన మే టి వ జ్ర మే మో? వి శి ష్ట మై న తేజస్సు (Radio Activity) చుఱుకుగలిగినదై నీచలోహములను అపరిమి త ము గా బం గా రు క్రింద మార్చగలిగిన శ క్తి కల్గియుం డె నే మో? లేక సూర్యునే మణిక్రింద వర్ణించిరో? ఇదమిత్థమని స్పష్టము తేలలేదు. ఇంకను పరిశోధనము అవసరము. ఆ మణికి సింహరాశితోను,సప్తఋషిమండలముతోను, లఘుఋక్షముతోను ఏదో సంబంధము కలిగియున్నట్లు కనబడుచున్నది. విఘ్నేశ్వరచవితినాడు సాధారణముగా హస్తనక్షత్రముతో చంద్రుడు కూడియుండును. అనగా ఆవేళ నక్షత్రము హస్త. హస్తి అనగా ఏనుగు తొండము గల జంతువు. విఘ్నేశ్వరునికి ఏనుగు తొండ మున్నది. ఈ హస్తి-హస్తలకు ఏమైన సంబంధము కలదా అని నన్ను మహారాజశ్రీ విస్సా అప్పారావుపంతులుగారు ప్రశ్నించినారు. "వేదములో 'హస్తానక్షత్రం సవితా దేవతా' అని యున్నది. హస్త నక్షత్రమునకు సవితృ డధిదేవత. సవితృ డనగా సూర్యుని కర్థము చెప్పుచున్నారు. సత్రాజిత్తు సూర్యునారాధించి శ్యమంతకమణిని సంపాదించె నని పురాణములు ఘోషించుచున్నవి. ఇంతమట్టుకు స్పష్టముగా తెలిసినది. ఆపైని తెలియలేదు. పరిశోధింపవలసియున్నది"అని వారితో మనవిచేసినాను. ఈ విషయమై పండితులును, వైజ్ఞానికులును ఎక్కువ శ్రద్ధతో పరిశోధనచేసి శ్యమంతకమణిసమస్యను పూర్తిగా సాధించుటకు మార్గ మేర్పరుపదగునని విన్నవించుచు శ్యమంతకమణి ప్రస్తావననుండి విరమించుచున్నాను.



# చిన్నమదేవి విజయము

[ఏకాంకిక]

= శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి =

[గతసంచిక తరువాయి]

2. స్థలము. బ్రాహ్మణవీథి

ము. చే (ప్రవేశించి) చిన్నమదేవిగారు ఆజ్ఞాపించినారు. ఏలినవారు కోపంతో వెళ్ళిపోయి వారంరోజులైనవి. ఇంకా కోపంగానే ఉన్నారు. ఎవరూ వారిదగ్గరికి పోలేకుండా ఉన్నారు. దేవిగారి దుఃఖానికి మేరలేకుండా ఉన్నది. ఏమైనా మార్గం వెతకవలసిందని ముక్కు తిమ్మనగారితో వెళ్ళి మనవి చేసుకుంటాను. రామలింగయ్యను పూర్వం తన్ని పన్ను రాలగొట్టినవారుగదా. ఇప్పుడున్న ఏదైనా ఉపాయం చేయగలరు. వారిదగ్గిరకే వెళతాను.

(నేపథ్యమునుండి 'శృంగారప్రబంధ మేదైనా తాము వ్రాయవలెనండి')

ము. చే—(రెండడుగులు నడిచి ఎదుటచూచి) రుగో తిమ్మయ్యగారు. శిష్యుడు భట్టుమూర్తితో నేదో మాటలాడుకున్నారు. కవితాగోష్ఠి కాబోలు.

(అంత తెరయెత్తగానే తిన్నెపై కూర్చున్నవారుగా ముక్కుతిమ్మన్నయు, భట్టుమూర్తియు ప్రవేశింతురు.)

భట్టు—శృంగారప్రబంధ మేదైన తాము వ్రాయవలెనండి. ఎంతకాలం ఈలాగ గ్రంథరచన చేయకుండా ఉంటారు?

తిమ్మన—అబ్బాయీ, కావ్యరచన యనగా సామాన్యమా? చిరకాలముగా కావ్యరచనాసంకల్పము నాకు ఉన్నదిగాని అవకాశముకొఱకు ఎదురుచూచుచున్నాను.

భట్టు—అవకాశము మనము కల్పించుకొనవలయునుగాని తానుగా నెట్లు వచ్చును?

తిమ్మన—నిజమే. ఏ కథను వ్రాయవచ్చును?

భట్టు—ఏదైనా ఒక హరివంశకథ. పెద్దయ్యగారి మనుచరిత్ర చాలపరకైనది.

ము. చే—(సమీపించి) స్వామీ, నమస్కారములు. మా రాణీ చిన్నాదేవిగారు తమతో రహస్యంగా విన్నవించమన్నారు.

తిమ్మ—ఏమాజ్ఞాపిస్తున్నారే మా చిన్నమ్మగారు?

ము. చే—తామిటు రావలెను. (అని ముగా తీసికొనిపోయి చెవిలో నేమో చెప్పును)

తిమ్మ—ఆహా! హా! ప్రణయకలహము. ప్రతిమించి రాగమున బడినది. చక్రవర్తికి బోధించుట ధ్యమా? దావానలము ఉద్ధరిణెనీటిచే నడగునా! నా వలన నీపని సాధ్యమా? మఱి రాణిగారి వనట తీరుట యెట్లు? ఓరి రామలింగా, ఎంతపని చేసితివిరా! నాడు నాచే నొక తాపునకు ఒకపన్ను పోగొట్టుకొంటివి. నేడు రాణిగారిచే ఏలినవారినే తన్నించి ఏమి కానున్నావో! ఏలినవారు కోపగించిన నేమైపోగలవు? కానీ సాధించెద. కవినిగదా! నాకసాధ్యమేమున్నది? నా కవనమహిమచేత చక్రవర్తిని అనుకూలనాయకుని జేసెద. అమ్మా, దేవికి విన్నవించు—తిమ్మనగారు ఉపాయం చేస్తున్నారు, కొంతకాలము ఓపికపట్టవలయును అని.

ము. చే.—తమ యాజ్ఞ. దేవిగారికి కొంత ఊరట కలిగిస్తాను. (అని నిష్క్రమించును)

తిమ్మ—(శిష్యునితో) ఓయీ, తటస్థించినది కథ. నేడే రచనకు ప్రారంభించెదను. వ్రాయబోవు మహాకావ్యము శ్రీకృష్ణభగవానుని దివ్యచరిత్రము పారిజాతహరణము. (ఆలోచించి) ఎట్టి యద్భుతసంవిధానము, ఎట్టి మనోహరసన్నివేశము! శ్రీకృష్ణదేవరాయలు, తిరుమలదేవి చిన్నాదేవులు— శ్రీకృష్ణభగవానుడు, రుక్మిణీసత్యభామలు.

భట్టు—బళిబళి! బాగా కుదురుతున్నది.

తిమ్మ— తెనాలిరామలింగయ్య నారదమహాముని. వజ్రపుపిల్ల పారిజాతపుష్పము. రాజు పూర్వజన్మమున శ్రీకృష్ణుడు; ఈ జన్మమున శ్రీకృష్ణదేవరాయడు. ఆ. ఆఆ. ఉండు ఉండు. అబ్బాయీ, వ్రాసుకో, పద్యం చెప్తాను.

భట్టు—(వ్రాయుట నభినయించును.)

తిమ్మ—

యాదవత్వమున సింహాసనస్థుడు గామి
సింహాసనస్థుడై చెన్ను మెరయ
గొల్లయిల్లాండ్రతో గోడిగించుట జేసి
పరకామినీసహోదరత జూప
మఱి జరాసుతునకై మథుర డించుట జేసి
పరవర్గదుర్గము ల్బలిమి గొనగ
పారిజాతము నాసపడి పట్టితెచ్చుట
నౌదార్యమున దాని నడుగుపఱుప

తే. గోరి తొలుమేన దనకైన కొదువలెల్ల
మాన్చుకొనవచ్చి భువనైకమాన్యలీల
నవతరించిన కృష్ణుడో యనగ మించె
నరసవిభు కృష్ణరాయభూనాయకుండు.

భట్టు—ఆహా! హా! నేను కోరుతూఉండినంత కాలం తమకు ఉత్సాహం కలుగలేదు. భగవంతుని కృపచే నిప్పుడు కలిగినది. ఆంధ్రవాఙ్మయమునకు అమూల్యాలంకారమైన గ్రంథరాజము పుట్టబోవుచున్నది.

తిమ్మ—అవకాశం రాకతప్పదోయి అవకాశం వచ్చెను. పెద్దయ్యగారు అనలేదా 'మసక కృష్ణుల్ రచియింపుమటన్న నెక్యమేమో' అని. ఇప్పుడు తీరిపోయినది.

కుడిచె పదిక మిప్పటికిక
పదిలముగా రాజు కెంకుకపడు రేపటికిక
సదమదము గలదు పిమ్మట
మది కరుగదొ యింకనైన మన ప్రభువునకున్.

ఏలినవారి హృదయమునకు ఎక్కునట్లుగా రచియించెదను. మామూలుమాటలే ప్రయోగించెదను. వారికిని,రాణిగారికిని సాక్షాత్తుగా జరిగిన సంభాషణలే పద్యములలో గూర్చెదను. నేటి పరిస్థితులవలెనే చిత్రించెదను. శృంగారము పరమావధి దాకునుగాక. ప్రబంధము వినినతక్షణమే ప్రభువునకు పునస్సమాగమకాంక్ష ఉదయించునుగాక. ఇయ్యది తన చరిత్రమే యని ప్రభువునకు తోచునుగాక.

కావ్యం యశసే ర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మితత యోపదేశయుజే.

అట్లుగదా ప్రభువుల కుపదేశింపవలయును. చూడు నాదెబ్బ.

భట్టు- -వ్రాయబోవు మహాకావ్యమునకు ప్రసావనయైనది. మరి గురువుగారూ, సంధ్యవేళ యతిక్రమించుచున్నది.

తిమ్మ—అవునోయి, పోదముదా.

(అని ఇరువురును నిష్క్రమింతురు.)

౮. స్థలము. రాయలశిబిరము

రాయ—కవీశ్వరులారా, మాదిగ్విజయం ఏరీతి?

తిమ్మన—నరసింహాకృష్ణరాయా

దురమున నీపేరు పేర దురకల ద్రుంచెన్

కరిరాజవరదు డవనీ

కరిఘటలును నిన్ను జూచి గ్రక్కున దిరిగెన్.

పెద్దన—సనకాదిదివిజమస్కరిఫాలగోపిచం
దనపుండ్రవల్లికల్హారికనాకి
సెలసి హాహాహూహూవుల వంజీయల తంత్రి
శ్రవ్య సింగిణులుగా చివిచితివిచి
సత్తర్షి కృతవియజ్ఝరవాలుకాలింగ
సమితి మ్రుచ్చెలకాళ్ల జమరిచమరి
రంభాప్రభానాప్సరూరోజకుం
భంబు లెచ్చట గన్న బట్టిపట్టి

తే. తిరుగు హరిపురిసురతరుసురల మరిగి
బహుళహాళహాళిభరితకల్హారిగనగర
నగరపురవరపరిబృఢజవనయవన
పృతన భవదసి నని దెగి కృష్ణరాయ.

(అంతట అప్పాజి ప్రవేశించును.)

రాయ—అప్పాజీ, మనము ఇప్పుడు గజపతుల రాజ్యముమీదికి నడువవలెను. మేము సంయుక్తాంధ్ర రాష్ట్రమును పరిపాలించవలెను.

అప్పాజీ—స్వామివారు మామాటను మన్నింపవలయును. ముందర కదలిపోవుట కార్యము గాదు. మనము మన దేశము వదలి చాలదూరము వచ్చినాము. గజపతి తెగలవారు మనకు సామగ్రులు మొదలైనవి రానీయరు. ఏలినవారు ఈప్రయత్నమును మానుట మేలు.

రాయ—(ఆత్మగతము) మహామంత్రి వలదనుచున్నాడు. ఇంతవరకు మాసైన్యములు పరాజయము నెఱుగవు. మే మేల పోరాదు? ఇక్కట్టు వచ్చిన మహామంత్రి ఉపాయము చేయగలడు. ఇక్కట్టులో గదా మంత్రిని పరీక్షించవలెను?

తిమ్మన—అవును మహాప్రభూ, మహామంత్రులవారి ఆలోచన చక్కగా నున్నది.

రాయ—కవిగారూ, తమ కావ్య మెంతవరకైనది?

తిమ్మన — ప్రథమాశ్వాసమైనది. కృష్ణమరాజుగారు దేవేరి నూరడించుటకై అమరావతికి తరలనున్నారు. తర్వాత యుద్ధము, జయము.

రాయ—బళి, మాకు శుభము. మేమును అమరావతిని దాటి కటకమువరకు పోదలచితిమిగదా. దయచేసి ఒకటిరెండు పద్యములు వినిపింపుడు.

అప్పా—(తనలో) ప్రభువునకు నాహితోపదేశ మెక్కుటలేదు. యుద్ధప్రయత్నమే కనబడుచున్నది. నాకు చిక్కుతెచ్చి పరీక్షింపజూచుచున్నాడు. కానీ చూతెద.

తిమ్మన—మహాప్రసాదము. అవధరింపుడు.

సాటలగంధిచిత్తమున
బాటిలు కోపభరంబు దీర్పనె
ప్పాటను బాటుగామి నృప
పల్లవకోమలతల్పదద్వయీ
పాటలకాంతమౌళిమణి
పంక్తికి వన్నియవెట్ట నాజగ
న్నాటకసూత్రధారి యదు
నందను డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్.

రాయ—ఆహాహా! అనంతరము?

తిమ్మన—

జలజాతాసనవాసవాదిసురపూ
జాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరము
చ్చో వామపాదంబునం
దొలగంద్రోచె లతాంగి, యట్లయగు నా
థను ల్నేరముల్సేయ బే
రలుకం జెందినయట్టి కాంత లుచిత
వ్యాపారము ల్నేర్తురే?

రాయ—ఆహాహా! (తనలో) మహాకవి నాకు హితముపదేశించుచున్నాడు. వాస్తవమే. 'నాథుల్నేరము ల్సేయ బేరలుకం జెందినయట్టి కాంత లుచిత వ్యాపారము ల్నేర్తురే?' నాదే తప్పు. త్వరపడి వచ్చితిని.

తిమ్మన— (తనలో) ప్రభువు చింతించుచున్నాడు. నాకార్యము ఫలించినది.

రాయ—తర్వాత వినిపింపుడు.

తిమ్మన—కోపనపదహతి సహసా

గోపాలుడు గాంచి మెయి గగుర్పొడువగ స

ద్దీపితమన్మథరాజ్య

ప్రాపితుడై పలికె గూర్మి బయలుపడంగన్.

రాయ—బళి! బళి!

తిమ్మన—నను భవదీయదాసుని మ

నంబున నెయ్యపు గినుక బూని తా

చినయది నాకు మన్ననయ;

చెల్వగు నీపదపల్లవంబు మ

త్తనుపులకాగ్రకంటకవి

తానము దాకిన నొచ్చునంచు నే

ననియెద, నల్క మానవుగ

దా యికనైన నరాళకుంతలా.

రాయ— దివ్యముగా నున్నది! దివ్యముగా నున్నది! త్వరలో పూర్తిగావింపుడు. (తనలో) ఇదంతయు నాచరిత్రమే. ఇచ్చట కొంతమార్చి మహాకవి నాకు హితముపదేశించుచున్నాడు. అంతఃపురమునకు పోదునా. వలదు. గజపతిని జయించిగాని రాణివాసము ప్రవేశింపను. (ప్రకాశము) ఎవరురా అచ్చట? మా సేనాపతి పెమ్మసాని రామలింగయ్యగారిని మేము చూడవలయును. (అని నిష్క్రాంతి. అందరునిష్క్రాంతి)

౯. స్థలము. విజయనగరము.

పెద్దచేటి—(ప్రవేశించి) నేడు తిమ్మనగారి పారిజాతాపహరణ కృతిసమర్పణమహోత్సవము. చిన్నమదేవిగారి వలవంత నేడుగదా తీరును. తిమ్మనగారు ఈవరకే తమ కావ్యభాగమును ఏలినవారికి వినిపించి వారి మనసు మెత్తబరచియున్నారు. చూతము గాక నేడేమి జరుగునో. అదుగో సభ కూడుచున్నది. నేనున్ను పోయి వేడుక చూచి అమ్మగారికి నివేదిస్తాను.

(అంత ఆసీనులై రాయలు, మంత్రులు, కవులు మొదలైనవారు ప్రవేశింతురు. తిమ్మనగారొక ప్రత్యేకమైన వేదికపై గూర్చుండి పారిజాతాపహరణములో ప్రథమాశ్వాసమందలి భాగములను చదువుదురు.)

రాయ—(తనలో) మహాకవి నాయంతఃపుర చరిత్రమే కావ్యమొనరించినాడు. మేము చేసినది సరి కాదని మాకు నీతియుపదేశించుచున్నాడు. మేము చేసినది సరికాదు. (ప్రకాశము) అప్పాజీ, ఈమహాకవులకు వారు కోరునట్టి అగ్రహారములను ఈవలసినది. పంచమహావాద్యములును, చామరాందోళికాదిసామంత చిహ్నములను మేము ఇచ్చినారము. తత్క్షణమే అల్లసాని పెద్దనగారికి, నందితిమ్మయగారికి పల్లకిలో ఊరేగింపు చేయవలసినది.

(నేపథ్యమునుండి—'మహాప్రభో, పల్లకి వచ్చియున్నది')

రాయ—కవులారా, రండు.

(అందరు నిష్క్రాంతి.)

౧౦. స్థలము. చిన్నమదేవినగరు.

ముసలిదాసి—అబ్బ! నేడుగదా సుదినము. ఎన్నాళ్లకు మా దేవిగారికి మరల సంతోషము కలిగినది. తెనాలిరామలింగయ్య పెట్టిన కలహము ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకులచే తీరి మరల ఏలినవారు చిన్నాదేవిగారిని అనుగ్రహించినారు. తిరుమలమ్మగారికి మునుపు వజ్రపుజడబిళ్ల యిస్తే ఇప్పుడు దిగ్విజయమైనతర్వాత గోలకొండగనులనే మానగరికి ఏలినవారు తెచ్చారు. తిమ్మనగారికి ఆందోళికాఛత్రచామరాదిసన్మానములు. ఎంతసంతోషము. అదుగో ఏలినవారు, చిన్నాదేవిగారు ఇక్కడికే వస్తున్నారు. దేవిగారిని సర్వాభరణాలతోను అలంకరించి ఏలినవారు పిలుచుకొనివస్తున్నారు.

(అంత రాయలు, చిన్నమదేవి ప్రవేశింతురు.)

చిన్న—ఆవిధంగా ఏలినవారు కోపంతో వెళ్లిపోగానే నేను ప్రాణాలమీద ఆశ వదులుకొన్నాను.

రాయ—చెలీ, గతమునకు చింతిల్లకు. నీకు కావలసినదంతయు సిద్ధముగా రాగలదు. ఒక వజ్రపు

పై కోపగించితివిగదా, గోలకొండలోని గనులన్నిటిని తెచ్చి యిక్కడ పెట్టించితిని. నవరత్నములు నీనగరిలో రాసులుపోయించితినిగదా.

ముసలివాని—ఇప్పుడుగదా నాకుసంతోషము.

రాయ—ప్రియా, నీకింక నేమి కావలయును?

చిన్న—ఏలినవారి యనుగ్రహము కలిగిన తర్వాత ఇంకను నేమి కావలసియుండును? అంతయు చేకూరినట్లే. కాని నా కొక కోరిక యున్నది. ఏలినవారికి నామీద అనుగ్రహము కలుగగానే శ్రీతిరుపతి వేంకటేశ్వరులను దర్శించి మ్రొక్కులు, ముడుపులు చెల్లించుకొని ఏలినవారితో కలిసి భక్తకోటిలో మన శిలావిగ్రహములు చెక్కింపవలయునని. ఈ మ్రొక్కు చెల్లింపవలయునుగదా.

రాయ—తత్క్షణమే ప్రయాణసన్నాహము చేయించెదను.

చిన్న—ఒసేమా అక్కగారినికూడా పిలిచిరావే.

రాయ—ఎవరురా అక్కడ. తత్క్షణమే మా అప్పాజీగారిని, మంత్రులను, దండనాథులను సామంతులను, కవీశ్వరులను తోడ్కొనిరా. మేము వేంకటేశ్వరస్వామివారి దర్శనము చేసికొనబోవుచున్నాము.

(తిరుమలదేవి ప్రవేశించి రాయలప్రక్క నిలుచును. చిన్నాదేవి సంభావించును. మంత్రులు మొదలైనవారు ప్రవేశింతురు.)

రాయ—మేము దిగ్విజయయాత్ర ముగించిన సంతోషమున భగవంతుని దర్శనార్థము తిరుపతికి పోదలచినారము.

సభ్యులు—బళిబళి.

రాయలు—మేము కవికులు నాకవుల గోష్ఠిలో రచియించిన ఆముక్తమాల్యదాప్రబంధమును అచ్చట అంకితము గావించెదము.

సభ్యులు—మహాప్రసాదము. మహాప్రసాదము.

రాయ—మరి మనమెల్ల నిప్పుడే ప్రయాణము.

(అందరు నిష్క్రమింతురు.)

౧౧. స్థలము. తిరుమల భగవత్సన్నిధానము.

(రాయలు, దేవేరులు ఒక ప్రక్కను, మరియొక ప్రక్క మంత్రులు, దండనాథులు, సామంతులు, కవీశ్వరులును నిలిచి సేవించుచుందురు. పూజారి భగవత్ప్రసాదమొసగి అందరకును శఠకోపముంచును.

రాయలు ఆముక్తమాల్యదనుండి కొన్ని పద్యములు చదివి గ్రంథమును భగవత్పీఠమున నుంచును.)

రాయ—క. శ్రీక్షితినీళావర,దను
జోత్కరప్రాణహరణ దంష్ట్రికోత్కృత్తహిర
ణ్యాక్షక్షపాచర, కృపా
వీక్షాదృతబాహులేయ, వేంకటరాయా.

(శిలావిగ్రహముల స్థాపనకై రాయలు, దేవేరులు మాత్రము ప్రత్యేకముగా నిలుతురు.)

సభ్యులు—జయ కృష్ణదేవరాయమహారాయ, సర్వాంధ్రచక్రవర్తి జయ, సర్వాంధ్రరాష్ట్రప్రతిష్ఠాపక జయ.



# క ల పో త

శ్రీ నండూరి వెంకటసుబ్బారావు

ఏతపసు నే చేయవలెనో
యెంకితో
ఎటుల నే నేకమవగలనో!

శిశువుల్లో మా జంట
చిన్నె లున్నాయంట,
బాలలే మనకన్న
మేలులే యంటాది!

...ఏతపసు.

తన రూపె నామేన
తళుకుమన్నాదంట,
నిలపజాలని సిరులు
సీకె తగునంటాది!

...ఏతపసు.

నాకంట కననీదు
నాకంత మననీదు,
తను లేని కలయేని
కని నే మనగరాదు!

...ఏతపసు.

తలపోసి మాకళలు
కలబోయవలె నంట,
గారీశులకె బాగ
గరవభంగము కాగ!

...ఏతపసు

---

# నీవు నేదంతా బలమునిస్తుందా?






ప్రతి గృహిణి ఏ ఆహారపదార్థములు శక్తి నిచ్చునవో తెలిసికొనవలెను. డాల్డా పాకశాస్త్రమను పుస్తకము (ఇంగ్లీషులో అచ్చు వేయబడినది) 150 ఇండియన్ వివిధ తినుబండారములు తయారుచేయు పద్ధతులతో కూడినది. మిక్కిలిఉపయోగకరమైన విషయములు గలవు. 4 అణాల బిళ్లలు Dept. D110 P. O. Box 353, Bombay, పంపుడు.



ఔను — ఆహారము బలమునిచ్చును; గాని అన్ని ఆహార పదార్థములు ఒకే విధముగా పుష్టినివ్వవు. కొన్ని బాగా బలము నివ్వగలవు. కొన్ని చాల కొద్దిగా మాత్రమే యివ్వగలవని చెప్పాలి — ఈ కారణంచేతనే ఆరోగ్యంచెడటం సంభవిస్తుంది. సామాన్యముగా బాగా యిష్టమైన ఆహారములు యేమాత్రము బలము నివ్వలేకపోవుటచే వాటిమీద ఆధారపడే వారు పనిపాటలు చేయుటవలనగాని, ఆటలాడుటవలనగాని, అలసట చెందకుండా వుండలేక పోతున్నారు. ఐతే అన్ని ఆహారములు విటమిన్లతోనిండిన డాల్డాతోవండుటవలన మిక్కిలి బలము నివ్వగలవు. డాల్డా ప్రకృతిసిద్ధమైన ఆహారపదార్థములతో కూడినదై మంచి బలమును చేకూర్చి, బలమునివ్వలేని యితర ఆహారముల కొరతను తీర్చగలదు. దీనితో వండినయెడల అన్ని పదార్థములు ఎక్కువ బలము నివ్వగలవు.

**విటమిన్లతోనిండిన** **బలమునకు**

# హిందూ మహమదీయసమస్య



శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్య =

జాతులలో ఉండే విభేదాలతోను, వైషమ్యాలతోను, మతాభిమానాలతోను పురికొల్పబడిన హిందూ - మహమ్మదీయసమస్య ఇటీవలివరకు హిందూదేశ రాజకీయ వ్యవహారములందు అగ్రస్థానం అలంకరించలేదు. ఈరెండు మతాల విభేదాలూ నూతనంగా వచ్చినవే. వలసవచ్చిన బ్రిటిషువారివలె గాక మహమ్మదీయ పరిపాలకులు దేశాన్ని ఆక్రమించినా, హిందువులతో కలసిమెలసియుండటమేగాక మత వైరాలను లెక్కపెట్టక హిందూదేశం యావత్తును ఒకే రాజకీయ సమాఖ్యగా స్థాపించటానికై యత్నించారు. ఒకేభాష, ఒకేనాణెము, ఒకేప్రభుత్వము, ఒకేపతాకము — ఇవి జాతీయత్వంయొక్క విస్పష్టమయిన గుర్తులయితే ఆత్మీయ మతము, సాంప్రదాయాలు, ఆచారాలు, పూజాపురస్కారాలూ భేదమయినా పరదేశీయుల సహనభావంతోను, దేశీయుల సుహృద్భావంతోను తాత్కాలిక భిన్నాభిప్రాయాలు సమసిపోవడంచేత కలిగే సమగ్రమైన ఏకత్వం పొందగల్గినారు. ఆసంఘీభావము మానవచరిత్రయందు అద్వితీయమైంది; సర్వదా కొనియాడతగిందికూడాను. ఆరుశతాబ్దాలవరకూ దినదినాభివృద్ధి పొందుతూ వర్ధిల్లిన మహమ్మదీయుల పరిపాలన హైందవ సాంఘిక ఆర్థిక మత వ్యవహారాలయందు మార్పుల నేమీ చొరనీయక వారి వారి నాగరికతలను సమన్వయింపజేసి వృద్ధిపొనగూర్చింది. హిందువుల సహనసానుభూతిచేతను, మహమ్మదీయుల న్యాయప్రవృత్తిచేతను దేశమంతా సకలసంపదలతో నిలయమై అద్వితీయసీమగా ఉండగలిగింది. హిందూదేశంలో ఒక మహమ్మదీయ మతమే సహనాన్ని, శాంతిని వ్యాప్తిపొందవలెనను కోర్కెపొందక, అవిభాజ్య స్వతంత్ర హిందూదేశంలో హిందూమహమ్మదీయులను సమాన పౌరులుగా చేసింది. సామరస్యసిద్ధాంతాని కనుగుణ్యంగా ప్రభుత్వాన్ని ఏర్పరచుటకున్ను, హిందూమహమ్మదీయ విరుద్ధమత సంప్రదాయాల భేదాలను సమాధానపరచుటకున్ను, వీరుభయులూ సమిష్టిగా ఉండునట్లు చేయుటకున్ను ప్రప్రథమంలో నడుముకట్టిన హిందూదేశ సార్వభౌముడు అక్బరుచక్రవర్తి.

కాని యూరపియనుల ప్రవేశంతో సామరస్యం అంతరించింది. సంఘీభావానికి ముప్పు వాటిల్లింది. ప్రథమంలో మతగురువుగాను, తదుపరి వర్తకుడుగాను, ఆతరువాత సైనికుడుగాను, చివరకు సామ్రాజ్య రాజకీయవేత్తగానూ వచ్చిన బ్రిటిషు దేశీయుడు సామ్రాజ్యతత్వాన్ని ప్రవేశపెట్టి, భేదబీజాలు నాటుటతో మతభేదాలు పొడకట్టుట సంభవించింది. 1821 మే "ఏషియాటిక్ జర్నలు"నందలి వ్యాసంలోని "చీలదీసి పరిపాలించు" అనే విషసదృశ సిద్ధాంతం బ్రిటిషుభావాన్ని వ్యక్తపరుస్తుంది. ఆ "భేదించి పరిపాలించు" అనే సూత్రాన్నే అమలులో పెట్టుతూ (1) హిందూ మహమ్మదీయ సైన్యాలను వేరు వేరుగా ఏర్పరచుటకు నిశ్చయించారు. (2) 1815-1843 సం॥ల మధ్య ఇంగ్లీషు విద్యావిధాన వ్యాప్తివల్ల అంతవరకూ ప్రభుత్వభాషగా పరిగణింపబడిన పరిష్యనుభాషను 1837 సం॥న

* ఆంగ్లమూలమును క్లుప్తపరచి తెనిగించినది: శ్రీ వేమూరి విఠల్ బాబుగారు.

పరచి ఇంగ్లీషుప్రభుత్వాన్నే స్థిరపరుచుటకు సన్నాహాలు మొదలుపెట్టారు. బోధనకై కళాశాలలందున్నూ, తీర్పులను చెప్పటకై న్యాయస్థానములందున్నూ, వ్యవహార పరిష్కారాలకై కౌన్సిళ్లలోను — అంతటా ఇంగ్లీషే రాజభాష అయింది. వెను వెంటనే "పాశ్చాత్య విద్య నభ్యసించినవారికి ఉద్యోగాలు ముందుగా ఇవ్వబడు"నని లార్డు హార్డింజి ప్రకటించాడు. (3) సోమనాథాలయపు సింహద్వారాలను తిరిగి సంపాదించుటకు యత్నించిన బ్రిటిషువారు తొమ్మిది వంతుల మంది ప్రజల సుహృద్భావాన్ని సంపాదించారు. ఒకవంతు ప్రజల వైమనస్యానికి వారు లెక్కించలేదు. (4) సిపాయి తిరుగుబాటు వైఫల్యాన వచ్చు 'నూతన ప్రభుత్వము, నాణెము, పతాకమూ' ముస్లిములను బాధించినంత హిందువులను కలవర పెట్టలేదు. మహమ్మదీయుల పరిపాలననుండి బ్రిటిషుపరిపాలనకు హిందువులు లోనైరి. పై చెప్పిన విధంగా సామరస్యం భేదించబడి విభేదం అంకురించబడింది. సైన్యమూ, న్యాయస్థానాలనుండి మహమ్మదీయులు బహిష్కరించబడిరి. భూమిఅమరకపు పద్ధతులన్నీ మహమ్మదీయులకు వినాశహేతువులుగానే ఉన్నవి. ఇంగ్లీషు భాషను హిందువులే త్వరగా అభ్యసించారు. 1875 లో, అనగా అర్ధశతాబ్దమైన తిరువాత సర్ సయ్యదు అహమ్మద్ M. A. G. కళాశాలను ఆలీఘర్‌లో స్థాపించి మహమ్మదీయులను కాంగ్రెసులో చేరవద్దనీ, కాంగ్రెసుతోపాటు రాజకీయసమస్యలందు పాల్గొనవద్దనీ సలహా ఇచ్చాడు. 1893 వ సం.పు సంస్కారణలు కొంతమందినే కేంద్ర, రాష్ట్రీయ లెజిస్లేచర్లలోకి తీసుకొనుట మూలంగా హిందువులు కలహాలకు కాలుదువ్వినవారైనారు. 1893 సం.నకే కర్జను ప్రభువు పరిష్కారానికై ప్రయత్నిస్తున్న పండ్రెండు సమస్యలలో హిందూమహమ్మదీయ సమస్య ఒకటిగా ప్రబలింది. అందుకై హిందువులను వెనుకకు నెట్టుటకున్నూ, మహమ్మదీయులకు పైచేయి సమకూర్చుటకున్నూ ఆలోచనలు ప్రారంభమయినవి. అప్పటికే 1900 సం.లోనే మహమ్మదీయులు తమ పక్షాన్ని రాజకీయ విషయాలలో బలపరుచుకొనుటకై అఖిల భారత ముస్లింలీగు శంకుస్థాపన జరిగింది. దానితోపాటు వైషమ్యభూయిష్ఠమైన యుగం ప్రారంభించింది. ఒకవైపు బ్రిటిషువారు సామ్రాజ్యలతను పెంచుతూ, మరొకవైపు జాతీయ కాంగ్రెసు ఆ తీగెను త్రుంచి వేయుటకు సమాలోచన చేస్తూవుంటే, ముస్లింలీగు ఆ తీగెకు పందిరి వేయవలెనని భీష్మించుకొని కూర్చోడంలో వున్న సద్భావమేమి?

1906 అక్టోబరు 1 న మహమ్మదీయులు తమ జనసంఖ్యయొక్క నిష్పత్తిలోగాక, తమ ప్రాముఖ్యాన్ని బట్టీ, సామ్రాజ్యానికి చేసిన అమూల్యసేవను బట్టీ తమ నొక ప్రత్యేకమైన రాజకీయ సంఘంగా పరిగణించవలెనని ఆగాఖాన్ అధ్యక్షతను లార్డు మింటోకు సిమ్లాలో విన్నవించుకొన్నారు. మహమ్మదీయపక్షంయొక్క హక్కులు భంగం గావించబడెనని మింటోనుండీ సర్ శామ్యూలుహోరు, లార్డు జెట్లెండులవరకూ ఇదేపాట శ్రుతిమించి రాగాన పడింది. మింటో చరిత్రయందు మింటోసతి వ్రాసినట్లుగా అక్టోబరు 1 వ తేదీ బ్రిటిషువారికి "దిగ్విజయ దినము", "హిందూదేశచరిత్రలో ఒక పర్వదినమూ"గా గణించబడింది

1909 నాటి వేరు వేరు నియోజకవర్గాలు హిందూదేశపు జాతీయతత్వానికి ఒక పెద్ద గొడ్డలి పెట్టయింది. అప్పటినుండి హిందూ-మహమ్మదీయులు వైమనస్కులైరి. రాజకీయ పురోభివృద్ధి అంతరించింది.

1911 న ఈ రెండు సంఘాలనూ సమాధానపరచుటకై ఆగాఖాన్ ద్వారా ప్రయత్నాలు మొదలుపెట్టారు. అబులుకలాము అజాదు "హిలాలు" పత్రిక ద్వారాను, మౌలానా మహమ్మదాలీ "కామ్రేడ్" పత్రిక ద్వారాను ఈ వాతావరణ వైపరీత్యాన్ని మార్చుటానికి కొంత సహాయపడిరి. కాని 1912 బాల్కనుయుద్ధంవల్లనూ, టర్కీసామ్రాజ్య

విభజనవల్లనూ హిందూదేశపు ముస్లిములకూ, బ్రిటిషు వారికీ మధ్య వైమనస్యం సంప్రాప్తించింది.

1914-18 నాటి యుద్ధం వచ్చినప్పుడు మహమ్మదాలీ "కామ్రేడ్"లో బ్రిటనునుగురించి "ఈజిప్టు వదలండి" అనే వ్యాసం వ్రాశాడు. తరువాత 1919 డిసెంబరువరకూ అతని సోదరుడైన మౌలానా షౌకతాలీ, మౌలానా హజరత్ మోహానీలు బందీఖానాలోనే ఉండిరి. ఇది అట్లుండగా, నవంబరులో కాంగ్రెసు, లీగులు కలకత్తాలో సమావేశమయి, హిందూ — మహమ్మదీయ సామరస్యానికి కొన్ని సిద్ధాంతాలు "హిందూ ముస్లిం కన్కార్డు" అనే పేరుతో వ్రాయబడెను. అవి లక్నో కాంగ్రెసులో సమ్మతింపబడిన తరువాత "మాంటెగ్‌ఫర్డు రిఫారమ్సు"లో చేర్చబడెను. 1932 లో బ్రిటిషు ప్రధానిచే ఒప్పుకొనబడిన నిర్ణయాలు 1937 ఫిబ్రవరివరకూ అమలులోనే వున్నవి. ఈవిధంగా ప్రత్యేక నియోజకవర్గాలు స్థిరపడి, మహమ్మదీయులను బలవత్తరము చేయడమయింది. ముఖ్యమైన మైనారటీలకు ఎన్నికలలో కొన్ని సంరక్షణలు సమకూర్చబడినట్లుగూడ "కన్కార్డు" లో వ్రాయబడెను. ప్రత్యేక నియోజకవర్గాల ద్వారా మహమ్మదీయులు ఈక్రిందిపద్ధతి ననుసరించి రాష్ట్రీయ శాసనసభ ఎన్నికలు జరుపవలెనని వక్కాణించిరి:—

| రాష్ట్రం పేరు. | ఎన్నుకోబడవలసిన వారి సంఖ్య. |
|---|---|
| పంజాబు | 50% |
| సంయుక్తరాష్ట్రాలు | 30% |
| బెంగాలు | 40% |
| బీహారు | 25% |
| మధ్యరాష్ట్రాలు | 15% |
| మద్రాసు | 15% |
| బొంబాయి | 33 1/3% |

1919 లో ఖిలాఫత్తు వృత్తాంతం ముగిసినప్పటి నుంచీ ముస్లింలీగు, కాంగ్రెసులవారు దానిని మరల నెలకొల్పడంలో నిమగ్నులైరి. ఉత్తర, పశ్చిమ, తూర్పు, మధ్యహిందూదేశంలో కొట్లాటలూ, హత్యలూ జరుగుచున్నను మొత్తంమీద హిందూ - మహమ్మదీయ పోరాటానికి సంబంధించినంతవరకూ రాజకీయ వాతావరణంలో శాంతి నిండియుండెను. 1925 లో లార్డు బర్కెన్‌హెడ్ దేశీయులను రాజ్యాంగ నిర్మాణానికై ప్రబోధము గావింపవలసిందిగా ఒక సవాలుచేసెను. అప్పటికే చాలా రాజ్యాంగ నిర్మాణ ప్రణాళికలు అమలునందు ఉండెను. శ్రీ దేశబంధు దాసు, సర్ లాలా భగవన్‌దాసులు కలసి ఒకటీ, సర్ రామస్వామయ్యరు, శ్రీ శ్రీనివాసయ్యంగార్లు వేరు వేరు ప్రణాళికలనూ సమకూర్చిరి. నిజాని బర్కెన్‌హెడ్ సవాలుకు సమాధానం ఇచ్చ గలిగింది మోతీలాలునెహ్రూ ప్రణాళిక ఒక్కటే. ఇది అఖిలభారత కాంగ్రెసు కమిటీవారివల్ల దీర్ఘాలోచనలతో కూర్చబడింది. కాని ఇది జిన్నాకు నచ్చలేదు. చివరకు "ఆల్ పార్టీస్ కాన్ఫరన్సు" యొక్క ఆశలన్నీ కూలిపోయాయి. అప్పటినుండీ ఇప్పటివరకూ జిన్నా తన "లేదు కాదు" అనే చిలుకపలుకులతోనే ముస్లింలీగు అధ్యక్షతను వహిస్తున్నాడు. అప్పటికే 14 సూత్రాలను వ్రాశాడు. ఇంకా, విల్సను అధ్యక్షుని గూడ తలతన్నుదామనేమో, ఆ సూత్రాల సంఖ్యను 17 చేశాడు!

తరుపరి గాంధీజీ రెండవ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సుకు బయలుదేరేటప్పటికే కాంగ్రెసు వర్కింగు కమిటీ "కమ్యూనల్ ఫార్ములా"ను తయారుచేసింది. నూతన రాజ్యాంగ నిర్మాణ కార్యక్రమంలో నియోజకవర్గాలు తప్పనిసరి. అవి మత సంఘాలకూ, తమ తమ భాషలు, సంప్రదాయాలు, విద్య, ఉద్యోగ సద్యోగాలు, మత అనుష్ఠానాలు — ఇంకా తదితరములైన వాటికీ ముప్పువాటిల్లకుండా ఒక కన్నుతో చూస్తూ వుండాలిసి వస్తుందనికూడా ధ్రువపరిచారు. 1931 సం.లో డిసెంబరు 8 వ తేదీన మహాత్ముడు లండను నుండి వచ్చిన తర్వాత కూడా ఈ అభి

ప్రాయాన్నే హెచ్చరించాడు. 1934, 35, 36 లలో బాబూ రాజేంద్రప్రసాదు కాంగ్రెసుఅధ్యక్షుడుగా వున్నప్పుడు జిన్నాకూ, ఆయనకూ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగెను. నాలుగు వారాల సంభాషణల తర్వాత కాంగ్రెసు అభిప్రాయంతో ఏకీభవించినప్పటికీ, అభిప్రాయ భేదం మూలంగా తమ సంభాషణలు విఫలమైన వనటంలో అర్థమేమిటి? హిందూమహాసభ కాంగ్రెసులో ఒక భాగం కాదు గదా! అటువంటప్పుడు హిందూమహాసభ అంగీకరించకపోతేనూ, మదనమోహన మాలవ్యా సమ్మతించనకపోతేనూ కాంగ్రెసేనా బాధ్యత వహించాలిసింది? ఎంత అవివేకం!

జవహర్‌లాలు లక్నోలోను, ఫైజుపూరులోను కాంగ్రెసుఅధ్యక్షుడుగా ఉన్న సమయంలో ఏప్రెలు 1938 వరకు, అనగా హరిపుర కాంగ్రెసు వరకూ జిన్నాతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపాడు. అందులో కాంగ్రెసువారు ఇతరుల సహాయంతోపాటు పనిచేయ సంసిద్ధులే అనీ, ఎవరైనా వీరితో కలియకోరినచో అటువంటివారిని సదా హృదయ పూర్వకంగా ఆహ్వానింతుగనీ, సామ్రాజ్యవాద వ్యతిరేకంగా ఉండుటకు ఒప్పుకొని ప్రజోపకారానికి చేయూత నొసగగలుగునని అనినచో ముస్లింలీగుతో ఐక్యముగా ఉండుటకు కూడా తమరు వాంఛిస్తున్నామనీ నొక్కి చెప్పినాడు. మత విషయాలలోను, సంస్కృతి విషయాలలోను, తదితరమైన [illegible]ను జోక్యం ఎప్పటికీ ఎవరూ కలుగచేసుకొనరనీ, మైనారిటీ తమ స్వకీయ విషయాలలో మెజారిటీ చెప్పిన రీతిగా నడవ నవసరము లేదనీ, తమకు అనుకూలమైన న్యాయచట్టాలకు బద్ధులై వుండవచ్చునీ "ప్రాతిపదికపు హక్కులు"లో చెప్ప బడింది. 1938 వ సం. సందు "ఎలెక్షను మానిఫెస్టో"లో మత వ్యవహారముల పరిష్కారానికై నిశ్చయించబడిన వారి "కమ్యూనలు అవార్డు" జాతీయైక్యతకు విరోధకారి అనీ, భారత స్వాతంత్ర్యానికినిరహంకారనీ కాంగ్రెసు తీర్మానించింది.

రాజకీయంగా ప్రస్తుతం ఊహించబడిన ప్రత్యేకనియోజకవర్గములకు తాము వ్యతిరేకులనీ, భారతదేశస్వాతంత్ర్యసంపాదనే మిక్కిలి ముఖ్యమైన కర్తవ్య మనీ, సాంఘికంగాను, ఆర్థికంగాను తాము దారిద్ర్యమునూ, నిరుద్యోగసమస్యనూ ఎగురొక్కొంచుమనీ, వీలైనంతవరకు సర్వజనులకు విద్యను, వైద్యసహాయమును, ఆరోగ్యసదుపాయములను ఇచ్చుచూ, వారి జీవితప్రమాణములను హెచ్చించుచు న్నట్లుగా కష్టపడుదుమనీ నెహ్రూ ఒకమారు ఆ సం.లోనే చెప్పాడు. ఈ రాజకీయ, సాంఘిక, ఆర్థికవ్యవస్థలను ముఖాముఖీ ఢీకొని నివారించవలసినప్పుడు వారు సామ్రాజ్యవాదానికి ప్రతికూలురు, పరదేశపువారికి వైమనస్యులు; అటువంటివారిని తరిమివేయుటకే కాంగ్రెసువారు పూనుకున్నారనికూడ ఆయన చెప్పాడు.

వివాదములకు వచ్చు విషయాల నన్నింటినీ ఒకచోట కేంద్రీకరించి, 14 గా విభజించి, ఒక్కొక్కదానికి ఏప్రిలు 6, 1938 న నెహ్రూ జిన్నాకు జవాబిచ్చాడు. కాంగ్రెసు నిజంగా కరాచీతీర్మానంలో "ప్రాతిపదికహక్కులను" జాతీయప్రభుత్వనిర్మాణంలో ఉపయోగించదగిన వనికూడా చెప్పారు.

ఇంక ముస్లిములీగు జూను 5, 1938 న సమావేశమై మూడు ముఖ్యతీర్మానాలను చేసింది.

(1) ముస్లిములీగొకటే హిందూదేశమందుండు మహమ్మదీయులకొరకై నిలబడి మాటలాడగల సంస్థ. వారి యందరి అధికారమును బడసినదికూడా ఇది ఒక్కటే.

(2) కాంగ్రెసుచే ఏర్పరుపబడిన కమిటీలలో ముస్లిములుండుట శ్రేయస్కరమైనది కాదు. ఎందుకనగా, వారు హిందూ-మహమ్మదీయసామరస్యానికై పాటుపడునప్పుడు అటు హిందువులయొక్కయు,

ఇటు ముస్లిములయొక్కయు సాహభూతిని సంపాదింప లేక ఉభయభ్రష్టులగుదురు.

(3) కాంగ్రెసువారు బహిరంగంగాగాని, అంతరంగికంగాగాని ఏనాడు ముస్లింప్రజల అధికారాన్ని బడసిన సంస్థగా గుర్తించవలెనని ఎవరికి తెలుపుట లేదు.

హిందూ - మహమ్మదీయసఖ్యతకై పాటుబడు నప్పుడు నీవు ఈసూత్రముల ననుసరించినచో సంభాషణలందు పాల్గొననని గూడ నొక్కి చెప్పెను.

కొన్ని దినములతర్వాత-రెండవ ఐరోపాయుద్ధం పిమ్మట మరోఘట్టము ఆరంభమయ్యెను. ఈ యుద్ధము ప్రారంభమయినతోడనే మంత్రిపదవులను నిరాకరించి కాంగ్రెసువారు బయటకువచ్చుటతో పాటు ముస్లిములు తమపై కాంగ్రెసుమంత్రులు సంకుచితదృష్టితో మెలిగిరని అపోహలు కల్పించే విపరీతపు ప్రకటనలు మొదలుపెట్టారు.

1940 వ సం.న లాహోరులో జరిపిన తీర్మానాల్లో "పాకిస్థాన్"నుగురించి తెలుసుకోవడమైనది. జూలై నెలలో ముస్లిములతరఫున మూడు తీర్మానాలను వెల్లడిచేసిరి.

(1) భారతదేశపు విభజనను (అనగా తాము లాహోరులో తీర్మానించినరీతిగా) ఖండిస్తూగాని, మహమ్మదీయుల ముఖ్యమైన మూలఆశయములకు వ్యతిరేకంగాగాని ప్రభుత్వంవారు ఎన్నడూ ప్రకటనలు గావింపరాదు.

(2) భారతదేశముస్లిముల అంగీకారం లేకుండా తాత్కాలిక ప్రభుత్వనిర్మాణకార్యక్రమములోగాని, ఇతరముగాగాని ఏనిశ్చయాలనూ తమ సమ్మతిలేనిదే జరపజాలరని ప్రభుత్వంవారు హామీ ఇవ్వవలెను.

(3) కేంద్రములలోను, రాష్ట్రాలలోను ప్రభుత్వంవారు తమను సమానభాగస్వాములుగా ఎంచుటకు సదా సంసిద్ధులుగాఉండుటేగాక సహాయపడ వలసిన బాధ్యతగ తమమీదనే వున్నదని గ్రహించవలసియున్నది.

మన్నదానికి ... ం ... సైప్రాయికార్యనిర్వహసభ్యులలో హిందువుల సంఖ్యతో పాటు అంతేసంఖ్య గల మహమ్మదీయులుగూడ సభ్యులుగా చేసిచో కాంగ్రెసుసంస్థ ... ఒప్పినట్లయితే వారికి మెజారిటీ ఎక్కువగుననీ తెలిపెను.

నీగుఅధ్యక్షునికి ... ప్రాయికి మధ్య అంగీకారార్థ మేమీ కుదరలేదు. ఎందుకనగా అమెరీ 1940 సం. నవంబరులో ఈక్రిందవిధంగా చెప్పెను:—

"ముస్లింలీగువిషయంలో రాయబారాలు ఎందుకు భంగమైనవంటే వైస్రాయి ఇచ్చిన స్థానాలకంటె వారు ఎక్కువకోరిరి. ఇంకా కాంగ్రెసువారి తలంపు ప్రద్దుకొని హామీలతో, షరతులతో, లీగుసమ్మతితో కౌన్సిలులో చేరవలయునను మాట చాలా అసందర్భముగా ఉన్నది."

పూనాతీర్మానం (జూలై 1940)లో కాంగ్రెసువారు దేశస్వాతంత్ర్యానికై నిక్కదీసి అడిగినట్లు వున్నది. జాతీయప్రభుత్వం తాత్కాలికమైనప్పటికీ, ఎన్నుకోబడిన అందరుసభ్యుల విశ్వాసమునకై పాటుపడుటయేగాక, రాష్ట్రప్రభుత్వాల సహాయంతో పాటు జాతీయప్రభుత్వనిర్మాణం గావింపవలసి వున్నదనిగూడ తెలిబుచ్చిరి. అందులోని పదజాలమునుబట్టి విశదమగునదేమనగా, ముస్లింలీగుగూడా కేంద్రప్రభుత్వంలో ఒక భాగమేగదా, హిందూమహాసభ, సిక్కులు మొదలైనవారితోపాటు వీరూ సమానులేగదా! అందరు సభ్యుల సాయంతోపాటు ప్రభుత్వాన్ని నడపవచ్చునంటే, ముస్లింలీగు వారిని మరచిపోయినట్లు అవుతుందా ?

ఇదేకాలంలో 29-వ ఏప్రిల్ 1940 సం.న స్వతంత్రముస్లింలు అల్లాబక్షుఅధ్యక్షత క్రింద ఈతీర్మానాలను అంగీకరించారు. "భారతదేశాన్ని హిందూ

స్థాన్ గాను, పాకీస్థాన్ గాను విభజించు ఏపద్ధతైనను అసాధ్యము, దేశక్షేమమునకు భంగమేగాక, ముఖ్యముగా ముస్లిములకు చాలా హానికరమైనది. అంతేగాక ముస్లింలీగు మహమ్మదీయులందరిపక్షానా మాట్లాడలేదు." ఈవిధంగా తమ కుండు శంకను వీరు వెల్లడి చేసిరి.

పాకీస్థానుసమస్య రాకముందు 1935 సం. ప్రభుత్వచట్టమును తీసివేసి దేశమును కొన్ని స్వతంత్ర రాష్ట్రాలుగా ఏర్పరచమని లీగుచే నియమించబడిన ఒక ఉపసంఘం తీర్మానించింది. ఈతీర్మానం వెల్లడి చేసిన దేమంటే, రెండు సంస్థలకూ వేరువేరు భాగాలు ఇస్తే తరువాత వీరిరువురూ కలసిమెలసి తమతమ ప్రదేశాల్లో సురక్షితంగా ఉండవచ్చుననీ, ఈరీతిగా ఐకమత్యం పొందవచ్చుననీగూడా చెప్పిరి. వాయవ్య, ఆగ్నేయభాగములును, ఢిల్లీనుండి లక్నోవరకును,దక్కనుముక్కలు-ఈ నాలుగూ మహమ్మదీయుల పరంచేసి, మిగతా దేశాన్ని హిందువుల కిస్తే బాగుండునని, తమకు సమ్మతమేనను అభిప్రాయము తీర్మానంద్వారా ప్రకటించిరి. "మైనారిటీలహక్కులను మెజారిటీ గుర్తించకతప్పదు. ముస్లిములకు 5 రాష్ట్రాలలో మెజారిటీ కలదు. వారినా ప్రదేశాలలో మైనారిటీగా లెక్కవేయడానికి వీల్లేదు"అని జిన్నా కరాచిలో ప్రసంగించెను.

1941 సం. ఆగస్టు 24 న బెంగాలు, పంజాబు, అస్సాంప్రధానమంత్రులు జాతీయరక్షక సంఘంలో, మాజీప్రధానమంత్రులుగాబట్టి, సభ్యులుగా చేరుటకు సమ్మతించిరి. అందుకే అమెరీ 27-వ తేదీన సగర్వంతో "దేశమంగు వైపరీత్యము లున్నా, పార్టీలున్నా భారత దేశీయులు జాతీయరక్షకసంఘంలో చేరడం చాలా గొప్ప. అది గర్వించదగిన"దని అన్నాడు. ఇంతటిలో రష్యా-జర్మనీయుద్ధం జూను 22 న ప్రారంభమైంది. అప్పుడే టర్కీ-బ్రిటనులమధ్య మనస్పర్ధ లేర్పడినవి. ఇరాను, ఆఫ్ఘనిస్తానులు వైమనస్కులైనారు.

1941 సం.లో సప్రూ ఒక వ్యాసం "ట్వంటియత్ సెంచరీ"లో వ్రాస్తూ "గృహకల్లోలాల నన్నింటినీ తామే చక్కబెట్టుకోవాలి. ఏలువారు తమ కేదో ఒరగపెడతా రన్నమాట కల్ల "అన్నారు. కాని తరువాత మద్రాసులో జరిగిన ముస్లింలీగుసభలో తీర్మానించిన దేమంటే, మహమ్మదీయుల వశమగు 4 రాష్ట్రాలలోను రక్షణ, ఆర్థిక, విదేశవ్యవహారములందున్న, ఆచారములందున్న, రాకపోకల విషయములందున్న , తదితరములైన వాటియందున్న తామే సర్వతంత్ర స్వతంత్రులుగా వుండవలసినదని వక్కాణించడమైనది. లీగు అధ్యక్షుని అంగీకారం పొందక వాని పార్టీలో నుంచే కొందరిని ప్రభుత్వంలోనికి తీసుకొనుట హానికరమనీ, పార్టీసూత్రాలకు ప్రతికూలమనీ జిన్నా అలజడి సాగించడం మొదలుపెట్టెను. ఎల్లాగయితేనేమి, చివరకు చతారీనవాబు, సాదుల్లాప్రధాని, సర్ శికిందరు, ఫజుల్ హక్కు రాజీనామా ఇచ్చిరి. ఈ రాజీనామాలన్నీ జిన్నాను మరింత చేశాయి.

కాంగ్రెసు ఎన్నడూ హింసతోకూడిన యుద్ధాలకు చేయూత ఇవ్వదు అని గాంధీ ఒక వైపు ప్రబోధిస్తూవుంటే, మరోవైపు హిందూమహాసభవారు మహమ్మదీయులమీద ద్వేషబుద్ధితో ప్రవర్తిస్తూవుంటే జిన్నా పాకీస్థాన్ వ్యామోహం దినదినాభివృద్ధిఅవుతున్నది.

ఆకాలమందే యూరుజంగుబహదూరు మతవైషమ్యాలమీద ఆధారపడిన 'మహమ్మదీయరాజ్య'మనే సిద్ధాంతాన్ని ప్రచారిస్తున్నాడు. ఈ ఉద్బోధమూలంగా నైజామురాష్ట్రాలలో కలవరం మొదలు పెట్టింది. నవాబు దీనితో కంపితుడైనాడు. తన ప్రభుత్వంలో పనిచేస్తూన్న "ఫర్మానులు " రాజకీయాల్లో పాల్గొనరాదని ప్రకటించాడు. క్కాని యూరుజంగు తన సూత్రానికి ఇంకా స్వస్తిచెప్పలేదు. చివరకు "ఫర్మానుము బారకు" ఆయనమీద జారీచేస్తే అప్పుడు తలతిరిగి క్షమాపణ కోరాడు. దేశంలో

వున్న విభిన్నజాతులమధ్య వైషమ్యము లేనందుకు సంత్ భావంతోను, ఐకమత్యంతోను మెలగవలసిందిగా ప్రబోధించాడు.

అటుతరువాత మార్చి 1942 లో సర్ స్టాఫర్డు క్రిప్సు ఇండియాకువచ్చి పాకిస్థాన్ నంగీకరించటం మొదలు పెట్టాడు. దీనితోపాటు "ఇండియన్ యూని యన్"నుంచి ప్రతిరాష్ట్రమూ విడిపోవడానికి సయితం హక్కు వుంటుందనికూడా చాటించాడు. ఇది మహమ్మదీయులకు సంతోషాన్ని కలిగించలేదు. కాంగ్రెసువారికీ నచ్చలేదు. లీగుకు క్రిప్సుప్రతిపాదన లందు విభజనసూత్ర మేమీ అమరినట్లు కనపడలేదు. 1942 ఏప్రిల్ లో అఖిలభారతకాంగ్రెసుకమిటీ అలహా బాదులో సమావేశమైంది. శ్రీ రాజగోపాలాచారి కాంగ్రెసు-లీగుఐక్యతకు ఉద్బోధిస్తున్న సూత్రాలను త్రోసివేశారు. వీటికి సరిగ్గా ప్రతికూలంగా వున్న ఇంకోసూత్రం జగత్ నారాయణలాలు ఆధ్వర్యాన్న సమ్మతించారు. దేశాన్ని ముక్కలుముక్కలుగా విభ జించడానికి ఎప్పుడూ ప్రతికూలురే అనికూడా గట్టిగా చెప్పారు. కొన్నినెలలతరువాత "హిందూదేశం విడిచిపొండి"అనే మాటలే దేశమంతటా వ్యాపించి నాయి. ఆగస్టు 8-వ తేదీన ఒకతీర్మానాన్ని బొంబా యిలో ప్యాసుచేశారు. బ్రిటిషువారు హిందూ దేశాన్ని విడిచిపెట్టి తమ అధికారానికి స్వస్తిచెప్పి వెళ్లిపోవాలనీ, అట్లా చేసినయెడల యుద్ధంలో భారతదేశం పాల్గొనగల్గుతుందనీ, తమ దేశమునకేగాక యావత్ప్రపంచ శాంతి స్థాపించుటకై యత్నిస్తుం దనికూడ తెలిపారు. కాంగ్రెసువర్కింగుకమిటీసభ్యు లందరూ షుమారు 3 సం.లు కారాగారమందు బంధింపబడిరి. ఆ సమయమందే గాంధీమహా త్ముడు 21 దినములు, అనగా 10 ఫిబ్రవరి మొదలు 3 మార్చివరకు ఉపవాసంచేసెను. ఆ తరువాత జిన్నాను తనవద్దకు రమ్మని ఆహ్వానించెను. కాని ఆగస్టుతీర్మానాన్ని రద్దుచేస్తేనేగాని కాంగ్రెసూ, లీగూ కలవడానికి వీల్లేదన్నాడు. "వైస్రాయికి

ఎందుకు వ్రా ...ప్రు, నాకు వ్రాయి"అని ఏప్రిల్ లో అన్న జిన్నాయే ఆరోజున తానే వైస్రాయిస్థానాన్ని అలంకరించాలని శ్రమపడ్డాడు. ఆగస్టుతీర్మానాన్ని చేసివేయమన్నాడు. ఆతీర్మానాన్నే గనుక రద్దుచేయ గల్గినప్పుడు ఆయనవద్దకు రానవసరంలేదని అతనికి తెలి యదు పాపం! గాంధీజీ అనారోగ్యకారణాలమీద మే 6-వ తేదీన కారాగారవిముక్తు డైనాడు. 42 సం. డిసెంబరులో హిందూమహాసభచే నియమింపబడిన కమిటీవారిచే తయారుచేయబడిన అభిప్రాయాలను కొన్ని సవరణలతో రాజగోపాలాచారి గాంధీజీకి చూపించి వారి సదభిప్రాయాన్ని పొందాడు.

జిన్నా-గాంధీసమావేశం సెప్టెంబరు 1944 లో జరిగింది. పదిరోజుల దీర్ఘసంభాషణల ఫలితం ఆశా భంగమే అయింది. జిన్నా ఇదివరకువలెనే "తాను పట్టిన కుందేలుకు మూడేకాళ్ల"ని పాటపాడటం లోకవిదితమే. ఈ రెండు పార్టీలకూ సమ్మతమైన ఒక ఒడంబడిక కుదర్చడానికి ఒప్పుకోలేదు.

1944 ఆగస్టు 15-వ తేదీన లార్డు వేవెలు "కాం గ్రెసు-లీగులకు ఒడంబడిక కుదిరినా లాభంలేదు. మిగతాపార్టీలు చాలా వున్నవి. అన్నింటి సమ్మతమూ పొందవలసివుంటుం"దని ఒక పాటపాడెను. లియా కత్-దేశాయిఒడంబడిక 11-వ జనవరిన వ్రాయబడింది. ఎగ్జిక్యూటివుకౌన్సిలందు వుండే సభ్యులలో కాంగ్రెసు లీగులకు సరిసమానప్రాతినిధ్యం ఉండాలి. అటుతరు వాత జాతీయకౌన్సిలు ఏర్పడగానే దాని మొదటి కర్తవ్యం కాంగ్రెసు వర్కింగుకమిటీమెంబర్లను విడు దలచేయుట అని ఉన్నది.

తరువాత వేవెలుప్రభువు మార్చి 23న ఇంగ్లండు వెళ్లి తిరిగివచ్చినతరువాత జూన్ 14-వ తేదీన రేడి యోలో ప్రసంగిస్తూ కాంగ్రెసు వర్కింగ్ కమిటీ మెంబర్ల విడుదలగురించి చెప్పాడు. ఇంక సిమ్లాలో ఒక కాన్ఫరెన్సు తాను జరుపుతాననికూడ ప్రసంగిం చాడు. ఎగ్జిక్యూటివుకౌన్సిలులోని స్థానముల నలంక రించడానికై పార్టీల నాయకులందరూ తమతమ జాబి

తాలను ఇమ్మని నైస్రాయి కోరాడు. అందరూ అంగీకరించినా, జిన్నామాత్రం తన పార్టీజాబితాను ఇవ్వడానికి ఒప్పుకోలేదు. వైస్రాయిచేత తయారుకాబడిన జాబితానుకూడా అంగీకరించలేదు. సరే! సిమ్లాసభ ముగిసింది.

దీనితోపాటు బ్రిటన్‌లో చర్చిల్ ప్రభుత్వం ఓడిపోయింది. ఎలెక్షన్లలో అట్లీ ఎన్నుకొనబడి బ్రిటిష్‌ప్రధాని అయినాడు. పెతిక్ లారెన్సు 'సెక్రటరీ ఆఫ్ స్టేటు' అయినాడు. భారతదేశంలోకూడా కొంత సంతసం కనపడుతోంది. ఇదివరకునుంచి భారతదేశస్వాతంత్ర్యానికై బ్రిటనులో ఆలజడులు విపరీతంగా చేసిన కార్మికపక్షువాదులు ఇప్పుడు ప్రభుత్వస్థానాలను అలంకరించి భారతదేశస్వాతంత్ర్య హక్కునుగూర్చి మరవగలరా? కల్ల.



# ఆటంబాంబు-స్వరూప స్వభావాలు

= శ్రీ జయంతి ధర్మతేజ =

ండటి నెల ౬-వ తేదీన జపానులో గొప్ప రేవు పట్టణమైన హిరోషిమాపై మొట్టమొదటి ఎటామికుబాంబును అమెరికనులు వేశారని వార్తాపత్రికల్లో చదివాము. తిరిగి ౯-వ తేదీన నాగసాకి అను మరో రేవుపట్టణంపై రెండవ ఎటామికుబాంబు వేశారని తెలిసింది. ఆదినమే సోవియటురష్యా జపానుపై యుద్ధ ప్రకటన గావించింది. మరి ఎటామికుబాంబుల భీతి చేతనో, లేక రష్యనుల యుద్ధప్రకటనవల్లనో, మొత్తంగా ఈ రెండుకారణాలవల్లనో జపాను ౧౦-వ తేదీన మిత్రమండలికి లొంగిపోవడానికి సంసిద్ధత రేడియోమూలంగా తెలిపింది. జపాను శరణువేడడానికి ముఖ్యకారణం ఎటామికుబాంబు అనబడే ఈభయంకర విధ్వంసక ఆయుధమేనని చాలామంది అభిప్రాయపడుతున్నారు.

ఈ బాంబువల్ల కలిగిన విధ్వంసంగురించి కొంత తెలుసుకుందాం. హిరోషిమాలో ౪.౧ చదరపుమైళ్ల విస్తీర్ణం గల కట్టడాలు, పట్టణభాగం కనబడకుండా పోయాయి. బాంబు ప్రేలుడువల్ల కలిగిన మంటలపొగలూ, ఆవిరీ పట్టణంపైన ౮ మైళ్ల ఎత్తున ప్రాకేయి. పట్టణంలో నివసిస్తూన్న ౭౩౦౦౦ ప్రజ రూపుమాసిపోయారని చెప్పాలి. వీధుల్లో ఉన్న ప్రజ కాలి బొగ్గుఅయిపోయారనీ, ఇళ్లలో ఉన్నవారు ప్రేలుడువల్ల కలిగిన భరింపలేని వేడివల్లా, ఒత్తిడివల్లా విగతజీవులయ్యారనీ టోకియో రేడియో చెప్పింది. నాగసాకిలోకూడా ౩.౩ చదరపుమైళ్ల విస్తీర్ణం గల పట్టణభాగం లేకుండాపోయింది. పట్టణంలో ప్రజల పాటు హిరోషిమాలోవలెనే ఉందని తెలుస్తూవుంది.

౧౬-వ తేదీన అమెరికాసంయుక్తరాష్ట్రాల్లో న్యూమెక్సికో ఎడారిలో మొట్టమొదటి ఎటామికుబాంబుప్రయోగం పరీక్షార్థం చేశారు. దాని ఫలితంగా ౭౫౦ మైళ్ల దూరంలో ఉన్న ఇళ్లు ఊగిసలాడాయని మిలిటరీఅధికారులు తెలిపారు. పరీక్షకని బాంబుప్రయోగస్థలంలో కట్టిన ఉక్కుకోట కరిగి ఆవిరిగా మారిపోయిందట. బాంబుప్రేలుడువల్ల కలిగిన కాంతి మిట్టమధ్యాహ్నపు సూర్యుని వెలుగును అనేకరెట్లు మించి భయంకరంగా ఉందట. ౬ మైళ్ల దూరంలో నుంచొనిచూస్తూఉన్న ఒకని కళ్లు ఆవెలుగుచూలాన గ్రుడ్డిఅయిపోయాయని తెలుస్తూఉంది.

ఈ భయంకరఆయుధనిర్మాణం సుమారు ౫౦ ఏండ్లకు పైగా శాస్త్రవేత్తలు జరుపుతూన్న కృషిఫలితం.

అతిప్రాచీనకాలంనుండి హైందవవిజ్ఞానులు పదార్థరూపంగా ఉన్న సకలప్రపంచమూ దృష్టికందని, అవినాశకరమైన, విభజింపబడవీలుగాని అణువులతో నిర్మింపబడిందని తెలిపారు. తరువాత ల్యూసిప్పసు మొదలైన గ్రీకులుకూడా ఈవిధంగానే ఆలోచించారు. గ్రీకులు ఈ అణువులను 'ఏటములు' (విభజింపబడనివి) అన్నారు.

౧౯-వ శతాబ్దంమొదట్లో డాల్టను అను ఆంగ్లవైజ్ఞాని ఈఏటముల స్వభావం సరిఅయిన మాటల్లో చెప్పి, భౌతిక, రసాయనశాస్త్రాల్లో మూలసూత్రంగా వెల్లడించాడు. ఒకసూదిమొనలో ౧౦ శతకోట్ల శతకోట్ల ఏటములున్నాయి. ఒక గ్రాము(అనగా తులములో సుమారు ౧౨-వ భాగము)ఎత్తు యురేనియము

అను లోహములో పైనచెప్పిన సంఖ్యకే న్యూట్రానులు రెట్టుగా ఏటము లున్నాయి.

ఏటములను విభజింపవచ్చునని ౧౮౯౧-వ సంవత్సరంలో థామ్సనుమహాశయుని పరిశోధనలవల్లనూ, తదుపరి శాస్త్రవేత్తల పరిశోధనలవల్లనూ తేలింది.

నేడు శాస్త్రజ్ఞులు ఏటమునిర్మాణాన్నిగురించి ఈక్రిందివిధంగా చెబుతారు. మధ్యగానున్న, అతి సూక్ష్మమైన న్యూక్లియసు (ప్రధానకేంద్రం) చుట్టూ 'ఎలక్ట్రాను'లను పరమసూక్ష్మమైన అణువులు సూర్యునిచుట్టూ నవగ్రహాలు తిరుగుతున్నట్టు ప్రదక్షిణంచేస్తూఉంటాయి. వెలుగువేగం సెకనుకు ౧౮౬,౦౦౦ మైళ్లు అయితే ఎలక్ట్రానుల వడి ఆవేగంలో ౯-వ వంతుకు అధికంగా(అంటే సెకనుకు ౧౮౦,౦౦౦ మైళ్లు) ఉంటుంది.

న్యూక్లియసులో ప్రధానంగా న్యూట్రానులు, ప్రోటానులు అనబడే పరమాణువులు అతిబిగువుగా దట్టింపబడిఉంటాయి. ఏటములో ప్రోటానులు, ఎలక్ట్రానుల సంఖ్య ఒకటే. ఏటములో ఉన్న ఎలక్ట్రానుల సంఖ్యపై ఆ ఏటములు ఉన్న వస్తుస్వభావం



'ఏటంబాంబు' సృష్టికర్తల్లో ఒకరు: డా॥ ఫెర్మీ

ఆధారపడిఉంటుంది. మూలద్రవ్యాలు ఇప్పటివరకూ సర్వప్రపంచంలో ౯౨ రకాలు. వాటిలో అతి తేలికైనది, ప్రథమద్రవ్యం, ఉదజని (Hydrogen). దీని న్యూక్లియసులో ఒకప్రోటాను, బయట ఒక ఎలక్ట్రాను ఉంటాయి. అన్ని ద్రవ్యాల్లో బరువైన ఏటము గలది 'యురేనియం' అను లోహము.

దీనిలో న్యూక్లియసులో ౧౪౬ న్యూట్రానులు, ౯౨ ప్రోటానులు, బయట ౯౨ ఎలక్ట్రానులు ఉంటాయి. ఏటములో ప్రోటానుల సంఖ్యను ఆ మూలద్రవ్యముయొక్క 'ఎటామికునెంబరు' అంటారు. అందుచేత ఉదజనిఎటామికునెంబరు ౧, యురేనియం ఎటామికునెంబరు ౯౨. ఎటామికునెంబరు ఎక్కువ అయినకొలదీ, అనగా ఏటములో న్యూక్లియసుబరువు ఎక్కువఅయినకొలదీ ఏటము స్తిమితముతగ్గి,ఉన్నట్టుగా ఉండి, అకస్మాత్తుగా బద్దలయిపోవడం జరుగుతుంది. ఈవైఖరిని 'రేడియోఏక్టివిటీ' అంటారు. ఈసంఘటనను 'బెకరెలు'మహాశయుడు ౧౮౯౧-వ సంవత్సరంలో కనిపెట్టాడు. రేడియము అను లోహము, యురేనియంకూడా రేడియోఏక్టివిటీ గల మూలద్రవ్యాలు. ఈస్వభావం గల మూలద్రవ్యాలు ౪౦ కి పైబడి ఉన్నాయి. ఈ ఉత్పాతము సంభవించినపుడు ఎక్సురే అను సునిశితమైన కిరణములు జనిస్తాయి. వీటి ద్వారానే క్షయరోగులకు ఎక్సురేఫోటోలు తీస్తారు. ఎక్సుకిరణములేకాకుండా ఆల్ఫారేణువులు, ఎలక్ట్రానులుకూడా రేడియోఏక్టివిటీద్వారా ఉద్భవిస్తాయి. ఆల్ఫారేణువు లనగా, హీలియము అను వాయువుఏటములలోని న్యూక్లియసు లన్నమాట. (గాలిలో వెయ్యోవంతు హీలియమువాయువే)

ఇదేకాక, ఒకే మూలద్రవ్యంలో రెండుమూడు రకాల ఎటామికున్యూక్లియసులు ఉంటాయి. అనగా ఆన్యూక్లియసులలో న్యూట్రానుల సంఖ్య వివిధంగా ఉంటుంది. ఉదాహరణకు: మామూలుఉదజని, బరువైన ఉదజని(డాయిటీరియము)అను రెండురకాలున్నాయి. రెండవదాని న్యూక్లియసులో ఒక న్యూ

ట్రాను, ప్రోటాను కలిసిన డాయిట్రాను అను రేణువు లుంటాయి. అందుచేత రెండురకాల ఉదజని …గా మికు నెంబరు ఒకటే. ఈవిధంగానే యురేనియం లోహంలో మూడురకాల న్యూక్లియసులు గల ఏటము లున్నాయి. మూడింటిలోనూ ప్రోటానుల సంఖ్య ౯౨ మాత్రమే. కాని న్యూట్రానుల సంఖ్య మూడింటి లోనూ వరుసగా ౧౪౨, ౧౪౩, ౧౪౬. అనగా మూడురకాల ఎటామిక్ బరువు గల ఏటములు యురేని యంలో ఉన్నా … ఈవిధంగా ఒకే ఎటామికు …౦బరు ఉండి, అంటే ప్రోటానుల సంఖ్య సమంగా ఉండి ఎటామికుబరువు వేరుగా ఉన్న ఏటములను 'ఐసోటోపు' లని శాస్త్రజ్ఞులు అంటారు. యురేనియం మూడురకాల ఐసోటోపులు కలిగిఉంది … మూల ద్రవ్యాలూ వివిధ ఐసోటోపుల రూపంలో ఉ… యని చెప్పవచ్చు.

ఏటము లన్న అణువులు మహాశక్తిపూరితాలని తెలుసుకోవడానికి రెండుకీ … కాల్రక్రమేణా గొ… కాయి. మొదటిది—రేడియము మొదలైన రేడియో ఏక్టివు ద్రవ్యాలు వందలాది ఏళ్లకొలదీ ఈఉత్పాతాన్ని వెల్లడిస్తాయి. దీనివల్ల జనింపబడ్డ శక్తి చాలా ఎక్కువ. ఉదాహరణకు, తులంరేడియం తీసుకుంటే, దానివల్ల జనించే శక్తివల్ల తులంబరువున్న జలాన్ని ౧౦౦౦ ఏళ్లకు పైబడి ఏకవరుసగా ఉడికించవచ్చు. రెండ వది—సూర్యునివంటి నక్షత్రగోళాలు ఎన్నోకోట్ల ఏళ్లనుండి ఇదేమాదిరిగా వెలుగూ, వేడీ ఇస్తూఉన్న అగ్నిగుండాలుగా ఉన్నాయి. ఇంత వేడి జనించ టానికి కావలసిన శక్తి సూర్యునిలో ఎలాగ వచ్చింది అని శాస్త్రజ్ఞులు ప్రశ్నించుకున్నారు. దీనికి జవాబు ఒక తత్వరూపంగా 'అయిన్‌స్టీను' మహా శయుడు తన ఆపేక్షకతత్వము (Theory of Relativity) అను సూత్రంలో ౧౯౦౫ సంవత్సరంలో వెల్లడించాడు. ఆశాస్త్రవేత్త సకలపదార్థమూ ఒకవిధ మైన శక్తి(energy) రూపమేనని చెప్పాడు

౧౦ × ౯ = ౯౦ అన్నట్టుగా శక్తి = పదార్థపరి మాణం × వెలుగువేగం × వెలుగువేగం, అనగా పదార్థ పరిమాణాన్ని ౩౪… …౦ అను సంఖ్యతో గుణిస్తే దానికి సమమైన శక్తిపరిమాణం వస్తుందని చెప్పాడు. అంటే ఎంత తక్కువ పదార్థరూపంలో ఎంతశక్తి ఇమిడి ఉంటుం… ఒక గ్రాము



ఏటంబాంబు సృష్టికర్తల్లో ఇంకొకరు
డా॥ భోర్

ల్లను పూర్తిగా నాశనంచేస్తే, దానిలోనుండి ఒక శతకోటివిద్యుచ్ఛక్తియూనిట్లను (అనగా Kilowatt. Hours) సమమైన శక్తి ఉద్భవిస్తుంది. ఈశక్తిఖరీదు యూనిటు ౨ అణాలు అనుకుంటే, ౨౫ కోట్ల రూపాయ లన్నమాట. ఈవిద్యుచ్ఛక్తి ఒక మద్రాసు పట్టణానికి కొన్నివందల సంవత్సరాలకు పైబడి సరిపో తుంది. ఈవిధంగా చూస్తే సూర్యుని వేడికీ, రేడియో ఏక్టివిటీకీ గల మూలకారణం అవగాహనఅయింది.

ఈ సూత్రంవల్ల కలిగే ఫలితాలు పరీక్ష రూపంగా నిర్ధారణఅయ్యాయి. రేడియోఏక్టివ్ … ఏటము న్యూక్లియసులోనుండి ఆల్ఫారేణువులు పోతా యి. అప్పుడు ౨ నెంబర్లు తక్కువఉన్న ఎటామికు నెంబరు గల క్రొత్త ద్రవ్యం తయారవుతుంది. అంటే న్యూక్లియసు ఎటామికునెంబరు మారుస్తే క్రొత్త

ద్రవ్యం ఉద్భవిస్తుం దన్నమాట. ప్రకృతి సిద్ధంగా రేడియోయాక్టివిటీవల్ల రేడియమూ (ఎటామికు నెం. ౮౮), యురేనియమూ (ఎటామికు నెం. ౯౨) కొన్ని మార్పుల ఫలితంగా సీసంగా (ఎటామికు నెం. ౮౨) మారి పోతాయి. ఏ ఉపాయంచేతనైనా ఒక మూలద్రవ్యం ఎటామికునెంబరు మారుస్తే మరోమూలద్రవ్యం జనిస్తుంది. రూథరుఫర్డుమహాశయుడు ఈ కీలకం ౧౯౧౯ సంవత్సరంలో కనిపెట్టాడు. పైన పేర్కొనబడిన పరమాణువులచేత ఏటములను కొడితే కొత్తఏటములు తయారవుతాయని ఆ శాస్త్రవేత్త కనిపెట్టాడు. ఇందుకుపయోగించిన పరమాణువుల్లో ముఖ్యమైనవి న్యూట్రానులు, ఆల్ఫారేణువులు, డాయిట్రానులు, ప్రోటానులు. ఈ విధంగా—ఉదా: సోడియము అను లోహమునుండి మగ్నీషియం, పాదరసంనుండి బంగారం తయారుచేశాడు. కాని తయారీ ఏటముల సంఖ్య లోనే అనిమాత్రం గుర్తించాలి. కాలక్రమేణా ఇప్పుడు ఎటామికుబాంబును సాధించినట్లు, మనుష్యప్రయత్నం వల్ల ప్రకృతినుండి మనకు కావలసిన లోహాలు యంత్రాలలో నిర్మించగలమేమో అను ఆశ కలుగుతూవుంది.

ఇదికాక, ఈ పరమాణువుల దాడిచేత (Bombardment) కొన్ని ఏటమున్యూక్లియసులనుండి న్యూట్రానులను వేరుచేయగలగటం తటస్థించింది. అప్పుడు కృత్రిమఐసోటోపులు చాలారకాలు ఉద్భవించాయి. కాని ఇవి అన్నీ కూడా రేడియోయాక్టివుగా ఉండి స్తిమితంలేకుండా కొంతకాలానికి బద్దలయిపోయి, స్తిమితంగల ఏటములుగా మారిపోతాయి. పై విధమైన దాడికోసం పరమాణువుల వడి హెచ్చించవలసిన అవసరం కలిగింది. ఇందుకు కొన్ని అద్భుతమైన యంత్రాలను శాస్త్రవేత్తలు నిర్మించారు. లారెన్సుమహాశయుడు నిర్మించిన 'సైక్లోట్రాను' యంత్రం చాలా ముఖ్యమైంది. ఈ యంత్రం ఒకటి మొన్నమొన్ననే కలకత్తాలో నెలకొల్పారు.

ఈ పరమాణువులచేత యురేనియంలోహమును దాడిచేయడంవల్ల జనించిన శక్తే నేటి ఎటామికు బాంబుల విధ్వంసకశక్తి.

బరువైన ఏటములు, ఉదా:—సీసం (౮౨), బంగారం (౭౯), యురేనియం (౯౨), వాటి న్యూక్లియసులలో ఉన్న న్యూట్రానులు, ప్రోటానుల సంఖ్య ప్రకారం చూస్తే, మధ్యరకమైన బరువు ఉన్న ఏటములతో ఉదా:—రాగి (౨౯), ఇనుము (౨౬) పోల్చిచూస్తే సరాసరిగా ఎక్కువతూకం కలిగి ఉన్నాయి.

ఈ బరువైన ఏటములను రెండు మామూలుబరువున్న ఏటములుగా విభజిస్తే, పై కారణంవల్ల, పంచగా హెచ్చుగా ఉన్న పదార్థపరిమాణం అత్యంత ఎటామికు శక్తిగా ఉద్భవిస్తుంది. అయిన్‌స్టీను ప్రకారం ఒక యురేనియంఏటము రెండు సుమారుసమభాగాలుగా విభజిస్తే, ౨౦ కోట్ల ఎలక్ట్రానువోల్టుల శక్తి ఉద్భవిస్తుంది. ఈ శక్తి ఉష్ణరూపంగా చూస్తే, యుద్ధక్రియల్లో బాంబుల్లో వాడే ప్రేలుడుపదార్థాలవల్ల కలిగిన ఉష్ణానికి కొన్ని మిలియన్ల రెట్లు ఉంటుంది. వందపౌన్ల యురేనియం పై విధంగా విభజిస్తే, ౨౫ కోట్ల రూపాయల విలువ గల విద్యుచ్ఛక్తిని జనింపజేస్తుంది.

యురేనియంలోహాన్ని ౧౯౩౪ లో మొట్టమొదట ఎన్రికో ఫెర్మి, ఐరీనీక్యూరీ అను శాస్త్రవేత్తలు న్యూట్రానులతో దాడిచేశారు. ముఖ్యంగా వడి అట్టేలేని న్యూట్రానులతో దాడిచేశాడు. ఇందుకు ఫలితంగా యురేనియంఏటము సుమారు రెండు సమభాగాలుగా విడిపోయిందని జర్మనుదేశంలో హాను, మైట్నరుసతి ఇద్దరూ ౧౯౩౯ లో గుర్తించారు. అందుచేత పైన చెప్పబడినట్లు ఎటామికుశక్తి జనించడానికి వ్యవస్థకలగడం తెలుసుకున్నారు. మానవప్రయత్నంవల్ల యురేనియములో ఎటామికుశక్తిని సృష్టించుటకు ఉపయోగించేందుకు సాధనం దొరికిందని తెలుసుకున్నారు. ఇంకో వింత ఏమిటీ అంటే, యురేనియంఏటం తీవ్రంగా బద్దలవటంలో, ఆ ఒత్తిడివల్ల, రెండుగా విభజింపబడటమేకాకుండా, రెండు మూడు న్యూట్రానులు న్యూక్లియసులోనుండి విడిబడ

తాయి. ఈ న్యూట్రానులు మరికొన్ని యురేనియము ఏటములను బద్దలుచేయడానికి ఉపయోగపడతాయి. అందులోనుండి ఇంకకొన్ని న్యూట్రానులు ఉద్భవిస్తాయి. అంటే రాకెట్టుగతిలాగా పెరుగుతాయన్నమాట. ఇలాగ న్యూట్రానుల సంఖ్య పెరిగేకొలదీ ఒకే సమయాన లెక్కకు రాని యురేనియం ఏటములు బ్రద్దలవ

అయితే, న్యూట్రానుల తాకిడివల్ల తిరిగి న్యూట్రానులు ఉద్భవింపజేసే ఒక్క 235 బరువు గల యురేనియం ఐసోటోపేనని నీల్సుబోర్ శాస్త్రజ్ఞుడు నిర్ధారణ చేశాడు (దీనిలో ఏటమ్ 235 రెట్లు బరువుంటాయి). ఈ యురేనియం సహజ యురేనియం (238 బరువు) కన్నా చాలా అరుదుగా ఉంటుంది. ఈ



అమెరికాలో ఆటంబాంబులు తయారుచేయు యంత్రాగారము

డానికి అవకాశం కలిగి, బ్రహ్మాండమైన ప్రేలుడు సంభవిస్తుంది. ఇదే ఏటముబాంబు బ్రద్దలవడం. మామూలుబాంబుల్లో ఉపయోగింపబడే ప్రేలుడు పదార్థాలకన్న ఎన్నో మిలియన్ల రెట్ల శక్తి ఉండటం వల్ల ఎటామికుబాంబువల్ల కలిగిన ఉత్పాతము అతి భయంకరమని తెలుస్తూనేవుంది.

రెండూ కలిసి ఉండటం చేతనూ, ఈ రెంటికీ భేదం అతి అల్పం అవటంచేతనూ ఈ రెంటినీ వేరుచేయడం బహుకష్టం. అయినా—థెర్మలు డిఫ్యూషను, మాసు స్పెక్ట్రోగ్రాఫుతో వేరుచేయడం అన్న పద్ధతులు వీలుగా ఉన్నాయి. ఇప్పుడు ఈ రకమైన పద్ధతులుపయోగించే 235 యురేనియమును తయారుచేస్తూ

ఉండాలి. ఆ పనికి ౧౨౫,౦౦౦ పనివాళ్లు అమెరికాలో కావలసివచ్చారంటే, ఎంత కష్టమైన పరిక్రియ జరపాలో గ్రహించండి.

దానికుపయోగించిన న్యూట్రానులు రేడియో ఏక్టివు అయిన రేడాను అను వాయువుతోగాని, రేడియములోహపు మిశ్రద్రవ్యంతోగాని మిశ్రితమైన బెరిలియం అను లోహమునుండి జనింపజేయవచ్చు. ఈ మూలమే పరీక్షాప్రయత్నాల్లో యురేనియమును విభజించడానికి శాస్త్రజ్ఞులు ఉపయోగించారు మొదట్లో. ఇందులో సెకనుకు ౧౨౦౦౦ నుంచి ౨౦,౦౦౦ న్యూట్రానులు ఉద్భవిస్తాయి.

బాంబులో - -న్యూట్రానుల నుద్భవింపజేసే యంత్రభాగం, యురేనియం ఉంచబడే భాగం, దానిచుట్టూ నిర్మింపబడిన ఉక్కుబాంబు. బాంబు ప్రేలుడువల్ల ౨ మిలియన్ల డిగ్రీల వేడి పుడుతుంది. ప్రపంచంలో సకలపదార్థాలూ ౮౦౦౦ డిగ్రీల ఉష్ణానికి ఆవిరి అయిపోతాయి. సూర్యుని వేడి అంతర్భాగాల్లో ౬౦,౦౦౦ డిగ్రీలు. ఈ ఉష్ణతీవ్రతకు ఏటములు పరమాణువులుగా విడిపోతాయి. సూర్యునిలో ఈ పరమాణువులే వాయురూపంగా ఉంటాయి.

౫, ౬ ఏళ్లక్రితం విశ్వకిరణాలలో (Cosmic Rays) ఉండే 'మీసాను' అను పరమాణువు అన్నిరకాల ఎటామికున్యూక్లియసులలోనూ ఉంటుందని శాస్త్రజ్ఞులు గుర్తించారు. ఈఅణువు అత్యంత వడిగలది గనుక న్యూక్లియసుకు స్తిమితం లేకుండాచేస్తుంది. ఈ మీసానురేణువు ఎటామికుబాంబు బ్రద్దలయ్యే సమయంలో ప్రేలుడువస్తువుకు తాకి భయంకరమైన ప్రేలుడు సంభవింపజేస్తుందని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. విశ్వకిరణాలన్న మహాశక్తికిరణాలు ఈమహావిశ్వమంతటా వ్యాపించిఉన్నాయనీ, ప్రతినిముషమూ మన భూమిఅంతటినీ, మనలనూ కూడా తాకుతున్నాయనీ, మనచుట్టూ కొన్నివందలమైళ్ల ఎత్తుగా గాలిగాని లేకపోతే ఈకిరణాల తాకుడువల్ల నుసిఅయిపోతామనీ శాస్త్రజ్ఞులు చెబుతారు. ఈకిరణాలకు కొన్ని అడుగుల దళము ఉన్న సీసపురేకును దూసుకొనిపోగల వేగం, శక్తి ఉన్నవి. భాభాగారు బెంగుళూరులో ఈకిరణాలపై పరిశోధన చేస్తున్నారు.

యురేనియం అను లోహం మామూలుగా నలుపుగాగాని, బూడిదగాగాని తయారుచేయబడుతుంది. పిచ్‌బ్లెండి, కార్నొటైటు అను ఖనిజాలనుండి తయారుచేస్తారు. క్లాపురాతు అను శాస్త్రవేత్త మిశ్రద్రవ్యరూపంలో ౧౭౮౯ లో ఈలోహాన్ని తయారుచేసి, ౧౭౮౧ లో హెర్షెలు అను శాస్త్రజ్ఞుడు uranus (వరుణుడు) గ్రహాన్ని కనిపెట్టినందుకు అతనికి జోహారుగా ఈలోహానికి యురేనియం అని పేరు పెట్టాడు. ౧౮౪౨ లో పెలిగాటు దీన్ని లోహరూపంలో ప్రశస్తంగా తయారుచేశాడు. పిచ్‌బ్లెం కార్నొటైటు చాలా తక్కువచోట్ల దొరుకుతాయి. అమెరికాలో కనడాలోనూ, సంయుక్తరాష్ట్రిలలోనూ, ఇంగ్లాండులో కార్న్వాలులోనూ, ప్రధానంగా ఆస్ట్రియాలో జోషింస్థాలు అనేచోటా, ఆఫ్రికాలో బెల్జియన్ కాంగోలోనూ, నార్వే, స్వీడెను, పోర్చుగలు, కొద్దిగా దక్షిణఆస్ట్రేలియా, రష్యాలలోనూ లభిస్తాయి. ఈ ఖనిజాలనుండే రేడియమునుకూడా తయారుచేస్తారు. ఏటా సుమారు ౮౦౦ టన్నుల ఖనిజం ఉత్పత్తిఅవుతుంది.

యురేనియంవలె విభజింపబడే బరువుఏటములు ఇంకోరెండు ఉన్నాయి. ఇవి థోరియం, ప్రోటో ఏక్టినియము అను లోహాలు. థోరియముకూడా ఎటామికుబాంబుల కుపయోగపడవచ్చు. మన దేశంలో తిరువాన్కూరులో మోనజైటు అను ఖనిజరూపంలో ఈలోహం విరివిగా దొరుకుతుంది.

ఎటామికుశక్తి బాంబురూపంగా యుద్ధసమయాల్లో ఉపయోగించడమేకాకుండా, మానవసంఘాభివృద్ధికీ, శ్రేయస్సుకూ కూడా ఉపయోగించవచ్చు. నేడు విద్యుచ్ఛక్తి ఉపయోగపడినదానికన్నా ఎన్నోవేలరెట్లు అధికంగా ఉపయోగపడవచ్చు. ఎటామికు శక్తిని అరికట్టి, దానిచేత పనిచేయించుకునేందుకు

# ప్రతితల్లికి తెలుసు...



అన్నివిధములగు అజీర్ణవ్యాధులుకూడ నిస్సందేహంగా గ్రైప్ సిరప్‌కు లొంగి పోగలవని ఆమెకు అనుభవమువలన తెలుసు.

ఇక లాభంలేదనుకున్న వ్యాధుల విషయంలో సయితం గ్రైప్ సిరప్ ఫలప్రదంగాపనిచేసింది. ఇది తియ్యని రుచి కలిగి, త్రాగుటకు సంతోషంగా వుంటుంది. మీ బిడ్డకు ఇది ఇష్టంగా వుంటుంది. బెంగుళూరులోని గవర్నమెంటు ఇండస్ట్రియల్ అండ్ టెస్టింగు లేబరేటరీలో తయారైనదానిని అడగండి



## గ్రైప్ సిరప్

మైసూరు ప్రభుత్వపు సరుకు

---

## ప్రజాసౌకర్యమునకై నవీనౌషధము




# "మెహతా" గారి

## లివర్ & స్ప్లీన్ నివారిణి

తీవ్రప్రయత్నముల ఫలితముగ మేము లివర్ & స్ప్లీన్ నివారణకని ఈ నవీనౌషధము కనిపెట్టియున్నాము.

బిడ్డలకుకలుగు కడుపులో బల్లగడ్డలు గురించి విచారింపపనిలేదు. ఔషధప్రపంచమున సాటిలేని "మెహతా"గారి నివారిణిని ఉపయోగింపుడు.

**కె. ఎస్. మెహతా & కంపెని,**

**250, చైనాబజార్ రోడ్, మద్రాసు.**

## నిజంగా అతను లైఫ్‌బాయ్ అభ్యాసము నేర్చుకున్నాడు

అతను స్కూలుకు వెళ్లినాడు. అక్కడనుంచి ఏమి తెస్తాడో? విజ్ఞానము, క్రొత్త పద్ధతులు—బహుశా ఏఅంటు వ్యాధులు వ్యాపింపచేసే క్రిములనో తెస్తాడు! తానునేర్పిన పద్ధతుల వలన తన కుమార్డు సురక్షితముగా వుండునట్లుచేసి వాని తల్లి వానిని స్కూలుకు పంపుతుంది — అన్నిటిలోకి ముఖ్యమైనదేమంటే, ఎంతబలవంతుడైన పిల్లవాడైనప్పటికి క్రిములవలని వ్యాధిగ్రస్తుడగుటకు కారణమైనటువంటి "మురికివలని అపాయము" నుండి రక్షించే లైఫ్ బాయి సబ్బును ప్రతిదినమూవాడటమే.




**లైఫ్‌బాయ్. మంచి సబ్బుల్లోకి ఉత్తమమైనది**

**ఇది మంచి అలవాటు**

L 78-23 TL

LEVER BROTHERS (INDIA) LIMITED

చాలా పరిశోధన అవసరమని రామనుమహాశయునివంటి శాస్త్రవేత్తలు చెబుతున్నారు. గత ౩౦ సంవత్సరాల్లో జరిగిన రెండు ప్రపంచయుద్ధాలకూ గల కారణాలు చూస్తే, ఏఒక్క జాతికో గలసామ్రాజ్యకాంక్ష, అధికారకాంక్ష, ప్రపంచముడిపదార్థాలు సేకరించుకుందామన్న దుర్గ్రాహము, తమజాతిసౌఖ్యమే ప్రధానమను సూత్రం పాటించడమూ ఇవి ఎప్పటిలాగా ఉంటే ఎటామికుశక్తి, అందుకు మూలమైన యురేనియంలాంటి ముడిపదార్థాలూ తిరిగీ తీవ్రయుద్ధసమస్యకు కారణాలవుతాయి. అదికాకుండా, సర్వజాతిస్వాతంత్ర్య, సౌభాగ్యాలు ప్రపంచశాంతికి ప్రథమసోపానమనీ, ప్రపంచశాంతి మానవజాతినిలకడకు కావలసిన ప్రధానస్థితిఅనీ, ఏఒక్క జాతిబుద్ధిమాంద్యతా, బలగర్వమూ మానవాభ్యుదయానికి అడ్డురాకూడదనీ ప్రపంచప్రధానులు గుర్తించి, తదనుగుణంగా కృషి చేస్తే, ఎటామికుబాంబు అనే ఈ భయంకరఆయుధం శాస్త్రపరిశోధనాకీర్తికాంతకు మకుటంగా, మానవాభ్యుదయచరిత్రలో ప్రధానభూమికగా వెలుస్తుంది.



# రాజా కొత్త సూచనలు

## = శ్రీ కాశీనాథుని పూర్ణమల్లికార్జునుఁడు =

హిందూమహమ్మదీయ సమస్య న్యాయతః రాజ్యాంగవిధాననిర్ణయమునందు ప్రాధాన్యము వహింప నవసరము లేకున్నను, విదేశపరిపాలనకు సహజమైన 'విభజించిపాలించు' అనే తంత్రమునుబట్టి ఒక పెద్ద రాజ్యాంగసమస్యగా పరిణమించినది. భారత జాతీయతాశక్తులను నిరోధించి, సామ్రాజ్యతత్త్వ రక్షణార్థమై బ్రిటిషు ప్రభుత్వము వారు ఈ మతసమస్యను "కోతిపుండు బ్రహ్మరాక్షసి"గా పరిణమింపజేసిరి. భారతజాతీయజీవనములోని ప్రధాన వర్గములను రాజకీయపద్ధతులబట్టిగాక మతమునుబట్టి ఏనాడయితే బ్రిటిషు ప్రభుత్వమువారు నెలకొల్పదలచిరో, ఆనాడే మన సాంఘికరాజకీయజీవనములందు విషబీజములు నాటబడినవి. ౧౯౦౯-వ సంవత్సరములోని 'మింటోమార్లే'సంస్కరణములలో ఈవిష బీజములు మొట్టమొదటగా నాటబడినవి. మహమ్మదీయులకు ప్రత్యేకప్రాతినిధ్యము, ప్రత్యేకనియోజక వర్గములు అననవియే యీ విషబీజములు. అప్పటికి ఇండియామంత్రిగా పనిచేయుచున్న మార్లేప్రభువు కూడ ఈప్రత్యేకనియోజకవర్గములను (separate electorate) గర్హించియున్నాడు. గర్హించికూడ సామ్రాజ్య వాదసిద్ధాంతానుసారముగా అంగీకరించియున్నాడు. ౧౯౦౯-వ సం.నుండి యీ విద్వేషసూత్రములవలన కలిగిన అనుభవమును పురస్కరించుకొని, మాంటేగ్యు రిపోర్టులోకూడ, ఈ ప్రత్యేకనియోజకవర్గపద్ధతులను మాంటేగ్యూ, అనగా అప్పటి ఇండియామంత్రి నిరాక్షేపముగా ఖండించియున్నాడు. ఆయనరిపోర్టులో ఈ క్రిందివాక్యము గలదు: "A very serious hindrance to the development of the self-governing principle" అనగా ఈప్రత్యేకనియోజక వర్గములు స్వపరిపాలనాసూత్రముయొక్క అభివృద్ధికి ప్రమాదకరములైన అంతరాయములు.

### మాంటేగ్యూ, సైమనురిపోర్టులు

ఈ మాంటేగ్యూరిపోర్టునుగూర్చి యీసందర్భములో చర్చించుచు, సైమనుకమీషనురిపోర్టులో ఈ క్రిందివాక్యములు గలవు: "The Montague report declared that they (Communal electorates) were opposed to the teaching of history; that they perpetuated class division: that they stereotyped existing relations and that they constituted 'a very serious hindrance to the development of the selt - governing principle' " (మాంటేగ్యూరిపోర్టు చెప్పిన దేమనగా- ఈప్రత్యేకనియోజకవర్గములు చరిత్రావబోధమునకు విరోధకములు; వర్గవైమనస్యమును స్థిరీకరించును; ప్రస్తుతపరిస్థితులను మారకుండజేయును; స్వపరిపాలనాసూత్రముయొక్క అభివృద్ధికి ప్రబలవిరోధకములు) 'మాంటేగ్యూరిపోర్టు'లోని ఈ అంశములు 'సైమను రిపోర్టులో'కూడ అంగీకరింపబడియున్నవి. అట్లు అంగీకరింపబడియు, వానిని తొలగించుటకు ప్రయత్నములు చేయకపోగా దానినే తిరిగి బ్రిటిషు ప్రభుత్వము వారు స్థిరీకరించిరి.

### లక్నో ఒడంబడిక

'మింటోమార్లే'సంస్కరణములలో మొదలుగా నెలకొల్పబడిన ప్రత్యేకనియోజకవర్గములు ౧౯౧౬-వ సం.లో కాంగ్రెసుయొక్కయు, ముస్లింలీగుయొక్కయు అనుమతి పొందిన 'కాంగ్రెసు లీగు స్కీము, లక్నో ఒడం

బడిక' అను పేర్లతో ప్రసిద్ధికెక్కినవి. ఈ ఒడంబడిక మన చరిత్రలో ప్రధానఘట్టమని చెప్పవచ్చును. ఆ ఒడంబడిక లేకున్నచో మనరాజకీయాభివృద్ధి ఎటులుండెడిదో చెప్పజాలము. ఆ ఒడంబడికలోని కొన్ని ప్రధాన విషయములను గమనించుట అవసరము. "భారతదేశమునకు అధినివేశరాజ్యసమానప్రతిపత్తి కావలెననియు, రాష్ట్రశాసనసభలలో ఐదువంతులకు నాల్గువంతులు ప్రజాప్రతినిధులైన సభ్యు లుండవలయుననియు, ఒకవంతు ప్రభుత్వమువారిచే నియమింపబడెడు సభ్యులుండవలయుననియు, ప్రత్యేక నియోజకవర్గముల ద్వారా మహమ్మదీయులకు పంజాబురాష్ట్రములో ప్రజాప్రతినిధులలో నూటికి ఏబదివంతులున్న, బెంగాలులో నూటికి నలుబదివంతులున్న, సంయుక్తరాష్ట్రములో నూటికి ముప్పదివంతులున్న, బీహారులో ౨౫ వంతులున్న, మద్రాసులో నూటికి పదిహేనువంతులున్న, బొంబాయిలో నూటికి ముప్పదిమూడు వంతులున్న, మధ్యరాష్ట్రములో నూటికి పదిహేనువంతులున్న స్థానములు రాష్ట్రశాసనసభలలో నిర్ణయింపబడెను. కేంద్రశాసనసభలో ఐదువంతులలో నాలుగు వంతుల సభ్యులు ప్రజాప్రతినిధులుగా నుండవలెను. అందులో మూడవవంతుస్థానములు మహమ్మదీయులకు ఉండవలెను. అంతేగాక శాసనసభలలోని మహమ్మదీయ సభ్యులలో మూడువంతులమంది ఏ శాసనమునకైన అధిక్షేపించుచో అందునుగూర్చి ఎట్టి తీర్మానము చేయుటకుగాని శాసనసభల కధికారముండరాదు. ఇదియు కాంగ్రెసు-లీగు ఒడంబడిక. దీనివలన ప్రత్యేక నియోజకవర్గములు మన రాజ్యాంగములో పార్టీల అనుమతితో పాదుకొనినవి. ప్రత్యేక నియోజకవర్గములనుబట్టి మహమ్మదీయఓటర్లే మహమ్మదీయ అభ్యర్థులను శాసనసభలకు ఎన్నుకోవలెను. ఇతర మతములలోని అభ్యర్థుల నెన్నుకొనుటలో వారికిగాని, మహమ్మదీయుల నెన్నుకొనుటలో ఇతర మతస్థులకుగాని అవకాశము లేదు. ఇందువలన మతమునకు, మతావేశమునకు ప్రాధాన్యము, మతవిద్వేషము హెచ్చుపెరుగుట, అన్యోన్యసహకార సద్భావములు నశించుట మొదలగునవి సంభవించి నేడు 'పాకిస్థాను' రూపమున పరిణమించినవి.

ఈ 'లక్నో' ప్రణాళిక బ్రిటిషుప్రభుత్వము వారిచే ఆమోదింపబడి ౧౯౧౯ లోని భారత రాజ్యాంగచట్టమునందు చొప్పింపబడెను. ఈ ప్రత్యేక నియోజకవర్గములవలన మహమ్మదీయులయొక్క అనుమానములు తొలగి, వారు మహమ్మదీయేతరులతో పూర్ణసహకారము నవలంబించెదరను ఆశ లడుగంటినవి.

## రౌండుటేబిలు సమావేశములు

౧౯౩౦ నుంచి జరిగిన రౌండుటేబిలు సమావేశములకు హాజరైన సర్ మహమ్మదుషాఫీ మహమ్మదల్లీ మొదలైన ప్రముఖ మహమ్మదీయనాయకులు ఈ ప్రత్యేక నియోజకవర్గపద్ధతిని రద్దుచేసి సంయుక్త నియోజకవర్గపద్ధతిని స్థాపింపదలచిరిగాని వారి ప్రయత్నములు వ్యర్థములయ్యెను. దానికి కారణములు పెక్కులు గలవు. వానిని వివరించుటకు ఇందు తావులేదు. ప్రాకరణికములునుకావు. తత్ప్రయత్న వైఫల్య పర్యవసానముగా బ్రిటిషుప్రభుత్వమువారి కమ్యూనల్ అవార్డు (మతసంబంధమైన పంచాయితీతీర్పు) సంప్రాప్తించినది. ఇదియే యిప్పటివరకు అమలులోనున్నది. ౧౯౩౫ రాజ్యాంగమునందు శాసింపబడికూడ ఉన్నది.

## కమ్యూనల్ అవార్డు

దీనిని పంచాయితీతీర్పు అని పిలుచుటకంటె హాస్యాస్పదమైన విషయ మింకొకటి లేదు. హిందూ-ముస్లిములమధ్య విద్వేషమును పెంపొందించి, ఉభయులున్న బ్రిటిషువారిమీద ఆధారపడియుండునట్లు చేయుటయే దీనియొక్క ముఖ్యోద్దేశము. భారతదేశమునకు స్నేహితుడనని ప్రగల్భములు పలికిన రాంసే మాక్డనాల్డు మంత్రియొక్క కవిత్వమే యీ పంచాయితీతీర్పు.

ఇందులోని ముఖ్యాంశము లెవ్వియనగా: రాష్ట్ర, కేంద్రశాసనసభలలో ప్రత్యేకనియోజకవర్గములద్వారా ప్రాతినిధ్యము. గవర్నరులకున్న, గవర్నరుజనరలుకున్న భిన్నమతస్థుల హక్కులు కాపాడుటకై ఒసంగబడిన ప్రత్యేకాధికారము. ఏరాష్ట్రమునకు ఎన్నెన్ని స్థానములు మహమ్మదీయుల కొసగబడెనో వివరించుటకు ఇచ్చట అవకాశములేదు. కాని ఒక్కవిషయముమాత్రము చెప్పవలసియున్నది. మాంటేగ్యూసంస్కరణముల ప్రకారము మహమ్మదీయులు బహుసంఖ్యాకులుగా గలట్టియు, పెద్దరాష్ట్రమయినట్టియు బెంగాలు రాష్ట్రమునందు మహమ్మదీయులకు ఇవ్వబడిన ప్రాతినిధ్యము ఈ పంచాయితీతీర్పులనుబట్టి యివ్వబడినది. ఈపద్ధతియొక్క పర్యవసానమే నేటి పాకిస్థానునినాదము.

## ౧౯౩౫ రాజ్యాంగవిధానము, దాని అంతరింపు

ఈ పంచాయితీతీర్పును ఆధారము చేసి కొన్న ౧౯౩౫ సం. పు - రాజ్యాంగవిధానము రాష్ట్రములలో కొంతకాలము అమలునందున్నను కేంద్రములో మాత్రము అమలులోనికి రాలేదు. ఇంతలో యుద్ధము వచ్చెను. కేంద్రమునకు సంబంధించిన ౧౯౩౫ శాసనములోని భాగమును బ్రిటిషుప్రభుత్వమువారు స్తంభింపజేసిరి. రాష్ట్రములలోకూడ పెక్కురాష్ట్రములయందు ప్రజాప్రభుత్వములు అంతరించెను. యుద్ధగతి తీవ్రమైనది. బ్రిటిషువారి పరాజయపరంపరలు బహుళములయ్యెను. అట్టిస్థితిలో బ్రిటిషుమంత్రియైన సర్ స్టాఫర్డుక్రిప్సు అనునాయన మన దేశమునకు వచ్చెను. ఆయన కొన్ని ప్రతిపాదనలు తెచ్చెను. ఆప్రతిపాదనలు నిలిచియున్నవనియు, అవియే భారతరాజ్యాంగమునకు ఆధారములనియు బ్రిటిషుఅధికారులు పదేపదే చెప్పుచువచ్చుచుండిరి.

## లిన్‌లిత్‌గో ప్రకటన

ఈ ప్రతిపాదనలు రాకముందు ౧౯౪౦ ఆగస్టు నెలలో భారతవిద్వేషియని పేరెన్నికగన్న అమెరీ మంత్రిఅధ్వర్యమున లార్డు లినులిత్‌గో ప్రభువు ఒక ప్రకటన చేసెను. ఆప్రకటనయే పాకిస్థానునినాదమును రాజ్యాంగవాదముగా మార్చివేసెను. అందులో "The Br. govt. could not contemplate the transfer of their present responsibilities for the peace and welfare of India to any system of govt whose authority is directly denied by large and powerful elements, in India's national life. Nor could they be parties to the coercion of such elements into submission to such a govt." అనగా "భారతదేశముయొక్క శాంతిభద్రతలనుగూర్చితమకుగల ప్రస్తుతాధికారములను ఇండియాజాతీయజీవనములోని పెద్దవియున్న, బలముగలట్టియున్న వర్గములచే ప్రతిఘటింపబడుతూఉన్న ఏప్రభుత్వవిధానమునకును బ్రిటిషు ప్రభుత్వమువారు సంక్రమింప తలపెట్టజాలరు. అట్టివిధానమునకు అట్టివర్గములులోబడునట్లుగాబలవంతపెట్టుటకు తాము అంగీకరింపజాలరు." ముస్లింలీగువారు కాంగ్రెసుతో సమాధానమునకు వచ్చే ఆశలన్నియు ఈ ప్రకటనతో అంతరించిపోయినవి. ముస్లింలీగువారు అంగీకరించనిది భారతదేశమునకు రాజకీయముగా అభివృద్ధి కలుగజాలదు. ఇంతటినుంచి పాకిస్థానువాదమునకు మహమ్మదీయులలో కొంత బలము చేకూరినది. ముస్లింలీగుయొక్క ప్రతిష్ఠ యినుమడించినది. ముస్లింలీగునకు రాజ్యాంగాభివృద్ధినికూడ నిరోధించగల శక్తి బ్రిటిషువారు ప్రసాదించుటవలన మహమ్మదీయులలో వారికి పలుకుబడి హెచ్చినది. ఇందువలననే భారతాభివృద్ధికి 'అమెరీ' ప్రబలశత్రువైనాడు. ఆయనయొక్క ఓటమి విన్నదినము పర్వదినముగా పరిగణింపబడినది.

## క్రిప్సు ప్రతిపాదనలు

తరువాతి వృత్తాంతము 'క్రిప్సు ప్రణాళిక'. ఒక్క విధముగా 'క్రిప్సు' ప్రతిపాదనలు పాకిస్థానువాదమును ఆమోదించినవి. ఆ ప్రతిపాదనలలోని కొన్ని ముఖ్య విషయములనిందు పొందుపఱచెదను.

"యుద్ధసమాప్తి అయినవెంటనే భారతదేశరాజ్యాంగనిర్మాణమునకై ఒక ప్రజాప్రతినిధి సంస్థ ఏర్పాటుచేయబడును. అందులో స్వదేశసంస్థానములు కూడ పాల్గొనుటకు అవకాశముండును. ఆసంస్థవారు నిర్ణయించిన రాజ్యాంగమును బ్రిటిషుప్రభుత్వమువారు ఆమోదించి అమలుజరిపెదరు. కాని ఆ రాజ్యాంగము రెండు కట్టుబాట్లకు లోబడియుండవలెను. మొదటి కట్టుబాటు—బ్రిటిషుఇండియాలోని ఏ రాష్ట్రమైనను నూతన భారతరాజ్యాంగమును అంగీకరింపనిచో, అట్టి రాజ్యాంగములో జేరక, ప్రస్తుత రాష్ట్రాధికారాలతో ఆ రాష్ట్రము విడిగా ఉండి, తరువాత కావలసియుంటే తిరిగి భారతరాజ్యాంగములో జేరవచ్చును. అట్లు చేరకుండ కొన్ని రాష్ట్రములు వెలుపల ఉండి, తరువాత అవన్నియు కలిసి ఒక రాజ్యాంగమును నిర్మించుకొన్నచో, అట్టి రాజ్యాంగమును అంగీకరించుటకు బ్రిటిషు ప్రభుత్వము సిద్ధపడెదరు.

రెండవ కట్టుబాటు బ్రిటిషువారితో సంబంధమును గూర్చి. దాని విషయము అప్రస్తుతము గనుక ఇక్కడ వివరించలేదు.

ప్రజాప్రతినిధిసంస్థ నిర్మాణము—యుద్ధానంతరము రాష్ట్రఅసెంబ్లీలకు ఎన్నికలు జరుగును. రాష్ట్రఅసెంబ్లీ

సభ్యులందరు ఒకే సంస్థగా కలిసి ప్రపోర్షనలు రిప్రెజెంటేషను (proportional representation) పద్ధతిగా ఒక రాజ్యాంగనిర్ణాయక సభను ఎన్నుకొందురు. మొత్తము సభ్యులలో నూటికి పదిమంది యీ సభకు ఎన్నుకొనబడుదురు. జనాభాదామాషా ప్రకారము స్వదేశసంస్థానములనుండికూడ ప్రతినిధులు ఈ సభకు వత్తురు."

ఈ సభలో భావిరాజ్యాంగమును నిర్మాణము జేయుదురు. దీని తరువాత రాజగోపాలాచారిగారి ప్రణాళిక, గాంధీ జిన్నా సమావేశములున్ను జరిగినవి. వ్యవధి లేనందున వాని నిక్కడ చర్చించదలచలేదు. అన్ని రంగములయందున్ను యుద్ధము పూర్తియైనది. కనుక బ్రిటిషువారు చేసిన 'క్రిప్సుప్రణాళిక'లోని వాగ్దానమునుబట్టి రాజ్యాంగ నిర్ణాయకసంస్థను నెలకొల్పవలసియున్నది. వేవెలు ప్రతిపాదనలు సఫలములై యున్నచో భారతీయ కేంద్రప్రభుత్వమే అట్టి సంస్థను నిర్మాణముచేసియుండెడిది. అట్టి అదృష్టము మనకు పట్టినది కాదు. కావున బ్రిటిషువారే అందుకు వెంటనే పూనుకోవలసియున్నది. ఇంతలో 'క్రిప్సు ప్రణాళిక' కొంచెము మార్పుజేసి అమలుచేయవలసినదిగా శ్రీమాన్ రాజగోపాలాచార్యులుగారు కొన్ని సూచనలు చేసిరి. అందులోని వివరములు ఎవ్వి యనగా—

## రాజాజీ క్రొత్తసూచనలు

వెంటనే రాష్ట్రఅసెంబ్లీలకు ఎన్నికలు జరుగవలెను. జరిగినవెంటనే అఖిలభారత యూనియనులో చేరుటయా, చేరకుండుటయా అని ప్రతి రాష్ట్రఅసెంబ్లీయున్ను నిర్ణయించవలెను. చేరకుండ నిలిచిపోదలచిన రాష్ట్రములను వదిలివేసి, చేరదలచిన రాష్ట్రములు క్రిప్సుప్రతిపాదనలప్రకారము రాజ్యాంగనిర్ణాయక సంస్థను ఏర్పాటుచేసికొని రాజ్యాంగమును నిర్మాణము జేయవలెను. ఈ సూచనలలో క్రిప్సుప్రతిపాదనలకంటె ముఖ్యాంశములలో గల మార్పు ఏమియున్ను లేదు. కార్యక్రమములోమాత్రము తారతమ్యమున్నది. ఇందువలన కొన్ని లాభములున్ను గలవు; కొన్ని నష్టములున్ను గలవు. తోచినమట్టుకు వానిని చర్చించెదను.

## క్రిప్సు కార్యక్రమము

క్రిప్సుప్రతిపాదనలలోని కార్యక్రమముయొక్క వరుస-మొదట రాష్ట్రఅసెంబ్లీ ఎన్నికలు. తరువాత అన్ని రాష్ట్రములఅసెంబ్లీల సభ్యులు జేరి రాజ్యాంగ నిర్ణాయకసభ్యులను ఎన్నుకొనుట. ఆసభ్యులు, స్వదేశసంస్థానప్రతినిధులు కలిసి యావద్భారతమును మనస్సులో ఉంచుకొని అందుకు అనుసరణమైన రాజ్యాంగ విధానమును తయారుజేయుట. అట్లు తయారుచేసిన తరువాత రాష్ట్రములవారు దానిని అంగీకరించుటయా, అంగీకరించకుండుటయా నిర్ణయించుట. అంగీకరించని రాష్ట్రములు అఖిలభారతరాజ్యాంగములో జేరకుండుట, వాటికి ప్రస్తుతరాష్ట్రీయపరిపాలనాధికారముమాత్రము ఉండుట, తరువాత వారికి ఇష్టమైతే అఖిలభారతరాజ్యాంగములో జేరుట. లేకపోతే అట్టిరాష్ట్రములు సరియైన పరిస్థితులలో కలిసి వేరొక యూనియను స్థాపించుకొనుట. ఇది క్రిప్సు ప్రతిపాదనలలోని నడక.

## రాజాజీ కార్యక్రమము

రాజాజీగారు చెప్పినదేమనగా-మొదట రాష్ట్రఅసెంబ్లీల ఎన్నికలు. ఎన్నికలు అయినతరువాత అఖిలభారతయూనియనులో చేరుటయా, లేక చేరకుండుటయా అను విషయముపై అసెంబ్లీలు నిర్ణయించుట. యూనియనులో జేరుటకు నిర్ణయించిన అసెంబ్లీలే రాజ్యాంగనిర్ణాయకసభ్యులను ఎన్నుకొనుట. చేరకుండుటకు నిర్ణయించిన అసెంబ్లీలు రాజ్యాంగనిర్ణాయకసభకు వెలుపలనుండుట. చేరదలచిన అసెంబ్లీలచే ఎన్నుకోబడిన సభ్యులు అఖిలభారతరాజ్యాంగము తయారుజేయుట. అట్లు చేసిన తరువాత అప్పటికి వెలుపలనున్న రాష్ట్రము తిరిగి యిష్టమున్నచో తయారైన రాజ్యాంగములో జేరవచ్చును.

## వాద ప్రతివాదనలు

యావద్భారతమునకు ఒకే రాజ్యాంగము ఏర్పడి ఒకే యూనియను ఉండుట జాతీయవాదు లందరి అభిమతము. క్రిప్సుప్రణాళికాకార్యక్రమప్రకారము కూడ ఒకటికంటె ఎక్కువగా యూనియనులు ఏర్పడవచ్చును. అట్లు ఏర్పడినచో విచారకరమైన విషయమని జాతీయవాదులు ఒప్పుకొనకతప్పదు. ఒకటికంటె ఎక్కువ యూనియనులు ఏర్పడకతప్పనిచో, కాలయాపన లేకుండ, కేంద్రాధికారములు బహుళముగా కలిగిన రాజ్యాంగనిర్మాణము మిక్కిలి ఆవశ్యకము. క్రిప్సుపద్ధతిప్రకారము అన్ని రాష్ట్రములు

స్వదేశసంస్థానములు కలిసి రాజ్యాంగనిర్మాణము జేయ బూనినచో కాలయాపన జరుగకతప్పదు. రాజ్యాంగమునందు చుఱుకుగా పనిచేయు అవకాశములు తక్కువయగును. రాష్ట్రములవారి ప్రత్యేకతను, మతములవారి ప్రత్యేకతను, వర్గములవారి ప్రత్యేకతను రక్షించుటకు ఎన్నియో అపవాదసూత్రములు నిర్మించవలసియుండును. ప్రభుత్వమునకు ప్రతిబంధకములు ఎక్కువయగును. భారతదేశమునకు అవసరమైన తీవ్రఆర్థిక సాంఘికవిధానముల నమలుజరుపుటకు అడ్డంకులు ఎక్కువగా సంప్రాప్తించును. ఇన్ని ఒడుదుడుకులతో ఏర్పడిన రాజ్యాంగమును చివరకు ఏరాష్ట్రమైనను అంగీకరించవచ్చును; అంగీకరించకపోవచ్చును. అంగీకరింపనిచో రాజ్యాంగములో ఏర్పడిన ప్రతిబంధకములు అభివృద్ధినిరోధకములు కాక తప్పదు. అఖిలభారతయూనియను అనే ఆదర్శము లభించదు. చివరకు 'రెంటికిం జెడిన రేవడ' అనే పద్ధతి సంప్రాప్తించగలదు. కావున క్రిప్సు పద్ధతివలన ఈ భయముకలదని రాజాజీసూచనలు అర్థమిచ్చును.

రాజాజీ సూచనలకు ఆక్షేపణలు - యావద్భారత రాజ్యాంగస్వరూపము ఏర్పడితే తప్ప ఏ రాష్ట్రమైనను యూనియనులో ఎట్లు చేరగలదు? చేరవలసినదని కోరుట ధర్మమా? అట్లు కోరుట అధర్మమగును. అదిన్నిగాక మొదటనే చేరుటయా, చేరకుండుటయా నిర్ణయించవలసివచ్చే పక్షములో, మహమ్మదీయరాష్ట్రములు చేరకుండుటకే ఎక్కువ సందర్భములు వచ్చును. చేరవద్దని చెప్పేవారి వాదమునకు బలమిచ్చినట్లగును. స్వరూపము తెలియకుండ మిమ్మలను యూనియనులో చేరమంటున్నారు. మీరు మోసగింపబడెదరు" అని చెప్పే పాకీస్థానువాదమునకు కొంత బలము చేకూరి మహమ్మదీయబహుళరాష్ట్రములు యూనియనులో చేరకుండే అవకాశములు ఎక్కువయగును. యూనియనులో రాష్ట్రములన్నియు చేరే అవకాశములను బలపఱచవలెగాని బలహీనపఱచరాదు. కావున కేవల పాకీస్థానువాదులు, కేవల పాకీస్థాను వ్యతిరేకవాదులు గాక మధ్యస్థులు ఉందురు. వారిని ఈ విధానము పాకీస్థానువాదుల క్రిందకు జేర్చివేయగలదు. కావున ఆలస్యమైనను, రాజ్యాంగమునందు శృంఖలములు ఎక్కువయైనను అఖిలభారత యూనియను ఏర్పడే అవకాశములు తగ్గించరాదని యీ ఆక్షేపణల అర్థము.

రాజాజీవంటి అప్రతిమానమేధావంతునకు ఈ పూర్వాపరసందర్భములు తెలియకపోవు. అయినను ఎందువలన ఈ మార్పును ఆయన సూచించెను? ఆయన మనస్సులో ఏమి ఉండిఉండును? అని ఆలోచించి యీ క్రింది విషయముల నుద్ఘాటించుచున్నాను. ఆయనవాదము ఈ క్రింది విధముగా ఉండనోపు:

ఈ మార్పువలననే మహమ్మదీయబహుళ రాష్ట్రములు యూనియనులో జేరు అవకాశములు ఎక్కువ కావచ్చును. ముందే యూనియనులో జేరుటకు నిర్ణయింపకున్నచో ప్రస్తుత రాష్ట్రవిధానమే మన రాష్ట్రములలో నుండును. మిగిలిన రాష్ట్రములన్నియు కలిసి వేఱొక యూనియను ఏర్పాటుచేసికొనుటకు అంగీకరించవచ్చును; అంగీకరించకపోవచ్చును. అంగీకరింపని పక్షములో మనము నష్టపడెదము. అదిన్నిగాక ముందుగా ఏర్పడే పెద్ద యూనియనులోనే స్వదేశసంస్థానములు మొదలైనవి ఎక్కువగా జేరి, ఆ యూనియను బలముగలది యగును. బలముగల యూనియనులో జేరినచో మనకు లాభించును. కావున మొదటిలోనే యూనియనులో జేరుటకు మనము సంకల్పించి మనకు నష్టముకాని పద్ధతిమీద రాజ్యాంగమును తయారుజేసికొనుట మంచిది అను రాష్ట్రములు అనుకొనుటకు పెక్కు అవకాశములుండును గాన యీ పద్ధతియే మంచిది.

న్నిగాక క్రిప్సుపద్ధతి జరుగుచో కాలయాపన జరుగును. రాజ్యాంగవిధానము నిర్మించుటకు ఏ రెండు మూడు సంవత్సరములో పట్టవచ్చును. ఈ రాజ్యాంగమును బ్రిటనులోని ప్రభువుల సభ (House of Lords) తిరస్కరించవచ్చును. రెండు సెషనులలో వరుసగా కామన్సుసభవారు ప్యాసుచేస్తేతప్ప ప్రభువుల తిరస్కారము నిలిచిపోయి, శాసనము కాజాలదు. ఈ లేబరుమెజారిటీ కల పార్లమెంటు ఐదుసంవత్సరములకంటె ఎక్కువ ఉండునో ఉండదో? కాబట్టి వెంటనే ఒక సంవత్సరములో రాజ్యాంగమును మనము తయారుచేసినచో ప్రభువులసభ తిరస్కరించినను, కామన్సుసభలోని లేబరు మెజారిటీవారు ప్యాసుచేసే అవకాశములు ఉండును. దానిని మనము పోగొట్టుకొనరాదు. కాన కాలయాపన జరగని విధానమే మంచిది. కావున సూచింపబడిన మార్పు అవసరమని వాదించవచ్చును.



# దారిలో విశ్రాంతి

బస్ ప్రయాణాలలో ఆయిల్, పెట్రోల్ పోసుకోడంకోసం చాలా మకాములు చేయవలసి వస్తుంది. ఒక బస్‌నుంచి ఇంకోదానికి మారవలసి వచ్చినప్పుడు వుండే వ్యవధి మరీ ఎక్కువ. భారత దేశంలో పల్లెటూళ్లలో ప్రయాణం చేసేవారికి, సాధారణంగా ఒళ్లు హూనమయేటట్లు రోడ్డుమీద కుదుపుతో ప్రయాణం చేసిన తరువాత హాయిగా కొంతకాలం విశ్రమించడాని వారిచ్చె మజిలీలు సహజం.

మరీ ప్రశస్తమైనవి — శరీరాయాసం, మనోశ్రమకూడా మరిపించే అందుకు స్వచ్ఛమైన బ్రూక్‌బాండ్ టీ ఎప్పుడైనా త్రాగవచ్చును.

భారతదేశమంతటా, బస్‌లు ఆగే ప్రదేశాలలోనూ, నాలుగు రోడ్ల మధ్యా వున్న టీ (తేనీరు) దుకాణాలలో మా సేల్స్‌మెన్ నిత్యమూ సరఫరా చేస్తున్న, తోటలోంచి అప్పుడేవచ్చిన స్వచ్ఛమైన బ్రూక్‌బాండ్ టీ దొరుకుతుంది.



స్వచ్ఛస్థితి - తోటనుంచి పాత్రకి క్షణకాలంలో వస్తుంది.

## బ్రూ బాండ్

రెండు ఆకులు - ఒక మొగ.

# అక్కా చెల్లెళ్లు

[ కథానిక ]



= 'స్వైరవిహారి' =

(గతసంచిక తరువాయి)

రాత్రి ఒంటిగంటకు రైలుదిగి ఇంటికి వెళ్లిచూసే సరికి తలుపు తాళంవేసిఉంది. గత్యంతరంలేక, ప్రక్కయింటివారిని కనుక్కుందామని తలుపు పిలుస్తున్న సమయంలో, నిద్రతో సోలిపోతున్న లక్ష్మి శరీరభారాన్ని సగం తానే వహిస్తూ ధీరంగా వచ్చేడు రామనారాయణ. వెన్నెల గ్రుడ్డిగా ఉండడంవల్ల, దగ్గరకు వచ్చేదాకా ఆవచ్చేది రామనారాయణే నని రాజేశ్వరికూడా గుర్తించలేకపోయింది. దగ్గరకు వచ్చిన తర్వాతకూడా తీక్ష్ణంగా చూసేకగాని ఫలానా అని గ్రహించలేకపోయేడు రామనారాయణ. మధుసూదనరావు (రాజేశ్వరితండ్రి)గారి కిదేదో నాటకంలా గుంది. ఇక లక్ష్మికి ఎదుట నున్న వ్యక్తులకంటె స్వప్నలోకంలోని వ్యక్తులే ఎక్కువ స్ఫుటంగా కనిపిస్తున్నారు.

మధుసూదనరావుగారు రామనారాయణను అంటిపెట్టుకొనిఉన్న లక్ష్మివైపు ఒక్కనిముషం నిదానంగా చూసి, కూతురువంక తిరిగి, "అమ్మాయీ! నాకు మళ్ళీరైలుంది. నువ్వుంటావా, నాతోవస్తావా?" అన్నారు.

రాజేశ్వరి అతిప్రయత్నంమీద, గద్గదస్వనంతో "మీరు వెళ్లండి నాన్నా!" అని ఇంకా ఏమేమో అనదల్చుకుంది కాని బలవంతంగా ఆమెగొంతు ఎవరో నొక్కినట్టయింది.

వెనక తిరిగి వెళ్లిపోతున్న తండ్రిపైమీదివాణీ అతడి మొగంమీదకి వెళ్లడంతో అంతవరకూ ఎంతో ప్రయత్నంమీద నిలిచిన ఆమెవేడికన్నీళ్లు జలజల రాలేయి.

* * *

రామనారాయణకు రాజేశ్వరీపునరాగమనం ఒక విధమైన గాభరానేకాదు, భయాన్నికూడా కలిగించింది. ఒక్కమారుగా అతనికి ఏదో అంతర్వాణి ఉపదేశించినట్టుగా తానిటీవల చేసిన ప్రతీపనీ దోషయుక్తమే ననిపించింది. ఒకవేళ మామగారు అంత ప్రశాంతంగా వెళ్లిపోకుండా తనను నిలవదీసి ప్రశ్నిస్తే తానేమని జవాబుచెప్పేవాడు? తనకూ లక్ష్మికీ ఉన్న సంబంధంగురించి (ప్రత్యక్షంగా తెలుస్తూఉండడం వల్ల) అసత్యం ఆడడానికి ఎంతమాత్రమూ సావకాశం లేదే! ఇంతకూ రాజేశ్వరిలోని దోషమేమిటీ అని అతను గట్టిగా అడిగితే తాను చెప్పే కారణ మేమిటి? ఎంత ఆలోచించినా రామనారాయణకు నాటిరాత్రి జరిగిన విశేషాలకు లవలేశమూ పొందిక కనిపించలేదు.

మర్నాడు ఉదయం అతనికి తెలివి వచ్చేసరికి తాను తనగదిలో పడకకుర్చీలో ఉన్నాడు. ఎదుటి మంచంమీద లక్ష్మి నిద్రపోతూంది. గదిలోని ఇంకొక మంచం గోడకు చేరబెట్టిఉంది. మరి రాజేశ్వరి ఏదీ?

లేక నిన్న రాత్రి తాను కలగన్నాడా ? కొంచెం నిద్రా నించి చూచేసరికి, సగం తీసిఉన్న గదితలుపు సందులోనుండి పావడిలో నేలను పండుకొని ఉన్న రాజేశ్వరి కనబడింది. అతని మనశ్శకట మొక్కక్షణం నిశ్చలమయింది. చీటికీ మాటికీ తనతో పోట్లాడే రాజేశ్వరిలో ఇంత స్త్రీత్వ ముందా ? ఆమె యీ మాత్రము స్థలం దొరకకా తనదగ్గరకు వచ్చింది ? ఇంతకూ ఆమె వెళ్లేటప్పుడు తన అనుమతిని తీసుకునే వెళ్లిందే! ఆమెను తృప్తిపరచలేకపోవడంలో తన తప్పేమీ లేదు కాని, యీ రకంగా వేధించటంలో తనపట్ల న్యాయమేదీ ?

అతనికి రోజూ నిద్రలేవగానే తలదువ్వుకోవడం ఈ మధ్య లక్ష్మి వచ్చినదగ్గరనుండి అభ్యాసమయింది. ఇవాళ ఏమిటో ఉత్సాహంగా లేదు. అయినా అద్దం, దువ్వెనా అందించవలసిన లక్ష్మి యింకా నిద్రలేవనే

ఏదో దొంగతనం చెయ్యబోయేవాడులా మెల్లిగా అడుగులువేసి వెళ్లి, ఒక్కక్షణం సంశయించి, మృదువుగా స్పృశిస్తూ ఏకాంతం చెప్పినట్టుగా "లక్ష్మీ లే లే, తెల్లవారింది. కాఫీ" అంటూ ఉండగానే సోగలైన కళ్లు సగం విప్పి, "ఇవాళ ఏమో నీరసంగా ఉంది; కొస్త కుంపటి అంటించి, నీళ్లుపడేద్దూ, నేను లేచి కాఫీ కలిపేస్తాను"అని మళ్లీ కళ్లుమూసుకుంది.

రామనారాయణకు యీ పద్ధతేమీ క్రొ. కాదు. కాని ప్రస్తుతస్థితిలోమాత్రం అతిచనవువల్ల లక్ష్మి తనకేమో తీరని అవమానం కలిగించినట్టు తోచింది. ఏమీ మాటాడకుండా ఎటో తనకే తెలియకుండా వీథిలోనికి బయలుదేరేడు.

పార్కుగుండా బస్సుస్టేండును సమీపించేవరకు నికి తన శరీరంమీద స్మృతే లేదు అనాలి. అక్కడ ఎన్నో మగగొంతులను ఛేదించుకుంటూ ఒక నం వినిపిస్తోంది. రామనారాయణకు ఇటు వంటివంటే స్వాభావికంగా చాలా అసహ్యం. కాని ఆనా డాగోలకు కారణం ఏమిటో తెలుసుకోవాలని బుద్ధిపుట్టింది. పదిమందిని పాతికప్రశ్నలడిగి అతడు గ్రహించిన విషయం సారాంశం ఏమిటంటే, ఒక భర్త తన మొదటిభార్యనూ, పిల్లలనూ వదలి ఇంకొక స్త్రీని లేవదీసుకొనిపోతున్న సందర్భంలో (హక్కుగల) భార్య వారిని నిరోధించడానికి చేసే ప్రయత్నమే ఆగోల అని. ఆ రెండవస్త్రీముఖంలో గడియకో క్షణానికో ఉరితీయబడే వ్యక్తిముఖంలో కనిపించే దిగులు ద్యోతకమౌతున్నది. అందరూ తలాఒకరీతిని ముగ్గురకూ కర్తవ్యం ఉపదేశిస్తున్నారు—ఒకరి మాట ఒకరికి వినిపించకుండా. ఈమాత్రం తెలుసుకొనేసరికి, శారీరకంగా పడిన శ్రమవల్లనేకాక, మానసికంగా మళ్లీ విజృంభించిన భావనాకల్లోలంవలన అతనికి ఎంతో అలిసిపోయినట్లనిపించింది. నెమ్మదిగా వెళ్లి దగ్గరగా వున్న కాఫీహోటలులో ప్రశించి, కొస్త టిఫిన్ తిని కాఫీతాగేపర్యంతమూ అతను తేరుకోలేదు.

కిల్లీదుకాణందగ్గర సిగరెట్టు అంటిస్తూఉండగా రామంగారు కనిపించి "మీయింటికనే బయలుదేరేను—శా గారు నాఆర్టికిలు చూస్తా నంటున్నారు—నాభారతి—"

రామనారాయణకు ఇంటికి వెళ్లడమంటే ఏదో అవ్యక్తమయిన భయం వేసింది. "మేనేజరు త్వరగా రమ్మని కబురుచేసేడు. ఇంట్లో కాఫీ ఆలస్యమవుతుందని ఇక్కడ తీసుకొనివెళ్తున్నాను. నేను ఆఫీసుకు వెళ్లేటప్పుడు మీయింట్లో పడేస్తానులెండి. మరి సెలవ్"అంటూ అతడు నడక సాగించేడు. అత డానాడు సాయంవేళనుకూడా ఇంటికి వెళ్లలేదు. సినీమా (మొదటిఆట)కు వెళ్లేడు.

సినీమాలో కథానాయకుని తండ్రికి వియ్యంకునితో పడక, పుత్రునికి పునర్వివాహం చేస్తాడు. అతని అనంతరం కొడుకు యథేచ్ఛాచారి అయి, తన

మిత్రుని పునర్వివాహం చేసుకొన్న తన మొదటిభార్యను ఫలానా అని తెలియకుండా లేవదీసుకొని వస్తాడు. ఆమె అతని తమ్మునితో కలిసి కుట్రచేసి, అతనికి విషమిస్తుంది. అతని రెండవ భార్య నూతిలో పడి పోతుంది. వదినకూ మరిదికీ పడరక, ఒకరి నొకరు రివాల్వర్లతో కాల్చుకోవడంతో కథ సాంతమయింది. సినీమా పేరు "అన్యాయ్ !"

అసలే కలవరపడివున్న అతని మనస్సును సినీమా మరీ కలవరపరచింది.

హాలులోనుండి బైటికి వచ్చేసరికి ఉక్క, కలవరపాటు, సంఘర్షణలేకాక చల్లదనము, హాయి, శాంతి అన్న లక్షణాలుకూడా పంచభూతాత్మకమయిన ఈ మన ప్రపంచకంలో మిగిలిఉన్నాయన్నట్టుగా ఉంది వాతావరణం. ఎంతటి హృదయసంక్షోభాన్నయినా మరపించగలదిగా ఉంది ఆనాటి వెన్నెల అనడానికి అతని మనస్సు అతిలోకమయిన ఆనందంతో తొణికిసలాడడమే తార్కాణం. కాని వెన్నెల ఎంత తీయనిదో అంత పలచనిదికూడా. దానివలన కలిగే నిషా అట్టేసేపు నిలవదు. అలా నిలవడానికి వాతావరణంలోని నందప్రదలక్షణాలతో పాటు మానవలోకానికి సంబంధించిన ఆనుకూల్యంకూడా ఉండాలి.

ఇంటిని సమీపించే దారిలో చివరిమలుపు తిరిగే వేళకు తటాల్న స్మృతిలోనికి వచ్చింది అతనికి తన యింటి పరిస్థితి. దానితో వెన్నెలమైకం వదిలి పోయింది. ఒక్కొక్క అడుగు వేస్తున్నకొద్దీ అతని అనుమానం ఎక్కువ కాసాగింది తలుపేమని పిలవడమా అని.

దగ్గరగా వేసిఉండడంవల్ల తలుపు పిలువవలసిన అవసరమే లేకపోయింది. ఏదో అవసరమయిన పని ఉన్నట్టు తన గదిలో సరభసంగా ప్రవేశించేడుగాని తర్వాత ఏమి చేయడానికీ తోచలేదు.

టేబిలుమీద చిన్నది చేయబడి ఉన్న దీపాన్ని కొంచెం పెద్దది చేసేడు. అద్దంలో తన మొగం తనకే అసహ్యంగా ఉంది. అంత వికృతంగా ఉండడానికి కేవలం ఒక్కనాడు తలదువ్వుకోకపోవడంవల్లా, భోజనం చేయకపోవడంవల్లా మాత్రమే సంభవించదు.

అతడా దీపపు వెలుగులో ఏదో నిశ్చయంగా పోయిందని తెలిసిన వస్తువును ఆత్మశాంతికోసం వెతుకుతున్నట్టుగా పరిశీలించేడు. అన్నీ నిర్జీవపదార్థాలే. ఇంతసేపుగా అతడు లక్ష్మిని ఎప్పుడూ చూడకుండా ఉండలేదు. ఇన్నాళ్లూ మధ్యాహ్నం కాఫీకికూడా ఇంటికి (ఆఫీసుకు సుమారు మైలుదూరం ఉన్నా) వచ్చేవాడు. లక్ష్మి ఏదీ ? తాను వెళ్లిపోయిన తర్వాతగాని ఇద్దరూ పోట్లాడుకున్నారా ! లక్ష్మి వివాదపడే మనిషి కాదుగాని, రాజేశ్వరిమాత్రం—ఏమో ఇటీవల ఆమెకూడా మారిందేమో ?

అతడు ఈ ఆలోచన పూర్తికాకమునుపే అలవాటు ప్రకారం స్నానానికని నూతిదగ్గరకు వెళ్లేడు. వెనుక రాజేశ్వరిహయాములో అతనికి స్వయంగా నీళ్లు తోడుకొని పోసుకోవడం మామూలే. కాని యీమధ్య లక్ష్మి అప్పటికప్పుడు నీళ్లుతోడి వేడినీళ్లతో కలిపి అందించగా స్నానం చెయ్యడం అభ్యాసంచేసింది. ఇవాళ మళ్లీ నీళ్లు తోడుకోవాలేమో ? ఈ అనుమానానికి వెనుక లక్ష్మిగాని ఇంట్లోఉంటే ఇప్పుడయినా కనిపించకపోతుందా అన్న ఆశ అవ్యక్తంగా లేకపోలేదు. ఒక్కనిముషం ఆకాశంవేపు చూసి యిక మరి లాభంలేదని బాల్చీ నూతిలో వెయ్యబోతూఉండగా, వెనుకనుండి "అక్కడ బిందెలలో నీళ్లు మీకోసమే. ఈపాటికి బాగా చల్లారిపోయేయి కాబోలు" అని రాజేశ్వరి మెల్లగా అని లోనికి వెళ్లిపోయింది.

తిరిగివచ్చినతర్వాత ఆమె తనతో ఆడిన మొట్టమొదటిమాట అదే. ఆమెకంఠస్వనం ఎంత కొత్తగా ఉంది ! సారెగదిలోసైతమూ ఆమె అంత తడబడలేదు తనతో మాట్లాడడానికి.

స్నానం చేసి లుంగీ కట్టుకొని, ఏమి చేయడానికీ తోచక పడకకుర్చీలో కూలబడ్డాడు. ఏదయినా

పుస్తకం చూద్దామని తీసేసరికి వచ్చింది పాత ఫిల్మిండియాపత్రిక. ఆపుస్తకాన్ని చూడగానే అతని తలపు లోనికి వచ్చింది ఆనాడు అందులో బొమ్మలు చూస్తూఉండగా ధైర్యం చేసి మొదటిమారు లక్ష్మిని ముద్దుపెట్టుకొన్న పరిస్థితి సర్వమూ. ఆనాడు అందులో నర్గీసుబొమ్మకు ఎదుటి పేజీమీద తనపేరూ, లక్ష్మిపేరూ రాసి, బ్రాకెట్ పెట్టి తారీఖు వేసేడు. గూఢార్థవిచిత్రకవిత్వాన్ని చూసుకొని కృతికర్త పొందే ఆనందాన్ని పొందేవాడత డిదివరకు ఆ రెండుపంక్తులనూ చూసి. నేడుమాత్రం ఆ రెండుపంక్తుల లోనే తన అవినీతి, అన్యాయమూ అంతా ఘనీభవించి నట్టు రూపించింది. అనుకోకుండానే పుస్తకాన్ని మూసి ఏదో ఎడతెగని ఆలోచనలో పడ్డాడు.

గదిఅవతలినుండి బ్రతిమాలుకున్నట్టుగా రాజేశ్వరిగొంతు "భోజనానికి లేవరూ ?"అని వినపడింది. అతడు త్రుళ్లిపడి లేచి, వెళ్లి పీటమీద కూర్చున్నాడు. అతడు భోజనం చేస్తున్నాడేగాని, మనస్సు మనస్సులో లేదు. ఏనిముషంలో ఏమి ఉప్పెన వస్తుందో అని భయం. అందులోనూ, రాజేశ్వరి తనలోని క్షోభనూ, క్రోధాన్నీ వాగ్రూపంగా మొదటనే వెలార్చిఉండేమాటైతే అతని కీఆందోళన లేకపోవును. కాని, ఆమెకు అసాధారణములయిన యీవినయమూ, వాగ్రహితవ్యవహారమూ అతని కేదో ఉరుమని పిడుగింకా ముందున్నదనే భయాన్ని కలిగిస్తున్నవి.

"మరి అన్నం వద్దు. మజ్జిగ" అన్న మాట వినా అతడు భోజనసమయంలో నోరు మెదపలేదు. రాజేశ్వరి కూడా తాను మాట్లాడడానికిగాని, అతనిని మాట్లాడించడానికిగాని ఏమీ ప్రయత్నించలేదు. అతనికి మజ్జిగ పోసి గబగబా గదిలోనికి వెళ్లింది.

రామనారాయణకు చెయ్యి కడుక్కున్నాక ఒక చిన్న ధర్మసందేహం కలిగింది. ఆమె ఇప్పుడు గదిలో ఉందికదా ? తానూ లోనికి వెళితే ? ఇంత కాలంగా మెరుస్తూ ఆగమనంచేస్తూ ఉన్న గాలివాన ఒక్కమారుగా వస్తుందా ?

ఒక్కనిముషం తటపటాయించి, "ఎప్పటికేనా తప్పేది కాదుకదా ! అదేదో త్వరగా అయిపోతేనే మే"లన్న మొండిధైర్యంతో, అతడు గదిలో ప్రవేశించాడు. కాని ఇప్పుడుకూడా అతనికి ఒక విధమయిన ఆనందమయాశాభంగమే ! అతను తొందరగా వెళ్లి అన్నిటికీ నేను సిద్ధంగా ఉన్నానన్న సరణిని మంచం మీద కూర్చున్నాడు. ఆమె అధోముఖంగా, వణకుతూ ఉన్న చేతితో, తమలపాకుచిలకలూ వక్కపొడీ ఉన్న చిన్న వెండిపళ్లాన్ని అతని చేతికి అందించి వెంటనే అవతలకు వెళ్లింది. ఇంటికి వచ్చినదగ్గరనుండీ "లక్ష్మి ఏదీ ?" అని తననుతాను అనుక్షణం ప్రశ్నించుకొంటున్న ప్రశ్న ఇప్పుడుకూడా వెలికివచ్చింది కాదు. ఇక మరి ఈ సందేహం తీరడ మెలాగు ? అయినా రాజేశ్వరి ఎంతలా మారిపోయింది ! అంతే కాదు. ఆమెలోని పరిణామం తనలో ఎంత పరివర్తనాన్ని తీసుకొనివచ్చింది !

ఆనాడతనికి మామూలుకంటేకూడా వేగమే నిద్రపట్టింది. కాని ఏదో ఇదమిత్థమని తేల్చుకోడానికి వీలులేని గాభరా కలిగించే కలతో తెలివివచ్చింది. లేచి, టేబిలుమీద మరచెంబులో ఉన్న మంచినీళ్లు తాగి, దీపం కొంచెం పెద్దదిచేసి, వాచీవైపు చూసేడు. టైము పన్నెండున్నర అయింది.

మళ్లీ దీపం తగ్గించి, వెళ్లి, మంచంమీద కూర్చునేసరికి అతనికి నిద్రమత్తు పూర్తిగా వదిలింది. వెన్నెల కిటికీలోనుండి మంచంమీద సగంవరకూ పడుతున్నది. దూరాన ఎవరో ఫ్లూట్ వాయిస్తున్నారు. మొదట్లో అదేదో అతిలోకనినాదంవలె వినిపించింది. కాని కొంచెం నిదానంగా వినేసరికి ఎవరో సాధకం చేస్తున్నవారి వాద్యమని తెలిసింది. ఏమయితేనేం ? అంత వెన్నెలలో, అంతరాత్రప్పుడు, అంతదూరమునుండి వినిపించే సంగీతము పారవశ్యప్రదము కాక పోవడ మెలాగు ?

హఠాత్తుగా సంగీతము ఆగిపోయింది. దాంతో ప్రక్కగదిలోనుండి ఏవేవో గుసగుసలు వినిపించ

సాగాయి. మాటలు స్పష్టంగా తెలియడంలేదు గాని, ఆ మాటలాడుతున్నది లక్ష్మీరాజేశ్వరులని గ్రహించడానికి అతనికి ఎక్కువసేపు పట్టలేదు. అతనిని అనూహ్యమయిన ధైర్యమేదో ఆవేశించినట్టనిపించింది. వెంటనే "లక్ష్మీ!" అని పిలిచేడు. ఇప్పుడతని గొంతు నిండుగా, గంభీరంగా ఉంది. అప్పటికప్పుడే సగం

నిద్రావస్థలోనూ, సగం జాగ్రదవస్థలోనూ ఉంది లక్ష్మి. ఆమె రాజేశ్వరి చెప్తున్న కొన్ని మాటలకు 'ఊఁ' అనటంకూడా లేదు. ఆమెను కదిపిలేపి, "ఆయన పిలుస్తున్నా"రని రాజేశ్వరి ఏకాంతంగా అన్నమాటలు మధ్యనున్న సన్నని సావడిని దాటి సకుతూహలములయిన అతని చెవులలో పడకపోలేదు.

ఆ నిద్రాలసతలోనే అతని మంచాన్ని ఆనుకొని నిలిచి, "ఏం బావా, పిలిచావా?" అంది లక్ష్మి ఎప్పటి చనవుతో.

అత డామెచేతిని రెండు చేతులతోనూ పట్టుకొని, "ఏం, ఇంకా నిద్రపోలేదూ?" అంటున్నప్పుడే

తెలుసును తాను యీ సమయంలో వేయవలసిన-అథమం వేయదలుచుకున్న ప్రశ్న అది కాదని.

"ఇంతసేపూ ఏవో కబుర్లు చెప్పుకుంటున్నాం నేనూ, అక్కయ్యాను. ఇప్పుడే కొంచెం నిద్రపడుతున్నది".

అతనికి యీ సమాధానం తృప్తికరంగానే ఉంది. ఇంకా ఎన్నో సంగతు లడగాలనిపించిందిగాని, అవతలిగదిలో రాజేశ్వరి మేలుకొనిఉందన్న స్మృతి అతనిని యథేచ్ఛగా మాటాడనీయలేదు. చివరికి ఎల్లాగయితేనేం, ధైర్యంచేసి అన్నాడు: "ఇందాకా నువ్వు కనిపించలేదేమి? ఎక్కడికైనా వెళ్లేవేమో ననుకున్నాను."

"ఎక్కడికి వెళ్తాను నేను? అయినా నువ్వు రోజల్లా కనిపించనివాడివి, రాత్రి పదిగంటలకు వస్తావనిమాత్రం ఎవరయినా కలగనగలరా ఏమిటి?"

రామనారాయణకు ఏమనాలో తోచలేదు. కొంచెంసేపు ఊరుకొని, "ఆగదిలో దీపం ఉన్నట్టు లేదే! చీకట్లోనే పడుక్కున్నారా?" అన్నాడు.

పైప్రశ్నకు ఆమె సమాధానం చెప్పేలోపునే అతని! మరొక ముఖ్యమయిన విషయం స్ఫురించింది. "లక్ష్మీ, మీయిద్దరికీ పక్కలున్నాయా? రెండుపరుపులూ ఇంకామీదే ఉన్నట్లున్నాయి—ఒకటి తీసుకోవలసింది' అన్నాడు.

"మేమిద్దరం అక్కయ్యపరుపు వేసుకొని నామంచంమీద ప న్నాము. చిన్నమంచం. ఇద్దరికి బాగా సరిపడదని నే నంటున్నా సరే, అక్కయ్య నాదగ్గరే పడుక్కుంటా నంది. ఇంకా అక్కయ్యను చిన్నతనమూ, సిగ్గూ వదలలేదు"అని ఆవులిస్తూ, "బాగా నిద్రవస్తోంది. నీకుకూడా రేపు ఆఫీసుంది. నువ్వూ నిద్రపో"అంటూ ఆమె చల్లగా వెళ్ళిపోయింది.

ఆమె వెళ్లి నిద్రపోయిన ఎంతసేపటికో గాని రాజేశ్వరికి నిద్రపట్టలేదు. ఆమెమనస్సులో అనంతములయిన ఆలోచనలు. అన్నీ తనకూ, భర్తకూ, లక్ష్మికీ సంబంధించినవే. లక్ష్మీరామనారాయణలలో ఎవరిమీదా ప్రసన్నభావము లే దామెలో. కాని, వంతుల ప్రకారము ద మనస్సులో క్రాస్ఎగ్జామినుచేసి, ఎవరు ఎక్కువ నిందార్హులో నిర్ధారించుకొనేలోపునే ఆమెకు నిద్రపట్టింది

రామనారాయణ నిద్రలేచేసరికి లక్ష్మి ఎప్పటిలాగే ఇంటిపనుల్లో (కాఫీసరంజామూ, వేడినీళ్లపొయ్యీ మొదలయినవాటిల్లో) నిమగ్న అయిఉంది. రాజేశ్వరి ఇంకా లేవలేదు. లక్ష్మి అతని స్నానానికి అలవాటు చొప్పున నీళ్లందించింది. అతడు బట్టలు వేసుకొనే లోపుగా కాఫీకలిపి ఇచ్చి "బావా, బజారుకు వెళ్లి సామాను తేవాలి. చీటీ, సంచీ ఇవిగో. కూరలు ముందుగా తెస్తే తక్కినవి ఇప్పుడో, సాయంత్రమో వీలునుబట్టి తెచ్చుకోవచ్చు"నంది.

అతడు మాట్లాడకుండా పైమీద వాణీ వేసుకొని సంచీపట్టుకొని బయలుదేరేడు.

లక్ష్మికి రాజేశ్వరీపునరాగమనం ఒక విధంగా సంతోషాన్నే కలిగించింది. రామనారాయణ ఎంత నిర్లక్ష్యంగా అస్పష్టంగా చెప్పినా, ఆమెకు రాజేశ్వరిస్వభావము అర్థంకాకపోలేదు. ఆమె పుట్టింట్లో ఒంటరిగా ఉండి పడుతున్న మనోవేదనను పట్టుదలే ప్రధానంగా ఎంచే రామనారాయణకంటె లక్ష్మి బాగా గ్రహించిం దనవచ్చు. తాను పరిస్థితుల తాత్కాలికోద్ధతివలన రాజేశ్వరివిషయంలో కొనసాగిస్తున్న అన్యాయలతికకు లవిత్రమువలె తోచింది లక్ష్మికి రాజేశ్వరీపునరాగమనం.

ఎక్కువ ఆలోచిస్తున్నకొద్దీ మరీ చిక్కులు కనపడతాయన్న జంకుచేతనో ఏమో, తనకు సంబంధించిన ఏ విషయమయినా, బాహ్యంగా సంతృప్తికరంగా ఉన్నంతసేపూ, లోతుకుపోయి ఆలోచించడం రామనారాయణకు అభ్యాసంలేదు. అతనికి లక్ష్మిరాజేశ్వరులు ప్రత్యక్షంగా ఎట్టి పోట్లాటలూ లేకుండానే కాదు, ఇతఃపూర్వమే పరిచయమున్న వారివలె ప్రవర్తించటం మొదట్లో కొంత ఆశ్చర్యాన్ని కలిగించినా, క్రమంగా సామాన్యమైన విషయంవలెనే కనిపించింది. కాగా అతని జీవితం ప్రస్తుపరిస్థితుల కనుగుణములయిన కొద్దిమార్పులతో మళ్లీ ఒక పద్ధతిలో పడ్డది. కాని, రాజేశ్వరి పుట్టింటిలో ఉన్నప్పుడు తాను లక్ష్మితో గడిపిన స్వల్పకాలమూ గతించిన ఆంధ్రవైభవాన్ని తలచుకొని నేటి ఆంధ్రుడు పడే ఆరాటాన్ని అతనిహృదయంలో కలిగిస్తుంది ఇప్పటికీ.

భర్తదగ్గరనుండి ఉత్తరమయినా లేకుండా, ఎవరెవరో తెలిసీతెలియనట్లుగా అన్న మాటలు తప్పనిసరిగా వింటున్నప్పటి మనోవేదన రాజేశ్వరికి కొంతవరకు చల్లారింది. ప్రమాదము ప్రత్యక్షంగా వచ్చినప్పటికంటే, తప్పకుండా వస్తుందని తెలిసిన పరిస్థితి మరీ వేదనావహంకదా! ఇప్పుడు మరేమీ సందేహంలేదు. రావలసిన ప్రమాదమేదో రానేవచ్చేసింది. ఇక ప్రస్తుతపు సమస్య అల్లా, గృహిణిగా తనకు ఉండవలసిన స్థానాన్ని పునఃప్రతిష్ఠించుకోవడమే.

లక్ష్మి తనతో కలిసిమెలిసి ఉండడమన్నది రాజేశ్వరి కలలోనయినా ఊహించలేని విషయం. ఆమెదృష్టిలో అది ప్రకృతివిరుద్ధంకూడా. కాని మనము ముందుగా ఊహించకపోయిన మాత్రాన విశేషాలను జరగకుండా నిరోధించలేముకదా! తన చెల్లెలు సరళకంటే కూడా ఎక్కువ చనవుగా తనతో మాట్లాడుతోంది ఈ లక్ష్మి. ఈమె ఎవరు? ఈమెకూ, తనకూ ఉన్న సంబంధం ఎల్లాంటిది? తాను లేని సమయంలో తన భర్తను అధర్మపథంలోనికి ఆకర్షించిన ఒకానొక స్త్రీమాత్రమేకదా యీమె? సహజంగా తానంటే ఆమెలో సిగ్గూ, జంకూ మొదలయిన లక్షణాలు కలగాలి. అధమం ఆగ్రహమయినా రావాలి. ఏదయినా బాగుంది. దేనికయినా కొంత సందర్భశుద్ధి ఉంది; కాని, ఇల్లా అసందర్భంగా, క్షుద్రంగా తనతో ఖుత్తుకలపడానికి యత్నించడమేమిటి? ఇతనిని ఎల్లానూ వశపరచుకొన్నానుకదా, ఇక దీనినికూడా స్నేహం నటించి లోబరచుకొంటే ఈ ఇంటిలో ఏకచ్ఛత్రాధిపత్యం వహించవచ్చునని కాబోలు దాని ఆశయం? అవును. అంతే. కాకపోతే ఆమెకు నాతో స్నేహం చెయ్యవలసిన అగత్యం ఏముంది? కాని, ఈమాత్రపుటూహలను గుర్తించేపాటి తెలివితేటలూ లేకపోవాలీ కర్మం! అయినా జనికీ తొందరపడకూడదు. దీనికి పైయెత్తుమీదనే వెళ్లాలి. ముందు అనిక చూసుకొని, క్రమంగా మన స్థానాన్ని బలపరచుకోనిదే ప్రత్యక్షయుద్ధంలోకి దిగితే పరాజయం తప్పదుకదా?

అన్నిటికంటే విచిత్రమయినది ఆయనకు నన్ను కాదని దానిని తెచ్చుకోవలసిన ఆవశ్యకత కలగడమే. ఇంతకూ అదేమయినా అప్సరసా? దానిపాటి చక్కగానయినా లేనా నేను? పోనీ, దానివలన తన కేమయినా లాభిస్తుందా అంటే, ఏమాత్రం గనుక? ఆ విషయంలోనైనా, ఇప్పటికే అయిదారువేలు దాదాపు ముట్టజెప్పారు; ఇంకా మరొక పదివేలయినా ఏదోఒకరూపంగా ఇవ్వాలని చూస్తున్నారు నాన్నగారు. ఇక, వివాదాలు ఏవో వచ్చేయంటే, భార్యా

# సౌందర్యముయొక్క ప్రాముఖ్యత నిలబెట్టుట

ముఖ్యమైన అన్ని విషయాలలో వనితలకు చిన్నతనములో తమ తల్లులకంటె మంచి సలహాను ఎవరు యివ్వలేరు. ఈ తల్లి తనకుమార్తెకు ముఖ్యముగా బోధించినదేమంటే, పియర్సు సబ్బు నిర్మలమైన నీటితో తన చర్మసౌందర్యమును నిలబెట్టుకొనుటయే. ఈ పద్ధతిని తన తల్లివద్దనుంచి నేర్చుకొని అనుసరించుచున్నది. ఇదే ఆమె సౌందర్యము చెడకుండా వుండుటకు కారణము. తన కుమార్తెకూడా యీ విధంగానే చేయుచున్నది. కనుక ఆమెయొక్క సౌందర్యము కూడా ఏమాత్రము చెడకుండా వుంటుంది.

ఇండియాలో నలభై సంవత్సరములనుంచి అందమైన స్త్రీలు ప్రత్యేకముగా పియర్సునే వాడుచున్నారు. దీని పరిమళము, మృదువైన నురుగు దీనికి సబ్బులలో ప్రాముఖ్యత నిచ్చినవి.




## పియర్సు సబ్బు

శాశ్వతముగా సౌందర్యమును కాపాడుటకు

TQ. 39-172 TL.  A. & F. PEARS, ISLEWORTH, ENGLAND

భర్తల మనుకొన్నతరువాత ఎవరికి రావు అభిప్రాయభేదాలు? అంతమాత్రంలో ఒకరికి ఒకరు కాకుండా అయిపోవడమేనా? కాదు, మహాఅనుకుంటే, తనకు నాతో ఏవో స్పర్ధలు వచ్చేయే అనుకొందాం. వస్తే నన్ను సాధించాలి, లోబరచుకోవాలి; గాని మధ్యను దానితో సంబంధం పెట్టుకోవడం ఏమిటి? ఓహోహో, ఏమిపౌరుషం? తానంటే జాతీ, నీతీ, పరువూ, ప్రతిష్ఠా సర్వమూ మంటిలోకలిపి యథేచ్ఛగా ప్రవర్తించేరుగాని, అందరమూ అలాగే సిగ్గూ, లజ్జావిడిచి నడుచుకోలేముకదా! ఫలానావారి అమ్మాయి ఇల్లాగా అల్లాగా అని నలుగురినోటా పడడమా? ఛీ, తలుచుకుంటేనే ఒళ్లు గగుర్పొడుస్తోంది.

—ఇవీ ఆమెభావనావాహినిలో ఆడుతున్న స్వల్పసంఖ్యాకతరంగశీకరాలు.

* * *

ఇంకా రాజేశ్వరి ప్రత్యక్షయుద్ధపరికరాలను సమకూర్చుకొంటూనేఉంది. కాని, ఒకపక్షంవారు సన్నద్ధులయేవరకూ సన్నద్ధులయిన రెండవపక్షంవారు ఊరుకోనేఅంతటి ధర్మబద్ధములు కావుగదా నేటి యుద్ధాలు! రాజేశ్వరికి పరిస్థితులు పూర్తిగా అవగాహనకాకమునుపే, ఇవతలనుండి, లక్ష్మి శాంతిసమరపు భేరీ మోగించింది.

ప్రయత్నలోపంవల్లనో, ప్రతిస్పర్ధిలోని బలాధిక్యంవల్లనో క్రమంగా రా[illegible] ఎదటివారేర్పరచిన సంధిషరతులకు ఒడంబడకతీరని పరిస్థితి వచ్చింది. అయినా ఆమె సంధినియమాలనుగురించి ఇంకా తనలోతాను తర్కిస్తూ కాలహరణంచేస్తున్నది. ఈలోపున రాజ్యం ఏపక్షంవారికీ హక్కులేని ప్రజాస్వామ్యమైపోయే సూచనలుకూడా చాలా కనిపిస్తున్నాయి కాలమానస్థితులలో.

రాజేశ్వరికి తనయెడల ఆదృతికలిగించుకోవడం లక్ష్మికి అట్టే కష్టంగా తోచలేదు. కాని, తనను రామనారాయణనుండి వేరుపరచుకొని, రాజేశ్వరిని తన స్థానంలో ప్రతిష్ఠించడమన్నదే ఆమెకు రానురాను అసాధ్యమేమోననే భయంకూడా కలిగించే సమస్య అయింది. ఈసందర్భంలో ఆమెలోని నిగ్రహశక్తే పనిచేసిందిగాని, అనుగ్రహగరిమ ఉపయోగించింది కాదు. ఆమె రామనారాయణవ్యక్తితో అభిముఖంగా సంబంధమున్న పనులన్నీ రాజేశ్వరివంతుకు విడిచిపెట్టింది. కాని, అందుకు ఫలితంగా, అతడు విసుగుకోవడమూ, ఒక్కొక్కనాడు భోజనానికి సైతమూ ఇంటికిరాకపోవడమూ మాత్రమే జరిగేవి. ఒకమారు విసుగుకొనిన తరువాత అతనికంటపడడానికే రాజేశ్వరికి గుండె దడదడలాడేది. అల్లాటి సమయాల్లో అతనిని సమాధానపరచే భారం సంపూర్ణంగా లక్ష్మిదే

సాధారణంగా స్త్రీలందరిలోనూ మాతృత్వచ్ఛాయ లుంటాయి; అందులోనూ కొందరిలో అవి మరీ స్ఫుటంగా కనిపిస్తాయి. అట్టివారిలో లక్ష్మి ఒకతె. ఆమె .రామనారాయణకని చేసే ప్రతిపనిలోనూ భార్యాత్వపు పాళ్లకంటె మాతృత్వపుపాళ్లు చాలా ఎక్కువ. అందుకనే ఆమె వరాసగా రెండు మూడురోజులు కనబడకపోతే అతడు ఎంతో తల్లడిల్లిపోయేవాడు. తన ఆందోళనను ప్రకటించడానికి వేరే సాధనమేమీ లేక(తగినంత కారణం లేదని తనకూ తెలిసినా) ఎదుటనున్న రాజేశ్వరిమీద విరుచుకుపడేవాడు.

రాజేశ్వరి పూర్వంవలె రామనారాయణతో మాటకుమాట చెప్పి వివాదపడటం లేదు; కాని అతను ఆడిన ప్రతిమాటకూ సమాధానంగా పదిమాటలు మనస్సులో అనుకొంటూనేఉంది. అయినా బాహాటంగా అతనితో జగడమాడితే తనను లక్ష్మి తొందరపాటుమనిషి అనుకొంటుందేమోనని ఆమెభయం. లక్ష్మిపట్ల ఆమెకు మొదటఉన్న అభిప్రాయాలకూ, నేటిఅభిప్రాయాలకూ ఎంతో ఎడం ఉంది. కాని ఆమెలో రామనారాయణమీద మొదట్లో ఉన్న అభిప్రాయాలే ఉన్నాయి నేటికీ. ఇప్పటికీ అతనిలోని అనంతములయిన లోపాలను, పేదరికాన్ని అతనిచేత ఒప్పించి తన్మూలంగా అతనిని స్వాధీనుణ్ణి చేసుకోవాలనే ఆమెఆశయం. ఈరకపు భావనలలోని గుణదో

పోలు ఎల్లా ఉన్నా వాటి సాహాయ్యమున పరిశీలించి నప్పుడు రామనారాయణస్వభావంవంటి గ్రంథ ములలో పులులూ, కొండచిలువలూ, తిమింగిలాలూ మాత్రమే గోచరిస్తాయి ప్రతిపుటలోనూ.

* * *

రామనారాయణను మహామేధావి అనలేము గాని, అతని ధారణాశక్తినిమాత్రం మెచ్చుకోకతీరదు. ఒకమారు అతని మస్తిష్కంలో ప్రవేశించిన ఏ అంశ మయినాసరే, అందులో స్థిరమైపోవలసిందే. ఈ శక్తి అతనికి విద్యార్థిగా ఉన్నప్పుడు ఎంతో ఉపకరిం చింది. ఒకప్పుడు మేష్టర్లకి కోపం తెప్పించేదికూడా ఈ శక్తే. కాని, ఆఫీసుపనిలోమాత్రం యీ శక్తి అతనికి విపరీతమయిన ప్రాముఖ్యాన్నిచ్చింది. పని చేయడం మొదలుపెట్టిన ఈ అయిదారు సంవత్సరాల లోనూ కంపెనీకి సంబంధించిన ఎన్నో విషయాలను పదిలపరచే డతడు తన మెదడులో. అందువల్ల ఆఫీ సులో ఎవరికి ఏ రూలులో సందేహం వచ్చినా రామ నారాయణదగ్గరకు రావలసిందే. అయితే, ఆ విషయా లేమీ రామనారాయణ సృష్టించినవి కావు; రిఫరెన్సు పుస్తకాలలోనివే. కాని ఆ పుస్తకాలకు బోధనాశక్తి లేదు. కేవలం నాటకంలోని పాత్రలవలె వన్నెమో రులుపాడడమే వాటికి రావడంచేత వాటినుండి విషయసంగ్రహణ చేయడం చాలా శ్రమసాధ్య మయిన పని. ఆ శ్రమను అక్కరలేకుండా చేస్తు న్నాడుకదా అని రామనారాయణమీద గౌరవమూ, అభిమానమూ.

అతని కున్న గౌరవం ఆఫీసుసరిహద్దులలో నిలిచిపోలేదు. మిత్రమండలిలోకూడా అతనికి మంచి పేరుంది ఒక నిశితుడూ, నిర్మొగమాటస్థుడూ అయిన విమర్శకుడుగా. అతని విమర్శనలేవీ పుస్తకాకృతిని పొందలేదు. అధమం పత్రికలలోనయినా తరచూ వచ్చేవికావు. కాని మిత్రమండలిలోమాత్రం అతని విమర్శనలంటే ఎంతోగురి. కొందరు మిత్రరచయిత లతని సలహాల ననుసరించి తమ రచనలను సవరించు కోడం, మార్చుకోవడం చాలామందికి బాగా తెలిసిన అంశమే. అయితే అతనివలన సంస్కృతినపేక్షిస్తూ అతనికంటె ప్రత్యక్షంగా చాలాతక్కువగా వున్న వారి పేర్లపాటికూడా అతని పేరు విస్తరించకపోవ డము ఒకరిద్దరు ముఖ్యమిత్రులకు మనఃకంటకంగా ఉం డేది. వారు "వాళ్లకూ వీళ్లకూ సలహాలిచ్చి అమూల్య ములయిన నీఅభిప్రాయాలను గాలికి వదిలేకంటె నీవే వాటికి ఆకృతినిస్తే? ఎంత బాగుంటుంది! నీవంతు నువ్వు రాసిపడేద్దూ! తక్కిన ప్రచురణభారమంతా మాది" అనేవా రప్పుడప్పుడు. కాని రామనారా యణను ఆక్రమించుకొనిఉన్న స్వప్రకృతి అంత మాత్రంలో పలచబారేటంతటి తేలికైనది కాదు.

"ఎందుకులేద్దూ; ఇంతమంది రాస్తున్నారు, ఇన్ని మహాగ్రంథాలున్నాయి. నిజంగా మనం ఏశాస్త్రంలోగాని, కళలోగాని ఒక చిన్నభాగా న్నైనా సంపూర్ణంగా అర్థం చేసుకొందుకు మన ఈజీవితాలు చాలవే! ఇక మనము మన యీ మిడి మిడిజ్ఞానాలతో విమర్శనలూ, సంస్కరణలూ ఏమిటి? కాక, నామట్టుకు నాకు స్వతంత్రంగా అభిప్రాయా లేమీ ఉన్నా యనుకోను. నాది అంతా ఫోటో గ్రాఫిక్ ప్లేటు వంటి తత్వము. ఎదుటపడిన ప్రతివస్తు వునూ ఛాయాకాంతుల వ్యత్యాసాలతో పరిగ్రహిం చడమే నాపని." — సుమారు ఇదేపద్ధతిని ఉన్న అతని ధోరణిని విని స్నేహితు లిదమిత్థమని తేల్చుకో లేకపోయేవారు.

అసలు అతని వాగ్వైఖరిలోని ప్రత్యేకత ఏమి టంటే, అతడు మాటాడినా వాదించినా సామాన్య ముగా ఒకే లాగుండేది. సాధారణంగా ఎవరయినా వాదిస్తున్నప్పుడు అతడు కలుగజేసుకోడు. సద్దు చల్లారిన వెనుక ఎదుటివారి సమాధానముల నపేక్షిం చని, ప్రశ్నపరంపరాపూర్ణమయిన ఉపన్యాసంవలె ఉండేది అతని ధోరణి. అతని మాటలతీరు ఎదుటి వారిని విమోహితులను చేసి స్వవశులను చేసుకొనే పద్ధతిదికాక, వారిని అనేక రంగములలో తిప్పి,

తబ్బిబ్బుచేసి, మాటాడడానికి సందివ్వని తొందరతో కూడిన మహాప్రవాహం వంటిది. అందుచేతనే క్రొత్త వారికి అతని మాటలు కొంచెం కటువుగా తోచేవి. పాతవారికికూడా, తరువాత ఎంతసేపటికోగాని అతని మాటలలోని యథార్థపరత, పరసహిష్ణుత గోచరించేవి కావు. కాగా అతనిని అర్థంచేసుకొని మెచ్చుకుందుకుకూడా, వ్యక్తిగతపరిశీలన పూర్వకమయిన సాహచర్యం చాలా అవసరము.

ఇంతగా ఎందుకు చెప్పవలసి వస్తున్నదంటే అతనికి యీమధ్య మిత్రమండలితో—అందులోనూ సాహిత్యోపాసక సంఘంతో సంబంధము బలవత్తరమౌతూంది. విద్యార్థిదశలో ఉన్నంత కాలమూ సంగీతసాహిత్యసాధనలోనే గడుపవలెనని అతని ఏకైకనిశ్చయం. కాని కళాశాలను వదలినవెంటనే అతని జీవితంలో అదివరకు అంత ముఖ్యంగా తోచని ఇంకొక లక్ష్యం వెలువడింది. అది పరాధీనతా వైముఖ్యము; స్వయం పోషణ భారవహన ప్రియత్వమూనూ. దానితో అతడు తప్పనిసరిగా ఉద్యోగంలో ప్రవేశించవలసి వచ్చింది. ఉద్యోగ విషయంలో దొరికినపాటి స్వాతంత్ర్యమే వివాహ విషయంలోనూ (తన చిన్నతనంలోనే తండ్రి నిశ్చయించి గతించడం మూలాన) లభించింది. ఉద్దేశాలు ఎల్లా ఉంటేనేం? అతడొక సామాన్యగృహస్థయేడు. మరీ సామాన్యుడయిన ఆఫీసుగుమాస్తాయేడు. అవడమేమిటి, అభిప్రాయాలతో సంబంధం లేని కాలసాగరాన్ని దైనిక పద్ధతి (Routine) అనే పడవతో ఈదుతున్నాడు.

విద్యార్థిదశలోని ఆశలూ, ఆశయాలూ అన్నీ కట్టిపెట్టి, ఇన్నాళ్లవరకూ తన గృహసీమను ప్రశాంతంగా చేసుకొందామన్న పట్టుదలతోనూ, ఆఫీసు వ్యవహారాలను కరతలామలకాలు చేసుకొందామన్న దీక్షతోనూ తన కాలాన్నీ, శక్తినీ సంపూర్ణంగా వినియోగించేడు. అతని ప్రయత్నాలలో ఒకదానిలో ఆఫీసువ్యవహారాలలో (ఆర్థికలబ్ధి లేక పోయినా) సంపూర్ణవిజయం; రెండవదాంట్లో గృహసీమను ప్రశాంతంగా చేసుకోవడంలో (సామాన్యసౌఖ్యానికి లోటులేకపోయినా) పరిపూర్ణపరాజయం. ఇవేమీ పెద్దసమస్యలు కావనీ, తాను న్యాయతః ఇంతకంటె ఉదాత్తములయిన విషయాలనే యోజించి, మూగప్రేక్షకుని స్థితినుండి నటకుని స్థితికి రావలసినదనీ అతనికి ఏదో అంతర్వాణి ప్రబోధించేది. కాని, చిన్నతనంనుండీ తల్లిదండ్రులూ, తోబుట్టువులూ లేని దైన్యమూ, సమీపస్థుల సంతతేర్ష్యానిరసనలకు ఫలితమయిన ఉత్సాహహైన్యమూ అతనిలో కొంతవరకూ జడతగా పరిణమించేయి. అందువల్లనే అతడు ప్రపంచాన్ని ఎప్పుడూ అనుమానంతోనూ, భయంతోనూ, ముందుకాపుతోనూ మాత్రమే చూడగలడు. ఈ రకపు వింతచూపే కొన్నిచోట్ల నిదానంగాను, కొన్నిచోట్ల నిర్లక్ష్యంగానూ లోకులనోట అనేక నామాంతరాలు ధరించింది.

ప్రస్తుతపు రామనారాయణదైనందినచర్యకూ, వెనుక లక్ష్మివచ్చిన క్రొత్తలోని అతని చర్యకూ కేవలం ఉత్తరదక్షిణ ధ్రువాల కున్నంత ఎడముంది. అప్పుడతడు రోజుకు ఏ ఒకటి రెండు గంటలో బైటికివచ్చేవాడు. అదీ తప్పనిసరైన బజారుపనో, అటువంటిదో ఉన్నప్పుడు మాత్రమే. అల్లాటి సమయాల్లో ఎవరైనా స్నేహితులు బలవంతంగా ఫలహారానికో, బాతాఖానీకో నిలిపితే అతనికి ముళ్లమీద ఉన్నట్టుండేది. అప్పుడు ఇల్లు కదిలిరావడమంటే ఎంత బెంగగా, కష్టంగా ఉండేదో, ఇప్పుడు ఇంటికి వెళ్లడమంటే అంత వెగటుగా, భయంగా ఉంది.

ఇటీవల ఉదయం కార్యాలయంలో రామనారాయణదే మొట్టమొదటి అటెండెన్సు. ఒక కప్పు కాఫీమాత్రమే పుచ్చుకొని తొలినాటి సాయంవేళను వచ్చిన పేపరు సమగ్రంగా చూసేలోపున ఒకరొకరే మిత్రులు దిగబడతారు. మామూలురోజుల్లో ఇదే మిత్రమండలి సమావేశస్థలమని చెప్పవచ్చును.

తొమ్మిదింటివరకూ కార్యాలయంలోనే ఉండి, పదిన్నరలోపునే ఆఫీసులో కిళ్లీ నములుతూ ప్రత్యక్షంకాగలడంటే, అతడు ఇంటివద్ద ఎంత తీరికగా భోజనాదికం నిర్వర్తించుకొనేదీ సులభంగా గ్రహించవచ్చు. ఒంటిగంటనుండి రెండుగంటలవరకూ ఆఫీసుకు ఒకమాదిరిసెలవు. మునుపు ఈగంటలోనూ కాఫీకని ఇంటికి వచ్చేవాడు. ఇప్పుడు సాయంకాలం ఆఫీసుఅయినతరువాతనే ఇంటికి వెళ్లవలసిన ఆవశ్యకత గోచరించలేదు. అనుదినమూ ఆఫీసుపనిలో ఎవరికో ఒకరికి సహాయంచేయవలసిఉండడంవల్ల ఆరు గంటలకుపైగా అయేది బైటపడేసరికి. తిన్నగా రెస్టారెంటూ, లైబ్రరీ, పార్కూ ఇవీ అతని గమనీయదేశాలు. రాత్రి చాలాపొద్దుపోయేవరకూ అక్కడే వుండిపోయేవాడు. రాత్రి భోజనమయినతరువాత నిద్రవచ్చేవరకూ ఏదో పుస్తకం చదువుతూఉండేవాడు. కాని వారం పదిరోజుల క్రితంనుండి అతడికి ఇంకొక ఆనందజనకమయిన వ్యావృతి ఏర్పాటయింది. మిత్రమండలివారు ఈ వచ్చే వార్షికోత్సవానికి రెండునాటకాలు వేయడానికి సంకల్పించుకొన్నారు. రిహార్సలుచేయించి తరిఫీదుచేసేపూచీ చాలావరకూ రామనారాయణమీదనే పడ్డది. కాగా రాత్రి పన్నెండుదాటేవరకూ పరిషత్తు కార్యాలయంలోనే కాలక్షేపం. బాగా రాత్రి మీరితే, ఒక్కొకనాడు నిద్రకూడా అక్కడే.

* * *

లక్ష్మి రామనారాయణకు నానాటికీ దూరమౌతున్నకొద్దీ అతనికి ఆమెమీది ప్రేమ విపరీతం కాసాగింది. ఆమె అతనికి బాహ్యదృష్టిలో ఎంత అందుబాటులో లేకపోతున్నదో, ఆంతరదృష్టిలో అంత సన్నిహితురాలుగా ఉంటున్నది. ఇప్పుడామె ఎదురుగా వచ్చి తూలనాడినాసరే చలించనంత దట్టంగా వ్యాపించినై అతని మనోంబరం మీద అనురాగాంబుదాలు. అయితే ఇంత అనురాగమూ, ఇంత ఆకాంక్షా ఉండీకూడా అతడామెను తనకు ఎడంగా ఉండనీయడం మొదట్లో లక్ష్మికే ఆశ్చర్యహేతువయింది. ఈవిషయంలో రామనారాయణ దృఢవిశ్వాసం ఏమిటంటే, బలవంతంగా స్వంతం చేసుకొన్న సౌందర్యంలో జీవనచైతన్య మంతరించి వేరే అనుభవించవలసిన దేమీ ఉండదని.

లక్ష్మిప్రయత్నాలకు ఫలితంగా రామనారాయణకు తనమీద ప్రేమ తగ్గనూలేదు; రాజేశ్వరియెడల ఎటువంటి నూతనోద్దేశమూ కలగలేదు. కాని విపరీతంగా, రామనారాయణ యింటికి మరీమరీ దూరంగా ఏదో పరాయివాడులా అయిపోవడమూ, తత్ఫలితంగా లక్ష్మిరాజేశ్వరులమధ్య నున్న వైమనస్యాలంతరించి అనురాగం వృద్ధిపొందటమూ సంభవించింది. వారు పరస్పరమనోవేదనలను వివరించుకోడానికి కూడా ఎటువంటి సిగ్గూ, సంకోచమూ పొందటం లేదు. అంతేకాదు; ఒకరికోసం ఒకరు ఎంతేనా త్యాగంచెయ్యడానికికూడా ఇప్పుడు వారు సంసిద్ధులే. ఇప్పుడు రాజేశ్వరి గర్భవతిఅయిన లక్ష్మిని ఇంట్లోని ఏపనినీ ముట్టనీయలేదంటే, అది ఒక విధి అనిగాని, ఒకరి మెప్పు పొందాలనిగాని కాదు; తాను ద్వేషించినాసరే తన్ను ప్రేమించగలిగిన లక్ష్మిని సుఖపెట్టడంలోనే అనుభూతమైన తృప్తినీ, ఆనందాన్నీ పొందగలగడమే ఆమెలోని ఈఔదార్యాంచితత్వానికి కారణం.

ఇటీవలి రాజేశ్వరిలోని పరిణామాన్ని గుర్తించి ఉండేమాటైతే రామనారాయణ ఎప్పటి గృహస్థయే వాడేనేమోగాని, అతని హృదయంలో ఇప్పుడు రాజేశ్వరినిగూర్చిన యోచనకే స్థానంలేదు. ఏదో ఆదర్శభావనాప్రణయినిగామాత్రమే లక్ష్మి కనిపిస్తున్నదిగాని, వాస్తవికప్రేయసిగా ఆమెచిత్రంకూడా మునుపటిఅంత ఉజ్జ్వలంగా లేదు. అయినా ఆమె అతనిని సమీపించి పూర్వపుచనవుతో చల్లగా, హాయిగా పలకరించటమే చాలు అతనిని ఎంతో కలవరపరుస్తూ ఉన్న ఈ సాంఘిక, నైతిక సమస్యలనన్నిటిని అతనిమెదల్లోంచి తరిమి, అకృతకమూ, అవధిరహితమూ అయిన ఆనందార్ణవంలో మునకలువేయించడానికి. అయితే ఆమెకు ఇప్పుడెంతసిగ్గు! అందులోనూ రాజేశ్వరికి తనమీద అభిమానం ఎక్కువయిన దగ్గర

నుండీ ఆమె శోభనపుపెళ్లికూతురయింది. ఆమెకు బావకంటపడడానికే సిగ్గు. తప్పనిసరిగా తారసపడితేనే ఆమెకు ఎంతో మొగమాటంగా ఉండి ఒళ్లు ముచ్చెమటలూ పోసేది. ఆమెను పరీక్షగా చూడడానికి ఏదో చెప్పలేని జంకూ, గాభరా.

రామనారాయణఆఫీసుపనిలోని చాకచక్యమూ, అతని బి. ఏ. డిగ్రీ ఇన్నాళ్లూ నిష్ప్రయోజనాలుగానిద్రించినా పరిస్థితులు సానుకూలంగాఉన్నప్పుడు వాటిపని అవి చెయ్యకపోలేదు. ముఖ్యంగా తన మీది ఆఫీసరు అనుగ్రహంవల్ల అతడు స్వప్రయత్నంఅక్కర లేకుండానే, వేరొక బ్రాంచి ఆఫీసుకు అసిస్టెంటు మేనేజరు కాగలిగేడు. అవడమేమిటి,అయిన వెంటనే పని ఆరంభించి తీరాలి, చాలా నిలవఉందన్నారు పై అధికార్లు. రామనారాయణ కివేమీ అంత ఆలోచించవలసిన విషయాలుగా తోచలేదు. అతని మనస్సంతా ఇప్పుడు రాబోయే సాహిత్యపరిషత్తులో తాను యివ్వవలసిన ఉపన్యాసంతోనూ, వేయించవలసిన నాటకాలతోనూ నిండిపోయింది. అయితే, అతనిలోని, నిరాలోచనంగా, దైనందినాభ్యాస పూర్వకంగా సంచలించే భాగమే అతనిచేత ఆఫీసునుంచే ఇల్లా వ్రాయించింది :

"నేను రాజమండ్రీలోని మా కంపెనీబ్రాంచికి అసిస్టెంటుమేనేజరు అయినట్టు ఇప్పుడే ఆర్డరు తీసుకొన్నాను. ముందుగా మద్రాసు ఒకమారు వెళ్లి ఆ తరువాత రాజమండ్రీలో ఛార్జి తీసుకోవాలి. నేను ఇవాళ మెయిలుకే మద్రాసు బయలుదేరకతప్పదు. మళ్లీ ఎన్నాళ్లలో రాగలనో నిశ్చయంగా తెలియదు. కాబట్టి, ఇంట్లో ఉన్న నా బట్టలన్నీ పెద్దపెట్టెలో సర్ది, నా కేంపుకాటు, హోల్డాలుతో కలిపి సరాసరి స్టేషనుకు పంపించు. నేను మద్రాసు వెళ్లి మళ్లీ రాస్తాను. ఈ లోగా ఏమయినా అవసరంఉంటే శంకరానికి కబురుచేస్తే, వచ్చి కావలసిన సహాయం చేస్తాడు.

రామనారాయణ."

ఎడ్రసు లేని ఈ ఉత్తరం లక్ష్మీరాజేశ్వరుల ప్రత్యేక మనస్సులమీద ఎల్లా పనిచేసినా, మొత్తంమీద, అందువల్ల, వారిని పరస్పరమూ కట్టిఉంచే అనుబంధ సూత్రముమాత్రం కించిత్తయినా సడలలేదు. ఇక, జరిగిన విషయమేమిటంటే, లక్ష్మి ఎంతో అయిష్టంగా సహాయంచేయగా, ఆనందాతిరేకంలో ఏమి చేస్తున్నదో తనకే తెలియకుండా, రాజేశ్వరి రామనారాయణకు కావలసిన సామానంతా సర్ది స్టేషనుకు పంపించింది.

ఇదివరకూ రాజేశ్వరిని ఎంతో కలవరపరచిన ఈర్ష్య, క్రోధమూ అన్నీ అంతరించేయి ఆమెలో. ఆమెహృదయము ఇప్పుడానందాంచితమే కాదు, ఔదార్యోజ్వలంకూడా అయింది. ఇప్పుడు ఆమె దేనినయినా క్షమించగలదు.

ఇన్నాళ్లూ మూగగా కాలక్షేపంచేస్తున్న తాను స్వయంగా వెళ్లి ఇరుగుపొరుగువారితో తన భర్త ఉద్యోగాభివృద్ధినిగూర్చి తన్మయత్వంలో చర్చించటం మూలాన ఆమె ఇటీవల లక్ష్మిలో వచ్చిన మార్పును గమనించలేకపోయింది. కాని ఆ రకపు సంభావణ కేవలం తనకు ఉత్సాహం కలిగించే విషయాలతో ఆగిపోకుండా, తనకూ తన భర్తకూ వచ్చిన వివాదాల వైపూ, లక్ష్మిలో వారు చూసిన గుణదోషాలవంకా (తనకు ఎంత అయిష్టంగా ఉన్నా) ప్రసరించడమూ, హితబోధ అనే మిషతో వ్యంగ్యంగా తన్ను ఈసడించడమూ రాజేశ్వరిని మళ్లీ ఇంట్లో విడిఖయిదీని చేసేయి. సర్వదా ప్రశాంతమయిన లక్ష్మిమొగంమీద ఈ నాలుగు రోజులలోనూ ఎంత దిగులు అత్తుకొనిఉన్నదీ అప్పుడు తెలిసింది ఆమెకు.

మునుపల్లా రామనారాయణను సరిదిద్దాలనో, అతని అనుగ్రహాన్ని సంపాదించాలనో వినియోగపరచిన తన శక్తిని సర్వమూ ఇప్పుడు లక్ష్మిని ఆనందపరచటంకోసమే రాజేశ్వరి ఉపయుక్తంచేస్తున్నది. కొందరి జీవితములే అంత. బైటికి బహు సామాన్యంగానే ఉన్నట్టుండి, ప్రతిక్షణమూ ఏదో ఒక సమస్యతో ఎంతో అంతస్సంగ్రామము చేస్తూ ఉంటారు. వాళ్లకు మరి శాంతన్నది ఉండదు. అల్లాటివారిలో

రాజేశ్వరి ఒకతె. రామనారాయణకూడా చాలా వరకూ ఈ తరగతిలోనివాడేకాని, సంగీతమూ సాహిత్యమూ మొదలయిన కళలలో లీనమయి కొంతవరకయినా అతడు తనను తాను విస్మరించగలడు; రాజేశ్వరి నిద్రలోకూడా తననూ, తన వాతావరణాన్నీ మరిచిపోలేదు—అంతే భేదము.

ఆమెవెనుకటిప్రయత్నాలన్నిటికీ ఒక గర్వించవలసిన సామాన్యలక్షణం [illegible] ఆమెకు ఎందులోనూ సంపూర్ణపరాజయం లేదు. కొద్దో గొప్పో విజయం లభించేది. కాని ఇప్పుడు ఆమహోత్సవం కూడా అయింది. ఆమె తన శక్తినంతటినీ వినియోగించికూడా లక్ష్మిలోని దిగులును తగ్గించలేకపోయింది. మామూలుగా ఆమెను నవ్వించే మాటలను ఎన్నోమార్లు పిచ్చిగా అంది; ఆఖరుకు కితకితలుకూడా పెట్టింది. కాని ఏంలాభం? లక్ష్మి మొగం మరీ దించుకుపోయింది; ఇక తానేమన్నా ఆమెహృదయం బొప్పవర్షంగా పరిణమిస్తుందేమోనన్న భయంతో రాజేశ్వరి ఎడంగా వెళ్లిపోయింది; అదీ వైఖరి.

సుఖమూ, దుఃఖమూకూడా ఒకమాదిరి అంటువ్యాధులవంటివే. అవి శూన్యప్రదేశాలలో కూడా వ్యాపించగలవేమో? కాకపోతే ఆనందమో, ఆ వేదనో, లేక వాటి ఛాయలో అవి శూన్యహృదయాలమీదసైతమూ (క్షణికంగానయినాసరే) ప్రతిబింబించడం ఎలా సాధ్యమౌతుంది? అయితే సుఖమన్నది ధనమంత చంచలమూ, దుఃఖమన్నది దారిద్ర్యమంత స్థిరమూ కావడంవల్ల మనుష్యులమీద రెండవదాని ముద్ర మొదటిదానిగురుతుకంటె చాలా బలవత్తరంగా పడుతుంది. ఆ ముద్రను తొలగించడానికి వచ్చిన చేతులు అందులో కొంత నలుపును తమకు అంటించుకోగలవు—అంతే; కాని ముద్రమాత్రం స్థిరంగా వ్యక్తిని అంటిపట్టుకొనేఉంటుంది ఆజన్మాంతమూ.

లక్ష్మిని ఊరడించి ఆమెకు తన ఉత్సాహంలో వంతు పంచిఇవ్వాలన్న అభిప్రాయం రాజేశ్వరిలో కొద్దిరోజుల్లోనే అంతరించింది. క్రమంగా ఆమె హృద్వీణ లక్ష్మిలోని మూకవేదనాగానానికి మారుమ్రోగసాగింది సహానుభూతిమంతమై. ఏది ఏదో తెలియని ఆవేదనాప్రపంచంనుండి వారిని వాస్తవికజగత్తులోనికి తెచ్చినది రాజేశ్వరిచెల్లెలు సరళ. అందుకోసం ఆమె ఏమీ యత్నించలేదు. కాని ఆమెచెప్పిన మాటలలోని నిశితమయిన సత్యమంతటిది. ఆమె రామనారాయణ వెళ్లిపోయిన పదిహేనురోజులకు అకస్మాత్తుగా అన్న మాధవరావుతో కలిసి వచ్చింది.

ఇక సరళకథ: ఆమె తన ఇటీవలి చరిత్ర యావత్తూ కొద్దివాక్యాలతో రాజేశ్వరికి తెలియజేసింది. దానిని ఆమె అట్టే పెంచకుండా యథాతథంగా లక్ష్మికి విశదీకరించింది. అవి కేవలం హృదయాలకు సంబంధించిన వాక్కులు. కాబట్టే ఎంత సంగ్రహరూపంలో ఉన్నా, అవి అపార్థంచేసుకోబడవు.

మొదటినుండీ బలహీనుడూ, జాడ్యగ్రస్తుడూ అయిన సరళభర్త గోవిందరావు ఉన్న కొద్దిశక్తినీ స్కూలుపుస్తకాలకే బలిపెట్టి, ఉద్యోగంలో ప్రవేశించేవేళకే చాలా బలహీనుడయేడు. అంతవరకూ అతని పెళ్లికట్నం పెరగడమే అయిందిగాని, వివాహంమాత్రం కాలేదు. దేహారోగ్యాన్ని బట్టి చూస్తే, ఇక వివాహమే మంచిది కాదేమో అనే స్థితిలో సరళతండ్రి మధుసూదనరావుగారు అతని మేనమామా, పెంపకపుతండ్రీ అయిన జానకిరామయ్యగారి షరతులన్నిటికీ ఒప్పుకొని అతనిని ఒక గృహస్థును చేసేడు. అసలు మధుసూదనరావుగారి తాపత్రయమేమిటంటే, చిన్ననాటి స్నేహితుని కొడుకుకదా అనీ, పెద్దమ్మాయి రాజేశ్వరిని సామాన్యస్థితిమంతుడైన రామనారాయణకిచ్చేశాను—ఇక సరళనయినా బాగా చదువుకున్నవాడూ మంచి ధనవంతుడూ అయినవాడికిద్దామని. గోవిందరావు మధుసూదనరావుగారి కోర్కెలకు తగిన అల్లుడే. ఇక అతనితోటి సాంసారికజీవితంలో సరళ పొందే ఆనందము సంగతా? అది "మన స్థితిగతులకు, పరువుప్రతిష్ఠ

లకూ తగినవాడి కిచ్చి వైభవోపేతంగా వివాహము చేసేము" అన్న మధుసూదనరావుగారి సంతృప్తియందు ఏమాత్రం లెక్కించవలసినవిషయముగనక ? ఏమయితే నేం, వైవాహికబంధంతో సరళ గోవిందరావు సహచరిణి అయింది.

గోవిందరావుక్షయవ్యాధి క్రమంగా దాచటానికివీల్లేని స్థితికి వచ్చింది. "పెళ్లికి ముందుగానే యీవ్యాధి వచ్చిఉంటే, నా కెల్లానూ తప్పదు, నీవయినా సుఖపడిఉందువేమో ?" అని భర్త తనతో ఎన్నోమార్లన్న మాటలను మనసా విశ్వసించడానికే యత్నించేది సరళ. కాని, పెళ్లికి అధమం ఆరునెల లయినా ముందుగా అతను నిస్సంశయంగా వ్యాధి గ్రస్తుడయినట్లు తనకున్న అనుమానం అణచుతున్న కొద్దీ బలవంతము కాసాగింది సరళహృదంతరంలో.

ఇక మరి మామూలుమందులు లాభంలేదని, అతడు మదనపల్లి శానిటోరియమ్‌కు ప్రయాణం కట్టేసి వెక్కివెక్కి ఏడుస్తూ సరళతో — "నిన్ను చూస్తూఉంటే నాదుఃఖము మరీ మితిమీరుతుంది ; నువ్వు దూరంగా వుంటేఏదోఒకవిధంగా నీవు సుఖిస్తున్నావని నన్ను నేను నమ్మించుకుందుకు ప్రయత్నించ గలను.

"పాపం, ఈరెండేళ్లలోనూ, నాలోఅవ్యక్తంగా అణగివున్న ఆత్మకు ఒక ఆకృతి నిచ్చేవు ; సహజ మయిన గాలినీ, వెలుతురునూ నాకు ప్రసాదించటానికి నీ శక్తికి మించికూడా శ్రమించేవు ; కాని నీశ్రమకూ, నీఔదార్యానికీ సార్థక్యం కల్పించేపాటి భాగ్యము నా కలభ్యమయింది. నన్ను నీవు ప్రేమిస్తావు—అదే నాదుఃఖకారణం. నీవేగాని నన్ను ద్వేషిస్తూఉండేమాటైతే నా కీవ్యాధి వచ్చినందు కెంతో సంతోషించి ఉందును. అధమం నన్ను నీవు మరిచిపోతానంటే చాలు ; అదే నాకు కొంత తృప్తినిస్తుంది."

సరళ ఏమేమో అనాలనుకొంది. కాని ఒక్క మాటకూడా వెలికిరాలేదు. చివరకు ఆమెకళ్లంట నీళ్లుకూడా రాలేదు. అంతగా ఎండిపోయింది ఆమె సుకుమార హృదయం. అదివరకు అంత నైరాశ్యంలోనూ ఆమెఎన్నో అతిలోకములయిన ఆశాలతలను వీక్షించగలిగి, గోవిందరావునోటివెంట అన్లాటిమాటలను విన్న తరువాత ఆమెకు ఆశించవలసిందిగాని, ఆలోచించవలసిందిగాని ఏదీ కనిపించలేదు.

ఇంతటి అమాసచీకటిలోనూ ఒక చిన్న నక్షత్రం ! సరళకూడా ఇప్పుడు గర్భవతి.

అనంతమయిన కాలసాగరంలో (పదిహేను రోజులు)ఒక పక్షమన్నది ఒక జలకణంపాటికూడా కాదు. కాని మన యీజీవితాలపరిమాణంలో చూసి నప్పుడుమాత్రం ఒక పక్షమే అక్కరలేదు (పరిస్థితు లనుబట్టి)ఒక దినమేమిటి ఒక్కక్షణంకూడా జీవితమంతటికీ చూడామణివంటిది వుంటుంది మహాసముద్రంలో అపురూపంగా దొరికే రత్నాలవలె. అదివర కెన్ని పరిణామాలు వచ్చినా, వారిద్దరి జీవితాల్లోనూ విభిన్న వ్యక్తుల అన్యోన్యంవలన సాధ్యమయిన ఆనందమునంతటినీ ప్రసాదించినదీ, స్వార్థమూ సంకుచితత్వమూ మొదలయినవాటికి అతీతమయిన తన్మయతను దయచేసినదీ ఆ ఒక్కపక్షమే. సామాన్యంగా చాలా అనుభవాలకు ఏవేవో క్రియల దోహదం కావాలి ; కాని వెన్నెలలోని ఆనందంవలె ఈఅనుభూతి స్వయం పోషకం.

లెక్కలనుబట్టి చూస్తే లక్ష్మికి ముందుగా పురుడు రావాలి. కాని, అనుకున్నకంటె సుమారు ఒక నెల ముందుగా సరళకు పురుడువచ్చింది. పుట్టిన ఆడపిల్ల వారంరోజులుమాత్రమే బ్రతికింది. ఆతరువాత పదిరోజులకు లక్ష్మికి పురుడు వచ్చింది. చక్కటి పనసపండువంటి మగపిల్లవాడు పుట్టేడు. ఆపిల్లవాణ్ణి చూసి సరళ తన దుఃఖాన్నంతటినీ మరచిపోగలగడంలో విశేషమేమీ లేదు. అంత జనముద్దుగా ఉన్నాడు కుఱ్ఱవాడు. అయితే తల్లిమాత్రం కొడుకును ఒక్కవారంకంటె ఎక్కువ చూసుకుందుకు నోచుకోలేదు. కాని, రామనారాయణను చూసేవరకూ ఆమెప్రాణం పోలేదు. తృప్తిగా బావ

చేతిలో చేయి ఉంచి, సరళచేతులలోని కన్నకొడుకును చూసుకుంటూ శాంతంగా, సంతోషంగా ఆమె గతించింది. మొదటినుండీ ఆమెపట్ల అన్నీ అన్యాయాలే చేస్తూవచ్చిన విధికి చివరివేళను ఈఆమె మెచ్చికో లెందుకో?

సరళకు పసిపాపలేని కొఱత తీరింది. కుఱ్ఱవాడి పాలకోసం మరి వెదుకుకోనక్కరలేకపోయింది.

వెనుక లక్ష్మిలో కొంత భార్యాత్వమును, కొంత మాతృత్వమును చూడగలిగేవాడు రామనారాయణ. నేడు ఆమెలోని కేవలమాతృత్వభాగాన్నే వీక్షించగలుగుతున్నాడతడు సరళలో. ఆమెను ప్రేమించడానికి ఆమెదగ్గరనే ఉండనక్కరలేదు. ఉన్నతమయిన ప్రేమకు సామాన్యమయిన ఈ లక్షణాన్ని స్వానుభవపూర్వకంగా రామనారాయణ ఇప్పుడిప్పుడే గ్రహించగలుగుతున్నాడు.

ఇక రాజేశ్వరీ రామనారాయణలు ఇప్పుడెల్లాంటి భేదాభిప్రాయాలూ లేకుండా మనగలుగుతున్నారు. ఆమె ఒకమారంది: "బావా! నీలక్ష్మి బ్రతికేఉంది. ఆమెశరీరంతోపాటు రాజేశ్వరిఆత్మ నశించింది. అందువల్లనే నేనిప్పుడు నిన్నింత హృదయపూర్వకంగా 'బావా' అని పిలవగలుగుతున్నాను." రామనారాయణకు తాను విన్న పరమసత్యములలో ఇది ఒకటి అని దృఢవిశ్వాసము!

ఒక్కొక్కనాడు ఒంటరిగా కూర్చొని రామనారాయణ అనుకొంటూ ఉంటాడు: "మెరుపు ఎప్పుడో, ఎల్లాగో వస్తుంది; అది ఉన్న కొంచెంసేపూ తక్కిన ప్రపంచమే కనిపించదు; కాని అది అంతరించటంతో అదివరకుకంటేకూడా చీకటిగా ఉంటుంది లోకం! అయినా మనకు అసహ్యమయినంతమాత్రాన చీకటి రాకపోదుకదా లోకంలో."

వేరొకప్పుడు—"ఇంద్రధనుస్సు అపురూపంగా వస్తుంది అంబరంమీదకు. అందులోని మహిమ స్వశాశ్వతత్వంలోకాక వర్షారూపమయిన ఆకాశోర్వ్యల ఐక్యమును అనుసంధించటంలోనే ఉంది"అని ఊహిస్తాడు రామనారాయణ.

మొత్తంమీద రామనారాయణజీవితంలో ఇప్పుడొకవిధమయిన తూకమూ, తాలిమీ నెలకొన్నాయి. అతనికిప్పుడే విషయంలోనూ విశేషం పట్టుదలలేదు. "లక్ష్మి శాంతిమయి; ఆమె జీవించియున్నప్పుడు ఆమెవ్యక్తిసౌందర్యంలో అంతర్లీనమయిఉన్న శాంతిప్రసాదము ఇప్పుడు హృద్వికాసజ[illegible]రూపమున కాంతిల్లుతున్న"దని అతని నిశ్చలభావన.

చెప్పడం మరిచేను—ఆ కొడుకు పేరు "లక్ష్మీప్రసాద్."

# ఇందుని మాయాబజారు

## వరుణుని రసాభాసము

= శ్రీ రాళ్లపల్లి లు

కొన్ని నెలలక్రిందట నా మిత్రుఁడొకనికి తీరరాని దుఃఖము సంభవించినది. 1945 జనవరి 14-వ తేదీన సాయనమకరరాశియందలి 24-వ భాగలో వచ్చిన సూర్యగ్రహణము అతని లగ్నమందున్న కుజునికి నికరముగా సమసప్తకవేధాస్థానమందే పడుట! అతని కళత్రభావమునకు గ్రహణము కొట్టినది. మూఁడవ దినమే జ్వర మారంభమై వారముదినములకే బంగారువంటి గృహిణి కాలగర్భమందు లీనమైపోఁగా, కంగారుపడినాఁడు నా మిత్రుఁడు. కళకళలాడుచున్న కంచంత కాపురము క్షణములో గాఢాంధకారమున కూలిపోయినది.

జ్యోతిశ్చక్రములో అమావాస్య–సూర్యచంద్ర సంయోగము – అపారశక్తి కలది. జాతకములోని ముఖ్యస్థానములపై అమావాస్య—అందులో, గ్రహణము—సంభవించెనేని, వ్యక్తిజీవితములలో అసాధారణములగు పరిస్థితు లేర్పడఁగలవు. జన్మకాలికచంద్రస్థానముపై నది వచ్చెనేని, 'అభిచారకర్మ అక్కరలేకయే మనుష్యుఁడు కాలధర్మము చెందునఁట!

"యస్య జన్మర్క్షగ శ్చంద్రో
విషనాడ్యాం కుహూ ర్భవేత్,
అభిచారేణ కిం తస్య ?
స్వయమేవ మరిష్యతి."

అని వశిష్ఠమహర్షి హెచ్చరించుచున్నాఁడు.

అమావాస్యా తిథికి మనవారు చూపిన గౌరవము మన కిపుడు కొంత అర్థమగుచున్నది. దానిని వారు పుణ్యదిన మనిరి; శుభకార్యము లేవికాని ఆ దినము జరుపకూడదని శాసించిరి; స్నానదానములు, జపతపములు, మంత్రతంత్రములు, శ్రాద్ధతర్పణములు మున్నగు పనులకు మాత్రము తగిన కాల మది యని నిర్ధరించిరి. రవిచంద్రబింబములు రెండింటినుండి బయలువెడలు ప్రబలమగు ఆకర్షణశ ఏకముఖముగా భూమండలమును లాగునట్టి దిన మది. కావుననే, వాతావరణమున నాఁటిదినము గొప్ప మార్పు కలుగును. సముద్రము లుప్పొంగి ఘూర్ణించును. ఇఁక మానవు లేపాటి?

"అమావాస్య అంత చెడ్డదయినచో, అందరి జీవితములలో అది ఫలించవలయుఁగదా?" అను విమర్శకు లున్నారు. ఇది అవిచారరమణీయమగు ప్రశ్న. అమావాస్య ఎవరి జాతకమున ముఖ్యస్థానముల కంటునో, వారి జీవితములలో మాత్రమే అది ఫలమును చూపఁగలదు. వ్యక్తిజాతకములో తొమ్మిది గ్రహములు, లగ్న మొకటి, మొత్తమున పది ముఖ్యస్థానములు కలవుకదా? చక్రమందలి 360 భాగలలో వ్యక్తిజాతకమందలి ముఖ్యస్థానములు ఏవో పది ప్రత్యేకభాగలలోమాత్రమే ఉండఁగలవనుట అంద ఱెఱిఁగిన విషయమే. అట్టి విశిష్టభాగలలో అమావాస్య—గ్రహణమైనచో మరియు విశేషమే — సంభవించినపుడే, ఆయా వ్యక్తుల జీవితసముద్రములలో కల్లోలము లుదయించును. ఆ పదిస్థానములలో నయితము లగ్నముకాని, చంద్రుఁడుకాని ఆశ్రయించిన భాగ ఆయువుపట్టువంటిది. అట్టి భాగను అమావాస్య వేధించెనేని, ప్రమాదకారి యనుటలో నాశ్చర్య ముండదు. దృష్టాంతము లెన్నియైన చూపవచ్చునుకాని, కేవల రాశికుండలులతో నిది సామాన్యముగ సాధ్యముకాని పని. అది అట్లుండె.

నామిత్రుని. కిపుడు గొప్ప చిక్కు దాపరించినది. ఆఁకలిగొని యింటికి వచ్చినపుడు తన్నాదరించువారు లేరు; ఇంట కారుబోరుమను కసికందలను కాపాడువారును లేరు. ఇట్టి పరిస్థితులలో పునర్వివాహపు సమస్య రాకతప్పదుకదా? కీర్తిశేషురాలగు గృహిణిపై భక్తితాత్పర్యములకు కొదవ లేదు. కాని, లోకయాత్ర యొకటి సాగవలసియున్నది. మరియు, వివాహ మిపు డక్కరలే దనుకొనునంతటి ముదురుపాకములో లే దతని వయస్సుకూడ. కాక, చక్కని కళోపాసి యతఁడు; రసికుఁడగు కవి. మఱి నీరసమైన యీసంసారము నతఁడెట్లు సాగింపఁగలఁడు? "అసారే ఖలు సంసారే సార స్సారంగలోచనా." అని చెప్పిన మహాకవి ఎంత ప్రపంచానుభవశాలియో?

తన కింకను వైవాహికజీవిత మున్నదా, పునర్వివాహ మిపుడు శ్రేయస్కరమా అను సమస్యలను జాతకమందలి గ్రహము లెట్లు పూర్తిచేయునో తెలుసుకొనవలెనను కుతూహలము. నామిత్రునికి కలఁగుటచే అతని జాతకచక్రము పరిశీలించు నవకాశ మిటీవలనే నాకబ్బినది. అతని సాయనగ్రహభావకుండలి యిది:—

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | శ 10-3 | | X 1-30 | |
| | | శ 9-41<br>X 25-30 | | చ 29-13 | |
| | | [సాయనము]<br>నా<br>మిత్రుని<br>జన్మకుండలి | | రా 5-0<br>ర 5-57<br>ఇ 14-16<br>బు 16-19 (వ)<br>శు 18-19 (వ)<br>కు 23-34<br>I 27-0 | రా 3-39<br>శు 6-26<br>ఇ 15-38<br>బు 25-36 |
| వ 13-51<br>కే 3-39 | వ 15-18<br>కే 5-0 | | | గు 13.48 | ర 11-40<br>కు 17-26<br>గు 21-34 |
| | | | | | |
| | | | చ 21-30 | I 0-30 | |

పాఠకమహాశయుల సౌకర్యార్థమై జాతకునికి కళత్రవియోగముకల్గిన వయస్సునకు దేవమానదశననుసరించి చలితగ్రహస్థానములు సయ్యుతము బైటి కుండలిలో చూపఁబడినవి.

కర్కాటకరాశిలో నున్న షడ్గ్రహకూటమును చూడుఁడు! లగ్నముసయితే మారాశిలోనే యుండుట యొక విశేషము. పై గ్రహములన్నింటికిని కళత్ర స్థానమందున్న వరుణగ్రహమునుండి సమస్తక వేధ యుండుట ముఖ్యముగా గమనించఁదగిన యోగము.

దయా, దాక్షిణ్య, సౌజన్యముల కాటపట్టగు కర్కాటకము లగ్నము. లగ్నాధిపతియగు చంద్రుఁడు మిథునరాశిలో నుండి, జాతకుఁడు మతిమంతుఁ డనియు, పండితుఁ డనియు, రసజ్ఞుఁ డనియు సూచించుచున్నది. కాని, ఆచంద్రుఁడు వ్యయస్థానములో నుండి త్వరగా రవిసంగమము నపేక్షించుచుండుటచే—అనఁగా, అమావాస్యనాఁడు జననమనుట—సహజశక్తికి తగినంత ప్రాపంచికానుకూల్యములు జాతకునికి లభించక పోవచ్చును. అది యట్లుండ, లగ్నమందున్న గ్రహకూటము మిక్కిలి ప్రబలమైనది. ఇంద్ర, శుక్ర, బుధ, కుజులు లగ్నమందే యున్నారు. బుధుని తెలివితేటలు, శుక్రుని కళావిలాసము, ఇంద్రుని తన్మయానందము, కుజుని కార్యపాటవము, ఇవి అన్నియు లగ్నధర్మముతో కలసిమెలసి ఒకేఅచ్చున కరఁగించి పోఁతఁబోసినట్లున్న దీయోగము. "నూనూగుమీసాల నూత్నప్రాయము"నాఁడే జాతకుఁడు కవిత్వ మారంభించినాఁడు; చిన్నతనమందే దేశదేశములు తిరిగి వచ్చినాఁడు; రాజభాషలోనేకాక దేశభాషలో సయితము పాండిత్యము గడించినాఁడు; ఉపాధ్యాయ వృత్తి కర్హత నార్జించినాఁడు. నిసర్గమధురమైన గాత్రము, గాత్రమునకు వన్నె తెచ్చు గానకళ, గానకళకు మెరుగుపెట్టు కళారసికత నామిత్రునికి కలవు. క్రమక్రమముగ నాటకరంగము నెక్కినాఁ డతఁడు. అనేకనాటకములలో అభినయించుటసయితము జరిగినది; తుదకు కవిగా, నటకుఁడుగా, నాట్యాచార్యుఁడుగా, సూత్రధారుఁడుగా సినీమారంగమున ప్రవేశించినాఁడు; కొంతకాలము అప్సరస్త్రీల (సినీమా తారల)నడుమ ఆనందించినాఁడుకూడ! తుద కన్నియు వదలినాఁడు. గ్రంథరచనకై కుతూహలము పుట్టినది. కాలక్రమమున అదియు సాధించఁగలఁడు. తరువాత ఇంకేమో?

ఇంతలో ఇన్ని మార్పులా అందురేమో? లగ్నమందలి గ్రహములపై వరుణగ్రహమునుండి వచ్చు ప్రచండసమస్తకదృష్టివలని ఫల మిది. దశమ (రాజ్య) స్థానాధిపతియగు కుజుఁడు లగ్నమందే యుండి ఇతర గ్రహముల సాహచర్యముచే నానావిధములుగా నుద్యోగించు శక్తిని ప్రసాదించెను. కాని తత్ప్రయత్నములకు నిలుకడ రానీక వరుణుఁడు తన ప్రభావమును ప్రకటించుచున్నాఁడు. రాజ్యాధిపతి (కుజుఁడు) నీచుఁడనుమాట వాస్తవమే. ఇదే చాలు, వరుణగ్రహమింకేల అనువా రుందురు. ఆర్జనపటుత్వవిషయమున నీచకుజునికి లోపమున్నదని వరాహమిహిరాచార్యుఁ డనలేదు. కుజుఁడు నీచపడినకారణమున ఉద్యోగశక్తి యేదయినా మట్టుపరకము కావచ్చును. కాని, గొప్ప శక్తి యుండి ఇన్ని మార్పులు, ఇన్ని రంగులు రావలసిన యవసర ముండదు. అట్టిపని వరుణగ్రహముదే. ఉన్నదాని నూడఁగొట్టుటే వరుణుని కార్యముగదా? లగ్నగతగ్రహములపై వచ్చిన వరుణవేధవలన శక్తిసామర్థ్యముల కుత్తేజనమేకాని నష్టము లేదు. ఫలితమందు మాత్రమే యీ వైశిష్ట్యము.

బుధునిపై వరుణుని దృష్టి మంచి ప్రతిభతోటి యుపజ్ఞ నిచ్చునట్టిది; కాని, నిరంకుశస్వాతంత్ర్యప్రీతి యుండఁగలదు. తన యుపదేశమే తన యజమానులు సయిత మాదరించవలె నను ఆత్మాభిమాన మపారముగా కానవచ్చును. ద్రవ్యార్జనకై ఆత్మగౌరవము పలుచబరచుకొనుట వరుణుని కళాశాలలలో నేర్పని విద్య. ఇఁక కుజవరుణ ఘర్షణమో, స్పర్ధకు దిగినచో "ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్రం శాపాదపి శరాదపి." అని నడుముకట్టి ముందుకునడచు సేనానిధర్మము నిచ్చునట్టిది. దృష్టిలో నుండునది గెలుపుకాదు; కీర్తియే. మఱి, ఇంద్రశుక్రవరుణుల పరస్పర వేధ పాలవెల్లిలో హాలాహలమును సృజించునట్టిది. కోమలములగు మధురభావములతో తీవ్రమగు నుద్రిక్తస్వభావమును జత

గూర్చి రసాభాసప్రసక్తి కవకాశమిచ్చు యోగ మిది. అనఁగా, రసమున్నచోట రసాభాసమో, రసాభాసమున్నచోట రసమో, జాతకుని కీయోగము తెచ్చి పెట్టఁగలదు. ఇట్లనుటచే జాతకుని రసగ్రహణశక్తికి లోపమనుట కాదు. ఇతని దృష్టిలో చుట్టునున్నవారికే రసగ్రహణశక్తి తక్కువ. అరసికుల నడుమ వ్యవహరించవలసిన దౌర్భాగ్యము వచ్చెనే యని యతఁడు పలుమారు చింతించవలసియుండుననుట. "అరసికేషు కవిత్వనివేదనం శిరసి మాలిఖ, మాలిఖ, మాలిఖ." అనురీతిగా జాతకుఁ డెన్నియోమార్లు సృష్టికర్తను గూర్చి మొఱపెట్టియుండుననుట తప్పుగాదు.

జాతకమందలి గ్రహములు చూపు సహజగుణము లివి. ఈసామగ్రినే దశమాధిపతి కుజుఁ డుపయోగించుకొని యుద్యోగించవలసియున్నది. రవి ద్వాదశభావములో నున్నాఁడు. స్వయంకృషితో జాతకుఁడు ముందునకు వెళ్లవలసినవాఁడే కాని, పరుల సాహాయ్యసంపత్తివలన కాదు. వరుణుని దృష్టి అట్టి ఆశ కెడమీయదు. ధనస్థానమందున్న బృహస్పతి శనితో మంచిమైత్రితో నుండి ఆర్థికాభివృద్ధిని చూపువాఁడే. కాని, వానితో లగ్నాధిపతికి (చంద్రునికి) అర్ధకేంద్రశత్రుదృష్టి యున్నది. గురువు తేఁగల ఫలము లగ్నాధిపతికి నచ్చదు. అందుకు తగినట్లే ఫలముండఁగలదు.

పోనిత్తము. ఈసంవత్సరమునకు చలితలగ్నము కన్యారాశిప్రవేశము చేసినది. చలనవశమున లగ్నమొకరాశిని వదలి మఱియొక రాశిని ప్రవేశించినవయస్సులో జీవితరంగమున సాధారణముగా గొప్ప మార్పు వచ్చును. ఇప్పటికి సరిగా ఇంద్రగ్రహమునుండి అర్ధకేంద్రదృష్టి, వరుణునినుండి సార్ధకేంద్రదృష్టి చలితలగ్నము నేకకాలమందే వేధించుట యీ జాతకమందలి విశేషము. అనఁగా, చలితకళత్ర (సప్తమ)స్థానము ఇంద్రావరుణుల క్రూరదృష్టిపాతమున కిప్పుడు గురిఅయినదనుట. ఇట్టిదశలో కళత్రభాగ్యము బాగుండఁగలదా? చలితలగ్నము సూచించు మార్పున కీదశ త్రోవచూపినది. ఇంతకన్న గొప్ప మార్పు రాఁగలదా

జాతకునికి కళత్రవియోగము కలిగిననాఁటి (24-1-45) గ్రహస్థితిని చూడుఁడు!

| | | | |
|---|---|---|---|
| కు 20-46 | | | వ 9-19<br>చ 18-51 |
| ర 4-9 | (సాయనము) | | శ 5-16<br>రా 12-34 |
| కు 14-3<br>బు 12-46<br>కే 12-34 | కళత్ర వియోగము | | |
| | | ఇ 6-21 (వ) | గు 27-15 |

కళత్రభావమందలి జన్మవరుణునిపై కుజుఁడు, జన్మరవిపై (కుటుంబాధిపతిపై) సప్తమాష్టమాధిపతియగు శని ఆవాహనమైన దుర్దిన మది. కుజుఁడు జాతకమందలి ఇంద్రగ్రహపు వేధాస్థానమునకే వచ్చినాఁడు. ఇది చాలక, జన్మరవితో తాత్కాలిక శనిసంయోగము నొందిన స్థానమునకు పూర్ణకేంద్రమందే ఇంద్రుఁడు వచ్చి నిలిచినాఁడు. ఏదో ప్రబలమగు ఇంద్రమాయయున్నది. దైనికలగ్నము వచ్చి నికరముగా జన్మకుజునిపైననే నిలిచిన దిన మది. గ్రహణముకొట్టిన గ్రహముకదా గ్రహణము నాఁడు సంపాదించుకొన్న దోషమును కుజుఁ డానాఁడేకదా కళత్రభావమున కందఁజేయఁగలఁడు? ఇంతకన్న ము కావలయునా దైనికజాతకపు విలువను, గ్రహణకార్యమును పరీక్షించుటకు? జాతకుని భార్యకు వచ్చినది "టైఫాయిడు" అని డాక్టర్లు చెప్పినారఁట!

సరేకాని, ఇంద్రగ్రహకార్య మీ ఘట్టములో ఏ విధముగా కానవచ్చినదో బోధపడలేదు. వచ్చినదన్న రోగమా, ఇంద్రగ్రహకార్య మనుటకు వీలులేకున్నది. బుద్ధిభ్రంశమా, అసాధ్యవ్రణమా, మానసిక

వ్యాధియో, పిశాచావేశమో, ఇత్యాదు లేవియు కానరాలేదని నా మిత్రుఁడు చెప్పుచున్నాఁడు. మఱి ఇంద్రగ్రహ మేమి చేసినది? దశలోమాత్రమే కాక, దైనికజాతకమందు నయితము ఇంద్రగ్రహకార్య మొక వైశిష్ట్యమునే చూపుచు "నేనున్నాను." అనుచున్నదే కాని ఊహాకుమించిన విషయమైనది. పాపికలికాలమున గ్రహఫలములకు "భవంతి, నభవంతిచ" అను శాప మున్నదనుకొని తృప్తిపడవలసినదేనా? ఏమియు తోఁచక ఇంద్రుని కార్యమంతా "మాయాబజారు" అనుకొని నెమ్మదిపడితిని.

అది యట్లుండనిచ్చి సప్తమభావమును పరిశీలింతము. దీనికి వరుణగ్రహవ్యాప్తి యున్నది. ఇంద్ర, శుక్ర, బుధ, కుజ, రవులతో సమసప్తకమందున్న ఈ వరుణగ్రహమునకు కళత్రస్థానముపై నధికార మిచ్చిన జాతకము నా మిత్రునిది. వైవాహికజీవిత మొక గొప్ప చిక్కుసమస్యగా ఏర్పడఁగలదు. అవధానములో 'నిషిద్ధాక్షరి'వంటి యోగ మిది. విప్రలంభశృంగారమందే వరుణునికి ప్రీతి యని మన మెఱుంగుదుము. దానిలోనే వాని కానందము. నా దృష్టిలో "ఏకో రసః కరుణ ఏవ" అని ఘంటాఘోషముగా సిద్ధాంతీకరించిన మహాకవి భవభూతి వాస్తవముగా ఇంద్రశుక్రుల సామ్రాజ్యమున వరుణగ్రహవరప్రసాదమువలననే జనించి యుండును. కానిచో, వియోగవిషవహ్నిజ్వాలలలో వీణాగానామృతప్రవాహవీచికల విస్తరించు కావ్యసృష్టికి వలయు శక్తి అతని కెట్లు రాఁగలదు?

ప్రకృత మనుసరింతము. సప్తమాధిపతియగు శని ధర్మస్థానమందుండి కుటుంబాధిపతియగు రవితో గుప్తశత్రుదృష్టిపాలయినాఁడు. కళత్రభావమున కిది యొక లోటే. కాంతాకారకుఁడగు చంద్రుఁడు ద్విదేహరాశి యగు మిథునమందు వర్గోత్తమాంశలో నున్నాఁడు. ధర్మస్థానాధిపతియగు బృహస్పతినుండి యీ చంద్రునికి అర్ధకేంద్రవేధ యున్నది. జాతకునికి ద్వికళత్రయోగ మున్నదనియు, ఆభిజాత్యముతోటి ఉత్తమశ్లోకత్వము కళత్రముల కుండుననియు, అనారోగ్యమువలననో, అధర్మపరులనుండియో కళత్రములో, దాంపత్యజీవితమో చిక్కులపాలు కావచ్చుననియు దీని కర్థము చెప్పవచ్చును.

చలితరవి ఇంద్రుని పరిచయభాగ్యమును సంపాదించి, వరుణుని వ్యధికరణశక్తి నలవరచుకొని, బుధశుక్రుల యాలింగనమువలని ఆనంద మనుభవించి, కుజుని కార్యదక్షత నార్జించి, ఇరువదియొకటవ సంవత్సరపు వయసునకు లగ్నబిందువును చేరుకొన్నాఁడు. అడుగవలయునా, "ఏకైక మప్యనర్థాయ" అనిపించు గుణములన్నియు వరుసగా ఒకచోట చేరినచో? మన తెన్నాలిరామకృష్ణకవి చెప్పిన—

"తలగడు, గంగమర్దనము
ధౌతపటావరణంబు, సంస్కృతో
జ్వలకలమాన్న భోజనము,
చందనచర్చ, ప్రసూనదామకంబులు
..........................
పులుకడుగంగబడ్డ నును
ముత్యము కైవడి నాలుచున్ పురిన్."
(పాండురంగమాహాత్మ్యము.)

అను వర్ణనమునకు జాతకుని జీవితమున దృష్టాంత మబ్బు టేమి యరుదు? పుణ్యమని జాతకునికి అప్పటి కింకను పెండ్లి కాలేదు. త్వరగానే, అనఁగా మూఁడేండ్లకే చలితరవి కటకరాశిని వీడి సింహప్రవేశము చేయవలయును కదా? వివాహ మంతకుముందే నడచియుండినచో, అప్పటికే ద్వికళత్రయోగము పట్టియుండెడిది. చలితరవి కర్కాటకరాశిని వదలుటతో మునుపటి కృష్ణలీలలు మూలకొదిగినవి. ఉన్న బంధములో, బాంధవ్యములో ఊడిపోయినవి. చక్కని కళత్ర మబ్బి జాతకుఁడు సంసారి అయినాఁడు. కాని చలితలగ్నమున కిపుడు వచ్చిన వేధ కళత్రము నట్లపహరించినది. చలితరవి ఇపుడు కళత్రాధిపతికి (శనికి) త్రికోణశుభదృష్టిలోనే చరించుచున్నాఁడు. చలితశుక్రుఁడుండుట జన్మరవిసంయోగమందే. చలితబుధుఁడింతలోనే జన్మలగ్నాధిపతియగు చంద్రునితో అర్ధ

కోణమైత్రి నెరపనున్నాఁడు. కుంభరాశిలో 5-వ భాగలో నున్న వివాహసహమబిందువు చలించి జన్మ శుక్రునితో పూర్ణత్రికోణ శుభదృష్టికి వచ్చినది. ఇన్ని దశ లిట్లు నడచుచుండఁగా, అర్ధాంగి, లేక ఏకాంగిగా జాతకుఁడు జీవితయాత్ర ఎట్లు సాగించఁగలఁడు?

ఇచట, ఒక ప్రశ్న కవకాశమున్నది. ఇప్పటి కైనా వరుణమహాశయుఁడు దయదలఁచి జాతకుని జీవితమున శాంతి నీయఁగలఁడా అని. చలితలగ్నము కన్యారాశిలో ప్రవేశించుటచే జాతకుని వివేచనాశక్తి బాగుపడఁగలదు. అనుభవమున కంతమాత్రపు విలువ వలదా మఱి? కాని, జన్మకాలిక గ్రహస్థితి సూచించు సామాన్యధర్మములు జీవితమున కంటియేయుండఁగలవు. అనుభవముచే నార్జించిన వివేకపు ఫలముగా, జాతకశాస్త్రానుగుణముగా, ఆగుణధర్మములను సద్వినియోగపరచుకొని ప్రాపంచికజీవితమున చిక్కులను తొలఁగించుకొనవచ్చును. లేదా, తగ్గించుకోవచ్చును. వైయక్తికశక్తికి, దేశకాల సౌకర్యములకు, పురుషకార బలమునకు తగినట్లుగా ఆయా ధర్మములు ఫలించు స్వరూపము, మార్గములు మార్పుచెందుచుండఁగలవు. జాతకశాస్త్రమునుండి మన కట్టి యుపదేశము లభించని నాఁడు మన కీశాస్త్రమునుండి ఏ యుపయోగము కాని ఉండఁబోదు. ఇఁక, పురుషకారమునకు దైవమును వంచించు, లేక మార్చు, లేక దానికి రూపాంతరము కల్పించు శక్తి లేదని వాదించువారి కీ శాస్త్రముతో నక్కఱయేయుండదు. ఈశాస్త్ర మననేల? ఏ శాస్త్రమయినా-వైద్యశాస్త్రముకాని, కడకు బ్రహ్మజిజ్ఞాస కాని-వారికి నిరర్థకమే యగును. పోనిండు. జాతకుఁడు కరుణారసానుభవమునకై జనించిన వ్యక్తి. విప్రలంభశృంగార మితని యనుభవమునకు రాతగినది. ఈ ధర్మముల నితఁడు వాచికముగనో, మానసికముగనో అనుభవమునకు తెచ్చుకొని జాతకఫలములకు చెల్లుగట్టవచ్చును. కాయికముగనే అవి అనుభవించితీరవలె నను నిర్బంధము లేదు. జాతకుఁ డెట్లును కవి, గాయకుఁడు, మఱి నటకుఁడుకూడ. కరుణారసముతోటి విప్రలంభశృంగారరసమును కావ్యముగా రచించవచ్చును. సంగీతముగా పాడవచ్చును. రంగస్థలములో అభినయించనువచ్చును. సౌకర్యముకొలఁది ఈమూఁడు మార్గములలో జాతకధర్మమును అనుభవమునకు తెచ్చుకొనవచ్చును. అప్పుడు సామాన్య ప్రాపంచికజీవితమున (కాయికముగా) దాని ననుభవించు నక్కఱ ప్రాయికముగా నుండదు. ఇది వాస్తవముగా చిక్కుసమస్యయే. కాని, నిరాదరించఁదగినది కాదని మాత్రమే నా మనవి.

సాధారణముగా సంతోషకాలమందే, మనస్సున కుత్సాహ మున్నప్పుడే, జనులు సంగీతముపై నభిరుచి చూపుట సహజము. మనస్సు నొచ్చియున్న కాలములో ఎవరైన సమీపమున సంగీతము పాడిరేని ముఖము చిట్లించుకొనువారు సయితము మనకు క్రొత్తలు కారు. కాని, గొప్ప మనఃక్లేశ మేదయినా సంభవించినపుడు కొంతకాల మొంటిపాటున కూర్చుండి రమ్యముగా రాగాలాపన చేసి నాసోదరుఁ డొకఁడు మనశ్శాంతి నార్జించుకొనుట ఎరుఁగుదును. పాలప్రాయపు కూఁతురు భర్తను కోలుపోయి విలపించుచున్న నాఁటి సాయంకాలమున మనశ్శాంతికై సినీమా చూడఁబోయిన తండ్రియొకఁడు నాకు పరిచితుఁడు. ఇట్టి వింతలు విపరీతములుగా కానరావచ్చునేమో కాని, ఇందలి తత్త్వమును విమర్శించినచో, పైన సూచించిన యర్థమునకు కొంత వెలయుండునని చదువరులు విశ్వసించక పోరనుకొందును.

నాయూహలను నామిత్రునకు నివేదించితిని. అతఁడు సంతసించి త్వరలో వివాహప్రయత్నము సాగించుటకు నిశ్చయించినాఁడు అటుమీఁద మేము లోకాభిరామాయణమునకు దిగితిమి. ఆటంబాంబు మొదలుకొని అభిచారవిద్యదాఁక, నానావిషయములు మాప్రసంగములోనికి వచ్చినవి.

"అభిచారవిద్యలో మీకు నమ్మక మున్నదా?" అని నామిత్రుఁడు ప్రశ్నించెను.

"మనకు తెలియని వన్నియు అసత్యమను పిచ్చి నాకు లేదు. గ్రంథము లున్నవి. లోకప్రవాద మున్నది. సత్య మేల కారాదు?" అంటిని.

# TIMES HAVE CHANGED !

## TIME-KEEPERS IN

## B.C. 1400







## *and in* 1945



విజా మినియేచరు ఆబ్ లాంగ్

18 క్యా॥ సాలిడ్ గోల్డు ... రు. 255



మినియేచర్ "ఎఫ్–2"

18 క్యా॥ సాలిడ్ గోల్డు ... రు. 195

రవాణాలు సరిగా లేనందున, ప్రకటించిన రకాలన్ని సప్లయి కాకపోవచ్చును, మా స్టాకులో వున్నంతవరకు ఆర్డర్లను నిర్వహించుటకు సర్వయత్నములు చేయబడును.

## రోజులు మారినవి.

ఆశ్చర్యముగా కనబడినప్పటికి, ఈ గిన్నె 3000 సంవత్సరాల క్రింద టైంకీపరుగా వుపయోగపడేది. అడుగున చిల్లిలోనుండి, నీరు కారుతున్నప్పుడు, గిన్నె లోపలభాగములో మార్కు చేసిన గీతలకు నీళ్ల మట్టం చూపిస్తుండేది. దీనిని బట్టి గంటలను తెలుసుకొనేవారు, ఆ గిన్నె యీ విధంగా యేర్పాటుచేయబడియుండెను.

క్రీస్తు పూర్వము 1400 సం॥ నాటి యీజిప్షియన్ నీళ్ల గడియారమునకు, నేడు మనం జేబులోగాని మణికట్టుమీద గాని యిముడ్చుకొనే గడియారమునకు మధ్య చాలకాలము దాటినది, గడియారములు మామూలు కావడంచేత, వాటిని తయారుచేయటానికి వుపయోగించినకళాభిముల నైపుణ్యము స్ఫురణకురాదు. గడియారం గొప్ప శాస్త్రీయపరికరం కాబట్టి, మంచి నమ్మకముగల గడియారమును వెస్టు ఎండ్ – కొనటమే మిక్కిలి లాభకరము.




BOMBAY CALCUTTA

"నాకు నమ్మక ముండలేదు కాని ఇటీవల నమ్మవలసివచ్చుచున్నది." అని యతఁడు ప్రతి యిచ్చెను.

నామిత్రుని చలితలగ్నమున కిపుడు ఇంద్రుని వేధ ఉండుటయు, కళత్ర వియోగదినమున నది ప్రబలముగా నుండుటయు నాకు స్ఫురణకు వచ్చినది. ఇట్లంటిని: "మీ భార్య అనారోగ్యవిషయమున అట్టి యనుమానమునకవకాశ మున్నదా?"

"అపుడు నాకు తోఁచలేదు. కాని, రాను రాను కార్యకారణసమన్వయము చేయఁగాచేయఁగా అనుమానము ప్రబలమగుచున్నది." అని నామిత్రుఁడు వచించెను.

ఇంద్రగ్రహకార్యమున కర్థము స్ఫురించని నా బుద్ధిమాంద్యమునకు నే నెంతో నొచ్చుకొంటిని. కాని, ఇంద్రుని "మాయాబజారు"లో కడకు మంచివస్తువే దొరకినదని సంతసించితిని. తన యూహలకు కారణములను నా మిత్రుఁడు వివరించినాఁడు. ఆ కథలోని సారాంశ మిది:—

రమారమి మూఁడుసంవత్సరముల క్రిందట చక్కని చుక్కవంటి యొక శిష్యురాలు నా మిత్రునికి లభించినది. నిగనిగలాడు రూపలావణ్యములు కలిగి, నూత్న తారుణ్యము మిసమిసలాడుచుండిన ఇరువది సంవత్సరముల పాలప్రాయ మాచిన్నదానిది. వివాహ మొకటి అయినదఁట కాని, విద్యా వ్యాసంగము చేయుచున్న కారణమున, దాంపత్య జీవితము నింకను సంపాదించుకొనియుండలేదా విద్యార్థిని. కొన్ని నెలలముందే, దురదృష్టవశమున, భర్త పరలోక ప్రయాణము చేయఁగా, పరీక్షలో తప్పిపోయి ఆమె తల్లితో కూడ పట్టణమును చేరుకొన్నది. నిరాధారయగుటచే—తండ్రి గతించి చాలకాలమయినదఁట—జీవికను సంపాదించుకొనఁగోరి ప్రవేశపరీక్షకు వ్యాసంగము చేయుచు విద్యాదానమునకై యా సుందరి జాతకుని నాశ్రయించినది. అనన్యగతికయైన ఆ సజాతీయతరుణిప్రార్థనమును దయాశాలియగు జాతకుఁడు నిరాకరించఁగలఁడా? యామినీపూర్ణతిలకకు బిల్హణకవి దొరకినట్లయినది. రూపములో 'రతి'వలె నున్న యా కాంతను విద్యలో 'భారతి'గా చేయవలయు నను గట్టి సంకల్పము మన మిత్రునకు కల్గినది. అతఁడు సంఘసంస్కారప్రియుఁడు కూడ. ఇతరులకు మార్గదర్శకుఁడై, ఆ వితంతుయువతికి తగిన వరుని నొకని కుదిర్చి పునర్వివాహమును తన యధ్వర్యముతోనే నడపవలెనను నిశ్చయము సయితమాతనికి వచ్చినది. క్రమక్రమముగా ఆచార్యుని కంతేవాసినిపై అపారమగు దయ కలుగుచువచ్చెను.

ఈ మధ్యకాలములో నొక విచిత్రసంఘటనము జరిగినది. 1942-వ సం. న ప్రపంచ సంగ్రామమువలని అశాంతి మదరాసునగరమున సయితము కొంత తల సూపినది కదా? తత్ఫలితముగ, అండవదలు నభ్యాసము లేని ఆలుబిడ్డలను దూరదేశపు గ్రామాంతరముల కంపి, వృత్తిని వదలలేక నగరమున నొంటిగా కాపురమును సాగింపవలసిన క్లేశప్రాప్తి అపుడనేకులకు వచ్చియుండెనని చదువరులు మరచియుండరు. అట్టివారిలో మన కథానాయకుఁడుసయిత మొకఁడు.

సప్తమాధిపతి యగు శనికే అష్టమస్థానాధిపత్యముండి ధనస్థానమునందలి బృహస్పతితో త్రికోణశుభదృష్టిలో నుండుటచే, జాతకునికి భార్యామూలముగా గొప్ప ధనప్రాప్తికి సూచన కలదు. కాని, ఆ బృహస్పతితో లగ్నాధిపతియగు చంద్రునికి మైత్రి కుదరలేదు కదా? రావలసిన ధన మెట్లు రాఁగలదు? అత్తగారి కుట్రచే మామగారి సత్సంకల్పము నెరవేరినది కాదఁట! అగుటచే అత్తగారింటిలో అల్లునికి సామరస్యము తప్పియుండినది. మూఁడునాలుగు మాసముల కాలము భార్య పుట్టినింటిలో నిలుచునంతలో, కుట్రలో ఆమెకుసయితము సంబంధ ముండెనను భ్రాంతి జాతకునికి కలుగుటకు కారణము లేవో కొన్ని ప్రబలముగా కానవచ్చినవఁట! సాధ్వియగు భార్యపై అకారణద్వేషభావము నా మిత్రునికి జనించినది. ఆమెను విచారించునక్కరలేకయే నిస్సంశయముగ ఆమె దోషియే యని తనంత తానే జాతకుఁడు తీర్పు

చెప్పినాఁడు. ఇది మామూలు న్యాయస్థానము కాదు; ఇంద్రుని "మాయాబజారు"లోని కోర్టు! ఈ శిక్ష స్మృతి మనువుకాని, పరాశరుఁడుకాని చెప్పినది కాదు; వరుణాగ్రహము శాసించినది.

ఈ వయస్సునకు చలితవివాహసహమబిందువు మీనరాశి 15½ భాగకు వచ్చుటచే, జాతకమందలి ఇంద్రావరుణు లిరువురి దయకు పాత్రమగుట సంభవించినది. జన్మకాలమున పరస్పరశత్రువులగు వీరు వైవాహికజీవితవిషయమునమాత్రము మిత్రులవలె నాటకమాడుచున్నారు. గుణవంతురాలగు భార్యపై కుట్రనేర మారోపించఁబడినది. ఆమెపరోక్షమందే విచారణ జరిగినది. రాజద్రోహముకంటె భర్తృద్రోహము పైమెట్టునేరము! నిందితురాలి పక్షమున ప్రతిసాక్ష్య మున్నదా యని విచారించు నవసరమే లేదు. ఆమెపరోక్షమందే తీర్మానము సయితము! యావజ్జీవము పుట్టినింటివాసమే శిక్ష! భార్యను పరిత్యాగముచేసి అత్తవారింటికి తెలియకుండ వేరొక వధువును వెంటనే వివాహమాడవలె ననియెడి యుత్కంఠ జాతకునకు ప్రబలినది. తగిన కన్యక, లేక వధువు దొరకుటకై ప్రయత్నము. కాలమునకై వేచియుండిన మన యామినీపూర్ణతిలకకు చక్కని యవకాశ మిపు డబ్బినదికదా? ఆమెకలికిచూపులలో వాడి హెచ్చినకొలఁది, అందములో మాధుర్య మధికముగా జాతకుని కంటికి కానరాసాగెను. పునర్వివాహమునకు వేరువరుని వెదకు ప్రయాసకంటె తానే ఆమె నేల స్వీకరించి ఉద్ధరించరాదు? శిష్యురాలి చికిలిచేష్టలలో "తెరతీయఁగరాదా?" అను రమ్యమైన రాగాలాపనము మన కవికి వినవచ్చినది. ఆమె మందహాసములో నతనికి చంద్రోదయమైనది. తెరఎత్తినాఁడు. "హరిణవిముక్తశీతాంశుబింబము కాని, పురుడింపఁగా నిది మోము కాదు." అని తోఁచిన దతనికి. ఏమి ఈకాల కర్మసంయోగ మహిమ!

అరచేతిలో నున్నది వెన్న. ఆత్రమేల? విద్యాభ్యాసము పూర్తియైన తరువాత మంచిముహూర్తము నిర్ధరించుకోవచ్చును. ఈమధ్యకాలమున పరస్పరప్రేమ దృఢమూలమగుటకు మంచి యవకాశ మున్నది. పాఠప్రవచనము బాగా జరుగుచువచ్చెను. ఇంక ఎన్నాళ్లో కాచుకోవలసిన అక్కర యుండదు. కాని ఇంతలో పుట్టినది పానకములో నొక పుల్ల! సంతానమునకు గొప్ప అనారోగ్య మను వార్త వచ్చినది. జ్ఞానాజ్ఞాన స్థితిలో "నాయనా, నాయనా" అను కలవరింతలఁట! ఆత్రమున జాతకుఁ డత్తవారింటికి పోవలసి వచ్చినది. విధిలేక, అచట భార్యను చూడవలయుఁగదా? అమాయిక ధర్మశీల ఆ సాధ్వి. ఆమెతో మాటలాడినదేతడవుగ, మతికి కప్పియుండిన మాయమబ్బు లన్నియు విడిపోయినవి. అప్రయత్నముగా ఆమె నిర్దోషి యనుటకు చాలినంత ప్రబలసాక్ష్యము వచ్చినది. తన అసంప్రేక్ష్యకారిత్వమునకు చాల నొచ్చుకొని, ప్రత్యుత్పన్నమతి కావున, జాతకుఁడు పశ్చాత్తప్తుఁడై క్షమాపణ నర్థించినాఁడు.

సంసారము మరల ప్రాతపంథలోఁ బడినది. శిష్యురాలి కిది గొప్ప ఆశాభంగము. కాని, ఆ చతుర అంతటితో నిరాశచెందునంతటి దుర్బలహృదయ కాదు. మెల్ల మెల్లగా జాతకుని భార్యనే ఆమె ఆశ్రయించుచువచ్చినది; ఇంటికి రాకపోక లధికముకాసాగెను; "అక్కగారికి" పనిపాట్లలో సహాయపడుట కామె అలవాటు చేసుకొన్నది. ఆచార్యానుగ్రహమువలన పరీక్షలో నెగ్గి, బోధనాభ్యాసన పాఠశాలలో పరిశ్రమ సలిపి, ఉపాధ్యాయవృత్తి నార్జించి జీవికను కొనసాగించుచున్నది కాని, గురుదక్షిణ సమర్పింపవలసిన బాధ్యత నామె మరచిపోయినది కాదు. రజాదినములలో ఆచార్యుని యింటనే నిలుచు నభ్యాసము క్రమక్రమముగా వచ్చిన దామెకు. జాతకుని భార్యకీ "చెల్లెలి" పై గొప్ప విశ్వాసము.

"వేరే వరుఁడు కావలెనని వెదకుట ఏల? మీరే చేసుకోండి. నాకు సహాయముగా ఉండును" అని యొకనాఁడు జాతకుని భార్యయే భర్తతో ప్రస్తాపించునంతదూరము సంవిధానపుతంతు నడపించిన దా ప్రోడ. కావచ్చునన్నాఁడు మన కవి. ముహూర్తముల కాలము రావలయుకదా? తొందర యేల?

ఇంతలో పట్టుమని పదునైదు దినములు శిష్యురాలు గురువుగారింటనే నిలువవలసిన పరిస్థితి వచ్చినది. 1944 నవంబరు నెలలో మన మిత్రుఁడు కార్యవశమున దూరప్రయాణము చేయవలసివచ్చి తన భార్యకు తోడుగా శిష్యురాలిని తన యింటనే నిలువుమని చెప్పి పోయినాఁడు. శిష్యురాలి యానందము మేరఎఱుఁగదు. ఇఁక, ఆ యిల్లు వదలునక్కరయే యుండఁబోదుకదా ? కాని, జాతకుఁడు మరలివచ్చినంతనే కథ అడ్డముగా తిరిగినది. ఈ మధ్యకాలములో నేమి జరిగినదో, తెలియదు. "పొరఁబాటు క్షమించండి. ఈమె మన మనుకొన్నంత శీలవతి కాదు." అని జాతకునితో నతని భార్య చెప్పినది. తగినంత ప్రబలకారణము లేనిదే తన గృహిణి యిట్లు తీర్మానించునది కాదను విశ్వాసము జాతకునికి కలదు. తన ఆశ వదలుకొమ్మని ఖండితముగా శిష్యురాలికి చెప్పి అతఁడామెను పంపివేసినాఁడు. ఎంత పరితాపపడినదో, ఆ కామిని చెమ్మగిల్లిన కన్నులతో జాతకుని భార్యను తీక్ష్ణముగాఁ జూచుచు ఇల్లు వెడలిపోయినదఁట! "అమవస పీటపట్టుకొని యాఁగునె, పున్నమ రాక పోవునే ?" అనుకొనుచు నామె వెడలిపోయెనేమో ?

తరువాత వారముదినములలో నొక నాఁడు (9-12-1944) అరుణోదయకాలముననే నిద్రమేల్కాంచి ఇల్లు వెడలిరాఁగా, తలవాకిటి కెదురుగా, అతిసమీపమందే, తారురోడ్డులో తోడిన చిన్నపల్లమునందు రక్తాక్షతలు, రక్తపుష్పములు మున్నగు విచిత్రపూజా సామగ్రితో చిన్న స్త్రీప్రతిమ యొకటి కానవచ్చినది. పామరు లెవరో యింటివాకిటనే "దాటు" తీసినారనుకొని ఆ ప్రతిమ నెత్తిపారవైచినాఁడు జాతకుఁడు. తరువాత నెలానరకే అతఁడు కళత్రమును కోలుపోవుట! ఔర్ధ్వదైహికక్రియలు ముగిసిన కొన్ని దినములకే యొకనాఁడు శిష్యురాలు గురువుగారి యింటికి అనాహూతగా వచ్చి, ఒంటిపాటుననున్న అతని ముందు నిలిచి, మంచి గుండెనిబ్బరముతో, నెమ్మదిగా, "సాయంకాలము నా సామానులు తీసుకొని వత్తునా" అని యడిగినది.

దైవప్రాతికూల్యమువలన జాతకుని పరిస్థితులపుడు పూర్తిగా మారిపోయినవి. ఇల్లాలస్తమించినది. బిడ్డలకు రక్షకులు లేరు. పైఁగా, మంచి యౌవనములోనున్న రసికుఁ డతఁడు. కాక, ఆమె సంపాదించినంత చను వనితో వేరెవ్వరుకాని సంపాదించలేదు. చాల నందుకు, తన రూపము, తన తారుణ్యము, జయించఁగలనను ధైర్య మా జవ్వనికి వచ్చియుండినచో, అది అప్పటి పరిస్థితులలో అస్వాభావిక మనఁజాలముకదా. నా ఆశ వదలుకొమ్మని నిరసించిన ఆనాఁటి సాహసము నేఁ డతనికి ఉండదని యాకాంత ఊహించినది; ఇఁక అతని ప్రార్థించుటకాని, ప్రేమభిక్ష నర్థించుటకాని అనవసరమని నిర్ధరించినది కాఁబోలు, శాస్త్రార్థ మొక ప్రశ్న వేసినది. తథాస్తని కృతజ్ఞతచూపక గురు విపుడేమి చేయఁగలఁడని యామిటారినమ్మకము. వెంటనే రెండు ఎత్తిపొడుపు మాటలు వడ్డించి కసితీర్చుకో వలయునని ఆశ.

కాని, దైవ మన్యథా తలఁచినది. ఇల్లాలిని పోఁగొట్టుకొని ఏడ్చుచున్న జాతకునికి సాంత్వన వాక్యములా, సమాశ్వాసమా ? అతనికి "సామానులు" కావలయునా ? ఆర్ద్రహృదయము గల రసపిపాసి యతఁడు. అనాశ్వాసితదుఃఖితుఁడు. "అయ్యో, పాపము." అని యుండినచో, ప్రాఁతకథ మరచి అతఁ డపుడేమిచేసియుండునో ? కడకు అమ్మలేని బిడ్డల నించుక యాదరించియుండెనేని, కృతజ్ఞతతో కన్నుల కొత్తుకొని, అప్పుడే—ముహూర్తముతోకాని, పురోహితునితో కాని పనిలేకయే—ఐదువతనపు వరప్రసాదమును శిష్యురాలి కాచార్యుఁ డనుగ్రహించియుండును. కాని, ఆశుపరుష వాక్యములో అపు డతనికి వీరసము కాని గోచరించలేదు. నీరసముతప్ప. కానవచ్చినదంతా రాక్షసప్రకృతి—రసాభాసము! భార్యమరణము కొరకే పిశాచి వేచియుండెనేమో అను అసహ్యభావ మతనికి కలిగినది. విరసమే తరువాతి మెట్టు. శిష్యురాలిని కఠినముగా తిరస్కరించినాఁడు జాతకుఁడు. నిన్నే నమ్ముకొనియుంటినే యని దీనముగా ఆమె యంగలార్చినది; కన్నుల నీరునించి చూచినది. జాతకుని

హృదయము కరఁగలేదు. ఇల్లాలియుపదేశము స్ఫురణకువచ్చినది. గోడపైనున్న భార్య 'ఫోటో' వంక తిరిగినాఁడు.

"ఇహ రూపమాత్రసారే
చిత్రకృతే కనకకహ్లారే,
నరసో, నాపిచ గంధో,
మధుకరబంధో! ముథా పరిభ్రమసి."

అని యాఛాయాచిత్రమందలి వ్యక్తి హెచ్చరించినట్లయినది.

"శీలమునకు సాక్ష్యము తీసుకొని కాని నాకు ముఖము చూపకుము. పొమ్ము." అని ఖండితముగా శిష్యురాలి నింటినుండి జాతకుఁడు పంపివేసినాఁడఁట. అవమానితయగు కామిని పామువలె పగబట్టునని అతని కప్పుడు తోఁచినదే కాదు.

ఆమరునాఁడుదయమున బాలకుఁ డొకఁడు పాత్రలో నుపహారపదార్థ మేదో తెచ్చి జాతకుని సమీపమందుంచి శిష్యురాలు 'ఫలహారము' పంపినదని చెప్పినాఁడు. ఆసమయమునకు మిత్రుఁడొకఁడు జాతకునియొద్ద నుండి యాపదార్థములను చూచి, అనుమానించి, పరీక్షించి, ఇది సంశయాస్పదమని హెచ్చరించెనఁట! తెచ్చియిచ్చినబాలకునితో నాపాత్రనట్లే శిష్యురాలికి గురువు తిరుగఁబంపినాఁడు. ఇంద్రావరుణుల నాటకమున కది భరతవాక్యము.

కథ ముగిసినది. తరువాత గురువుకంటఁబడలేదాశిష్యురాలు. సాక్ష్యము లభించెనో లేదో పాపము! కొన్నినెలలలో ఎవ్వరినో వివాహముచేసుకొన్నదఁట! ఆమె తనతల్లితోకూడ కొన్ని సంవత్సరముల కాలము మళయాళదేశమున కాపురము చేసియుండెనని జాతకుని కిటీవల తెలిసినది. ఇవన్నియు తన ఊహకు కారణములని నామిత్రుఁడు చెప్పినాఁడు.

నాకుఁ గలిగిన ఆశ్చర్యము పారమెరుఁగదు. ఇంద్రగ్రహకార్య మింత విస్పష్టముగా చూపినదే జాతకమని పొంగితిని. శిష్యురాలి జాతకము సంపాదింపఁగల్గినచో, కుజశుక్రుల కులుకులలో ఇంద్రావరుణుల కుట్ర కలిసియుండుట చదువరులకు చూపవచ్చునని యెంచితిని. నామిత్రుఁడు దయతో నొసఁగిన సామగ్రితో ఈక్రింది సాయనజాతకచక్రము సాధింపఁబడినది:—

| | | | |
|---|---|---|---|
| (వ) వ 13-30 X 7 | కే 4-1 | | I 15 బు 22-30 |
| | (సాయనము) | | ర 10-13 |
| | శిష్యురాలు | | ఇ 14-24 శు 15 -42 |
| కు 12-29 (వ) | | శ 1-32 రా 4-1 గు 10-0 చ 23-6 | |

చిత్తానక్షత్ర మీ జాతకురాలిది. "చిత్రేషు చిత్రాభరణా సురూపా" అనురీతి వన్నెకుఁ దగిన రూపము, రూపమునకు సరివచ్చు నలంకారము కల కాంత యీమె. ఇంద్రశుక్రు లొకచో చేరి లగ్నముపై స్నేహదృష్టిని బరపుచున్నారు. లావణ్యమునకు కాని, విలాసవిభ్రమములకు కాని ఏమి కొదవ? అందులో ఇంద్రశుక్రులుండునది సౌందర్యమునకు పేరుకాంచిన సింహరాశివర్గోత్తమాంశ! తళుకుచూపులలో అందమునకు తగిన వాడి, వాడికి సరిపోను మోసము చూపట్టఁగలవు. చాలదని, కుజుని మిత్రదృష్టి యీ శుక్రేంద్రులపై నున్నది. చిక్కని భ్రూలతలు లలాటమున చిందులు త్రొక్కుచుండఁగా, ఆ మిటారి కనుసోగలనుండి వెలువడు కొంటెచూపులలో కొండంత విష మున్నదని నా మిత్రుఁడు వర్ణించినచో ఆశ్చర్యమేమి? ఇట్టి శుక్రునకే పంచమస్థానాధిపత్య మున్నది.

విషయసుఖకాంక్ష, కామకళాకౌశల్యము ఎంత అధికముగ నున్నవో, అంతకు సాటివచ్చు చాతుర్యము, పాటవము జాతకురాలికి కల దనవచ్చును. తులా రాశిలో విషయసుఖస్థానములో నున్న చంద్రుఁడు పురుషుల నతిసులభముగా నాకర్షించు శక్తి నీఁగలఁడు, కాని ప్రేమకు చాంచల్యము నిచ్చును.

లగ్నము మిథునము. అందే కలఁడు లగ్నాధిపతి బుధుఁడు తెలివి తేటలు, చికిలిచేష్టలు సమృద్ధిగా నుండఁగలవు. "కఠినమగు హృదయము. తీక్ష్ణమగు తెలివి కలుగుకారణమున మిథునలగ్నములో జనించిన స్త్రీలే ప్రపంచమందలి మిటుకురాండ్రలో నగ్రగణ్యలు." అని యొకానొక పాశ్చాత్యహోరాశాస్త్రవిమర్శకుఁడు—కార్టరుకాఁబోలు — నిర్వచించినాఁడు. మనవారు సయితము మించుమించుగ నిట్టి గుణములనే మిథునలగ్నపు స్త్రీల కారోపించిరి. చూడుఁడు:—

"తృతీయలగ్నే తికఠోరవాక్యా
స్త్రీ కామసక్తా గుణవర్జితా చ." (స్త్రీ జాతకము)

ఇఁక జాతకములో కుజుఁడున్నస్థానము సప్తమ భావములో నని గమనించినచో, గుండియ లదురుచున్నవి. మనవారీకుజుని ఫలము నిట్లువర్ణించిరి:

"అస్తస్థితో వై ధరణీసుతస్తు
బాల్యే ప్రసూతే విధవాంచ నారీం
దుష్టస్వభావాం విభవేన హీనాం
సుకుత్సితాంగీం గుణవర్జితాంచ." (స్త్రీజాతక.)

విశేష మేమనఁగా దశమకేంద్రమందున్నవాఁడు వరుణుఁడు, వ్యధికరణశాలి. కార్యములలో మూఁడవ మార్గము చూపట్టును. ఇట్టి వరుణుని కేంద్రవేధలోనే భర్తృస్థానమందలి కుజుఁ డుండుట! ప్రళయకాలదావానలజ్వాలకు ప్రబలఝంఝామారుతము తోడయినది. అడుగుపెట్టిన ఇంట అశనిపాతము నాహ్వానించినట్లుండఁగలదేమో?

అది యట్లుండె. శిష్యురాలి రవి ఉపాధ్యాయుని వరుణుని కెదురుగా నిల్చి యుద్ధసన్నద్ధుఁడుగా నుండుట చదువరులు గమనించఁగలరు. ఆమె వివాహసహమబిందువు (తులారాశిలో 14°-15′) కథానాయకుని ఇంద్రావరుణులతో ప్రతికూలించినది. ఆమెచంద్రునితో నతని కుజునికి పూర్ణకేంద్రవేధ! ఇట్టి వీరిరువురు వివాహబంధమున ముడివడఁగలరా? పడినచో బంధము నిలువఁగలదా? మఱి ఇంత కథ యేల యందురేమో? జాతకుని ధనస్థానమందున్న గురువుపై ఈమెజాతకమందలి ఇంద్రశుక్రులు నిలిచినారు. భర్తృస్థానమందున్న కుజునితో అతని బృహస్పతికి మైత్రి. ఆ కారణమున శిష్యురాలి ఇంద్రశుక్రులు తమ వశీకరణఘుటికను ప్రయోగించి ఆచార్యుని గురువుతో "హల్లో! మైడియర్" అని చేరుకొన్నారు. అతనినుండి విద్యయేకాక, కొంత ద్రవ్యమును సయితము మాపె సంపాదించినది. అంతే!

ఇఁక దశలం జూతము. ఆమెజాతకమున చలితకుజుఁడు, చలితశుక్రుఁడు పరస్పరకేంద్రములో నున్నవయ స్నది. భరింపనలవికాని మదనతాపమును సూచించు దశ యిది యనవచ్చును. అట్టి చలితకుజుఁడు (ధనుస్సులో 11°-38′) కథానాయకుని చలితరవిని స్నేహదృష్టిచే నాకర్షించుచున్నాఁడు. కాననే యీ యాకర్షణము. చలితవివాహసహమబిందువు వృశ్చికరాశిలో 6-వ భాగకు పోయి ఉపాధ్యాయుని జన్మరవితో, అతని చలితశుక్రునితో, మిత్రదృష్టి నార్జించుట మఱియు విశేషము. చలితలగ్నము మెల్లగా అతని జన్మరవి నాశ్రయించుట సయితమిప్పుడే. దశ యింత బలమైనది కావుననే, అతనిని తన వలలో వేసుకొనుటకై ఆవామలోచన యిన్ని పడుపాట్లు పడుట! కాని, వరుణుఁడు కడకు తన పని తాను జయప్రదముగా నిర్వహింపఁగల్గుటచే జాతకుఁడు గండము గడచుకొని ధన్యుఁడైనాఁడు. అతని పుణ్యసహమబిందువు (కటకములో 20°-13′) యొక్క చలితస్థానమందే యిప్పు డతని చలితగురు వుండి రక్షించినాఁడు. పూర్వపుణ్యము మంచిది.

పోనిత్తము. ఆమెనుకూర్చి జాతకునికి వచ్చిన యనుమానములో నేమైన సత్యమున్నదా యని విమ

ర్శించుట శాస్త్రదృష్టిలో లాభకారి. అభిచారకర్మ జరిగియుండు ననుకొన్న నాఁటి గ్రహస్థితి యిట్లుండును:-

| | | | |
|---|---|---|---|
| | | | వ10-52(వ) |
| | (సాయనము) అభిచార కర్మ | | శ 8-54 రా 20-0 |
| శు 27-13 కే 20-0 బు 7-14 | | | |
| ర 16-48 కు 9-35 | | చ 1-44 ఇ 6-12 | గు 25-42 |

పరస్పరసమసప్తకవేధ నభిలషించుచున్న కుజవరుణులను చూడుఁడు! జన్మకాలమున కుజవరుణుల క్రౌర్యమున్న జాతకురాలీమె. అది ఫలించుటకు మరల ఆరెండు గ్రహములు సిద్ధముకావలయునుగదా? అయినా రిపుడు. ఆమెచలితశుక్రుఁ డిపుడు కన్యారాశిలో 11-వ భాగలో నుండుట. అనఁగా తాత్కాలిక కుజవరుణుల మధ్యములో ననుట! నాఁటి కుజవరుణ క్రౌర్యములో స్త్రీవియోగకార్య మున్నదని సూచన. కథానాయకుని చలితరవితో ఈకుజవరుణు లిరువురు మిత్రదృష్టిలో నుండి "భాయి, భాయి" అనుచుండుట ప్రయోజనమును తెలుపఁగలదు. దైనిక దశమకేంద్ర మామె కానాఁడు సింహరాశిలో 15-వ భాగలో నుండుట వింతలలో వింత. జాతకమందలి ఇంద్రశుక్రసంయోగస్థానమందే అది యాదినమున నిలుచుట! వ్యామోహము, ద్రోహచింతనము, క్రౌర్యము, స్త్రీవియోగ ప్రయోజనము ఇవి ఆమె ఉద్యోగములో నాఁడు కానవచ్చునేని అది యీ యోగమునకు తగియుండును. ఇంద్రశుక్రు లాయంతే వాసినిచే ఆచార్యుని కిప్పించిన గురుదక్షిణ యిది కాఁబోలు?

కళత్రవియోగము కల్గిన నాఁటి చక్రమును గమనింపుఁడు. దైనికదశమకేంద్ర మానాఁడు ఆమెజాతకమందలి చలితశనిస్థానములో (తులారాశి 3-వ భాగ) నున్నది. చంద్రుఁ డుండుట జన్మశనిపైననే. ఆమెజాతకమున శనికి మృత్యుస్థానముపైనకదా అధికారము? ఇఁక, ఆమెదైనికలగ్నము ధనుస్సులో 29-వ భాగలో నుండుట గొప్ప విశేషము. అనఁగా, కథానాయకుని జన్మచంద్రునికి సాక్షాత్ సప్తమ (భార్యా) స్థాన మది. ఆచంద్రుఁ డతని లగ్నాధిపతికదా? నాఁటిపరిస్థితులలో ఆమెచిత్తవృత్తి కర్థము గ్రహములే చెప్పుచున్నవి. ఆచార్యుని కాశిష్యగాలు ఆత్మసమర్పణము చేయఁ దలఁచియుండినచో ఆశ్చర్యముండదు.

ఇవన్నియు చూచినచో జాతకుని ఊహలు, అనుమానములు నిర్హేతుకము లనుట కష్టము. ఆబొమ్మ ఎవరుంచిరో, వారి యుద్దేశమేమో, అభిచారవిద్యలో నెంత శక్తియున్నదో మన ప్రకృతవిమర్శకు అనవసరము. అంతా "మాయాబజార్" కావచ్చును. ఆబజారులో వస్తువులన్నియు ఇంద్రుని సృష్టియనుట మాత్రమే మన కిపుడు కావలసినది.

ఇంకొక్క విశేషమును పాఠకమహాశయులకు నివేదించి చాలింతును. జాతకుఁడు కథానాయకురాలి ప్రేమను నిరాకరించినప్పటి గ్రహప్రపంచ మీక్రింద నున్నది:—

| | | | |
|---|---|---|---|
| చ 19-55 | శు 11-47 | | వ 9-6 |
| ర 25-26 బు 14-32 కు 0-5 | (సాయనము) శిష్యురాలి ప్రేమకు తిరస్కారము | | శ 4-11 రా 16-27 |
| కే 16-27 | | | |
| | | ఇ 6-3 | గు 25-47 |

తాత్కాలిక శుక్రుఁడు ఒకవైపున జాతకురాలి చలితకుజునితో, మఱియొకవైపున కథానాయకుని చలితరవితో ప్రత్యక్షస్నేహదృష్టిని బొంది సయ్యాటలాడుచు, ఆమెహృదయమందలి యుత్కంఠను చాటుచున్నాఁడు. ఆమెకోరికెలు (ఆమెకుజుఁడు భర్తృస్థానాధిపతి) ఎవరి దిక్కున నున్నవో, ఇంతకంటె స్పష్టముగా చూపుట సాధ్యమా ? జాతకమందలి ఇంద్రశుక్రులకు తాత్కాలిక బుధుఁ డెదురునిలిచిన దినమది. బుధుఁ డామెకు లగ్నాధిపతి. సమ్మోహనాస్త్రము పారలేదు. ఏలందురా ? ఈ బుధుఁ డానాఁడు నిలుచుట కథానాయకుని జన్మగురువునకు సమసప్తకములోనే. బుద్ధికి మోసము వచ్చినది. రసాభాసముగా నామె ప్రవర్తించినది. లేదా, కథానాయకుని దృష్టిలో అట్లు కానవచ్చినది. ఇవన్నియు నిట్లుండ, ఆమెదైనికలగ్న మా దినమున మకరరాశిలో 16-వ భాగలో నున్నది. అనఁగా, కేతువుతో సంయోగము! కథానాయకుని జాతకమున కళత్రభావమందున్న వరుణగ్రహస్థానము సయితము అదే. అతని భార్యాస్థానము నాక్రమించు కుతూహలముతో ఆకామిని కావించిన ప్రయత్నము లన్నియు జాతకుని సప్తమభావమందలి వరుణుఁడు ధ్వంసముచేసినాఁడు. తలలేని మొండెముకదా కేతువు? అట్టి కేతువుతో ఆ దినమే దైనికలగ్నమునకు వచ్చిన సంయోగము తలవంపులు తెచ్చినది. "ఇక్షుశరాసన సాయకవ్యథాఖిన్నత వాడి వత్తయయి,...పయిగాలి సోకినన్, వెన్నవలెన్ కరంగు" స్థితిలో నున్న యీ జవ్వనికిట్టి గౌరవము తలవంపులుకాక వేరేమి? ఎంత దుఃఖించెనో, ఎంత పరితపించెనో ఆ సుందరి?

మన ఆంధ్రకవితాపితామహుఁ డీకథ వినియున్నచో, ఆగ్రహోదగ్రుఁడై,

"తరుణి, ననన్యకాంత,నతి
దారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి, నంగభవు
బారికి నగ్గముచేసి, క్రూరుఁడై
చనియె కవీశ్వరాధముఁ డ
హాహంకృతితో"

అని యొక కావ్యమే వ్రాసియుండునేమో? శిరీషకుసుమ కోమలహృదయముకదా ఆమహాకవిది?

మన కథానాయకుఁడు సయితము చాల జాలిగుండెకలవాఁడే. కాని, అతని వరుణగ్రహముపై తన దైనికలగ్నము వచ్చిన దుర్ముహూర్తపు దినమందే— సంవత్సరకాలములో నిది యొకదినము మాత్రమే— ఆతనితో నీప్రసంగము దెచ్చుట శిష్యురాలి దుర్దైవపరిణామపు ఫలము. కాననే, ఆమె నంత కఠినముగా పరీక్షించినాఁ డతఁడు. మీసరగండఁడగు కుజుఁడు భర్తృస్థానములో నున్న మిథునలగ్నపు మిటారికత్తెల విషయములో, ఇంద్రుని సాచివ్యము గల కుజశుక్రుల దశాసామ్రాజ్యకాలమున, ఇట్టి విషపరీక్ష అన్యాయమని కథానాయకుఁ డెఱుఁగఁడుకదా?

వీరి జీవితము లిఁకమీఁదనైన శాంతియుతములుగా వర్ధిల్లుగాతమని భగవంతుని ప్రార్థింతముగాక.

# కలగూరగంప

## కీ. శే. శ్రీ భానుమూర్తి పంతులు

చెన్నాప్రగడ భానుమూర్తిపంతులుగారు ౧౮౬౮-వ సంవత్సరమున జన్మించిరి. వీరు పశ్చిమగోదావరిజిల్లా నరసాపురముతాలూకా వాస్తవ్యులు. రాజమహేంద్రవరరాజకీయకళాశాలయందు విద్యాభ్యాసమొనర్చి పట్టభద్రులై తరువాత ట్రెయినింగును సైదాపేట టీచర్సుకాలేజీలో పొందిరి. యల్. టి. అయి పంతులుగారు బందరు నోబులుకాలేజిలో గణితశాస్త్రాధ్యాపకులుగా పనిచేసిరి. తమ నిరాడంబరజీవితముచే విద్యార్థుల నాకర్షించిరి. పంతులుగారి పరిశుద్ధప్రవర్తనము, సర్వతోముఖపాండిత్యము విద్యార్థిలోకమునకు పూజనీయము లైనవి. శ్రీ భానుమూర్తిగారివలన గణితశాస్త్రోపన్యాసములనేగాక జాతీయ అంతర్జాతీయపరిస్థితులనుగూర్చి, విశేషించి ప్రాచీనభారతసంస్కృతిని గూర్చి వినుటకు శిష్యు లుత్సాహమును చూపుచుండెడివారట. వెంటనే వారి కోరికలును మన్నింపబడుచుండెడివట. నాడు నోబులుకాలేజికి ప్రిన్సిపాలుగ నుండిన పెన్ దొరగారు శ్రీ భానుమూర్తిపంతులుగారి వలన భగవద్గీతయందలి ఆధ్యాత్మికవిషయముల నన్నిటిని తెలిసికొనుచుండెడివారట. మచిలీపట్టణమున నున్నప్పుడు శ్రీ పంతులుగారు సంఘసంస్కరణోద్యమమునందును, ఇతరజాతీయోద్యమములందును శ్రీ కొండ వెంకటప్పయ్యపంతులు, శ్రీ హనుమంతరావు పంతులు మొదలగువారితో పనిచేయుచుండెడివారు. దేశభక్తిగీతముల ననేకముల నప్పటికే రచియించి ప్రసిద్ధములగు ఆంధ్రపత్రికలయందు ప్రకటించియుండిరి. "సుజలాం సుఫలాం"అను జాతీయగీతమును అనువదించియుండిరి. పెక్కుసభలయం దివి గానముచేయబడుచుండెడివి. అనేకములగు దేశభక్తిగీతములు వందేమాతరోద్యమఫలితముగ వ్రాయబడినవే.



౧౯౧౦-వ సంవత్సరమున శ్రీ భానుమూర్తి పంతులుగారు బందరును వదలి మద్రాసునకు గవర్నమెంటు తెలుగుట్రాన్సులేటరుగ వెళ్లిరి.

ప్రభుత్వోద్యోగమున నుండియు పంతులుగారు ప్రజోపయోగకర కార్యములందలి అభిమానమును వదలినవారు కారు. ఆరోజులలో ఆంధ్ర,కృష్ణాపత్రికలకు ప్రభుత్వమువారివలన కలుగు ఆపదలను అన్నిటిని గడవ

బెట్టినవారు పంతులుగారు. ఈపత్రికలకు ఏమునష్టము రాకుండ కాపాడుచుండెడివారు. తమ దేశీయులందు విజ్ఞానము వృద్ధిచేయుటకు ఆధారము లైనవి ఈపత్రికలే అని పంతులుగారు గుర్తించియుండిరి.

పరమధర్మములకు అహింసాపాతివ్రత్యములకు ఆదర్శవ్యక్తులగు జయదేవపద్మావతుల చరిత్రను అఖిల లోకోపకారక మగునని గద్యపద్యముల రచియించిరి. మానవాతీతమగు శక్తిని సంపాదించి ప్రాణములు వీడి పడియున్న తన భార్యయొద్దకు పోయి భగవత్సంకీర్తనము చేసి ఆమెను బ్రదికించిన పరమభాగవతుడగు జయదేవునియొక్కయు, భర్తృసేవాతత్పరయగు పద్మావతీసతియొక్కయు ఉత్కృష్టగుణము లిందు వర్ణింపబడినవి.

వదాన్యతకు వాసికెక్కినవారు పూర్వయుగము లందలి ప్రభువులే కారనియు, కలియుగమునందలి సామాన్యగృహస్థులును కొందరు గల రనుటకు నిదర్శనముగ ఒక వదాన్యుని చరిత్రను వ్రాసిరి. ఆర్యమతమున శీలమునకున్న ప్రాధాన్యము హెచ్చనియు, సంస్కారము లెన్నియున్నను శీలము లేనిచో మానవులు తరింపజాలరనియు బోధించుటకు ఒక మహాపురుషుని జీవితమును వ్రాసిరి.

ఫలాభిసంధిరహితముగను, ఈశ్వరార్పణబుద్ధితోడను చేయు భూతసేవయే యుత్కృష్టమగు నీశ్వరపూజ యను సిద్ధాంతమును ప్రతిపాదించుటకు పంతులుగారు "పరమార్థతత్త్వసారము : హలధరాచ్యుతుల తీర్థయాత్ర" అను పేరుతో నొకకథను పద్యరూపమున వెలయించిరి. పలనాటివీరుడు బాలచంద్రుని చరిత్రమును, భారతప్రసిద్ధులగు సత్యహరిశ్చంద్రచరిత్రమును, దేవయానికథను మనోహరములగు పద్యముల కూర్చిరి. ప్రియదర్శికను తెనిగించిరి. పంతులుగారి బాల్యస్నేహితులును, సహాధ్యాయులు నయిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి హేమలతను నాటకరూపమున రచియించిరి. ఇంకను ప్రాచుర్యమునకు రాని వీరి కృతులు కొన్నియుండవచ్చును

శ్రీ భానుమూర్తిపంతులుగారు తమ కవిత్వమందంతటను లలితములగు సంస్కృతపదముల నుపయోగించిరి. వీరి పద్యములయందు గాంభీర్య మధికముగ నుండును. చక్కని ధారాశుద్ధి. కథలను నీతిబోధకములుగ నుండుటకు రచియించిరి. వాని నెంతయు హృదయాకర్షకముగ నడిపిరి. వచనరచన ప్రౌఢముగ నుండును. భక్తిరసప్రకటనమున శ్రీ పంతులుగారి పద్యములు భాగవతమునందలి పద్యములను జ్ఞప్తికి దెచ్చును. ఉత్తమములగు తమ కృతులచేతను, సారస్వతసభల కనేకములకు నేతలుగా నుండి నిర్వహించుటచేతను ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి శ్రీ భానుమూర్తి పంతులుగారు తోడ్పడియుండిరి. ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారును ఈ వైదుష్యము నుపయోగించుకొనిరి.

శ్రీ భానుమూర్తిపంతులుగారు బాల్యము నుండియు భగవచ్చింతనమున ఆసక్తిగలవారు. గృహస్థాశ్రమమును నియమబద్ధముగ నడిపి చిత్తశుద్ధి నలవరచుకొనిరి. అరణ్యములన్నియు ప్రభుత్వాధీనము లగుటచే నీరోజులలో వానప్రస్థులకు వాసయోగ్యములు కావని, పట్టణములకు పరిసరములందలి తోటలలో ప్రశాంతముగ గడుపుచువచ్చిరి. కొంతకాలము భీమవరముదగ్గర ఆశ్రమము ఏర్పాటుచేసికొనిరి. అవసాన

కాలమున గోపాదక్షేత్రమున గోదావరీతీరముననే నివసించిరి. సాత్వికాహారమునే స్వీకరించుచు. పరమార్థసాధనమున కాలమును గడిపెడివారు భానుమూర్తి పంతులుగారియందు ప్రస్ఫుటములయిన ఆధ్యాత్మిక లక్షణములు గలవారు ఆంధ్రులలో అనేకులు లేరు. పరహితపరాయణత వీరి సహజశీలము. ౨-౭-౪౫న తటస్థించిన శ్రీ భానుమూర్తిపంతులుగారి మరణము వలన ఆంధ్రదేశము ఒక పవిత్రవ్యక్తిని గోల్పోయినది.

మందలవర్తి ఉపేంద్రశర్మ.

* * *

## ఆకస్మిక మరణముపాలైన శ్రీ సుభాషచంద్రబోసు

భారతస్వాతంత్ర్యసిద్ధిని ఆకాంక్షించి, దేశము వదలిపెట్టిపోయి, అక్షరాజ్యాల అండచేరి, సింగపూరులో 'స్వతంత్రభారత తాత్కాలిక ప్రభుత్వాధిపతి' పట్టము నధిష్ఠించియుండిన శ్రీ సుభాషచంద్రబోసు జపాను అస్త్రసన్యాసము చేయసంకల్పించిన వెను వెంటనే జపాను ప్రభుత్వముతో అత్యవసరసంప్రతింపులు సాగించుటకై మొన్న ఆగస్టు ౧౬-వ తేదీనాడు సింగపూరునుండి విమానములో బయలుదేరి వెళ్లుచు, మధ్యేమార్గములో ౧౮-వ తేదీనాడు ఆయన విమానము తైహోకూ విమానాశ్రయములో అకస్మాత్తుగా కూలిపోగా, గాయపడి, జపానులో ఒక ఆసుపత్రిలో చేరి, అదే అర్ధరాత్రి స్వర్గస్థుడైనాడని జపాను వార్తాసంస్థ ౨౩-వ తేదీనాడు ప్రకటించినది. జీవితమంతయు దేశస్వాతంత్ర్యసాధనకై అర్పించిన ఈ మహా దేశభక్తుని ఈ అకాలమరణవార్త విని ఆసేతుహిమాచల భారతదేశమంతయు గడగడ కన్నీళ్లురాల్చి వలవల వాపోయినది.





* * *

## జపానుచక్రవర్తి శరణాగతి

దాదాపు మూడువేల యేండ్లనుండి సామ్రాజ్యసౌభాగ్యమును నిరాఘాటముగా అనుభవించిన జపానుకు చక్రవర్తియై, సాక్షాద్భగవదంశసంభూతుడని మన్ననలందిన హీరోహిటో కుడిచి కూర్చొని కాలుమీద కాలువేసుకొని కాలక్షేపము చేయక, బ్రిటను అమెరికాలతో కయ్యమునకు కాలుదువ్వి, వారితో యుద్ధమునకు తలపడి సుమారు నాలుగేండ్లపాటు అవక్రవిక్రమమును ప్రకటించి, తుదకు దైవదుర్విపాకమునకు లోనై, మొన్న ఆగస్టు ౧౪-వ తేదీనాడు మిత్రమండలివారి పాట్సుడాం షరతులను శిరసావహించి వారికి బేషరతుగా లొంగిపోయి, తన సైనికదళములకు అస్త్రసన్యాసపు తాకీదును చేతులారా జారీచేసి తాతముత్తాతలనాటినుండి వచ్చుచుండిన సౌభాగ్యమును విచ్ఛిన్నము చేసుకొన్నాడు, పాపము!





నాగార్జునశిల్పపీఠ ప్రధానాచార్యులకు స్వాగతము
శ్రీ. గుఱ్ఱం మల్లయ్య ప్రభృతుల ప్రగాఢకృషిఫలితముగా మాచర్లలో క్రొత్తగా వెలసిన నాగార్జునశిల్పపీఠము నకు ప్రధానాచార్య పదవిని స్వీకరింపవచ్చినశ్రీ ప్రమోదకుమారఛటర్జీగారికి బెజవాడలో ఇచ్చినస్వాగత సత్కార సమావేశదృశ్యము.

# నాగార్జునకొండ

అది శిలకాగు బౌద్ధవివ
శైకమనఃపరిపాక హేల; అ
య్యది యొక బొమ్మకా దనుభ
వాశ్రిత మానసవేదనార్తి; అ
య్యది కళకా దనశ్వరహృ
దంతరరాగసరిత్తటిల్లతా
సదనము; తెన్గుశిల్పుల క
చంచలశైలపతాక మద్దిరా.

అవిగో, యశోధరాంబ విర
హార్తకపోలతలాలు చిన్నవై,
పవడములోని నీలములు
పాపలువిచ్చి, క్షణంబు క్రిందనే
కవుగిలిలో నలింగి చిఱు
కంపము లింకను పోని భ్రేల, యా
నవనవలాడు నేకశిల
నంటి పరుండెను చూడు మట్టులన్.

చిందిన కృష్ణమ్మ చిఱునవ్వుపొందులో
కరగి గంతులు వేయు కావ్యశిలలు
సాగిన చిఱుగాలిచక్కిలిగింతలో
పులకించి పొంగు వంపుల పసందు
విరిసిన సంజబంగరువానజల్లులో
నగలూని నగజాలు మగువరాలు
తెలివెన్నెలల వెల్లువల కౌగిలింతలో
మరులీను వలపుచిత్తరుల సరులు
ప్రణయవిన్యాస మిది, శిల్పమునకె వ్యాఖ్య,
కవిత కద్దము, నృత్యలక్ష్యమ్ముకూడ,
బౌద్ధనిర్వాణసౌధసోపాన మిద్ది,
అతుల కూలంకషమ్ము నాగార్జునాద్రి.

ఈ యజరామరాలయము
నెల్ల సృజించినవార లాంధ్రులే
నోయి, తెనుంగువారి గని
యూరక యేడ్చును వెక్కివెక్కి యా
రాయి 'కృతఘ్నులై మఱచి
రా'యని యేమొ; నిజమ్మొ కాదొకో;
రాయి చలించురా, తెలుగు
రాయడు మాత్రము రాతిగుండెరా.

నాగార్జునరోచిశ్రీ
స్వాగత మొకనాడు భరతజాతికి నెల్లన్;
నాగార్జునాద్రి నేడును
సాగింపర భరతకళకు స్వాగత వనిగా.

వేమూరి వెంకటరామనాథం.



# విమర్శనము



### న మూ గ రా

రామదాస్, ఆంజనేయులు, సుబ్రహ్మణ్యం గార్లు రచయితలు. నవ్యకళాపరిషత్తు (నరసారావుపేట) వారి ప్రచురణ. ధర రూపాయి.

ఈ నాటి యుద్ధం, అది ఇచ్చిన ఆవేశం, వస్తూన్న ప్రజాశక్తి మొదలయిన విషయాలను నవంనవ ధోరణులతో చిత్రించిన కవితాగ్రంథం ఇది.

నడకలో గబగబ, ఇతివృత్తంలో ఆవేశతత్వ, రచనావిన్యాసంలో ప్రబోధపరత్వమూ కలిగినది ఈ గ్రంథం.

'సర్వే జనాః సుఖినో భవంతు' అన్న చిత్తశుద్ధితో, రాచకీయాలను కవిత్వంగా పొదిగే నేర్పుతో వ్రాస్తున్న కవితాశాఖకు చెందిన ఈ కృతి తన్మతావలంబకులకు ఆహ్లాదము నీయగలదు. విడిగా కవిత్వముగా చదువుకోనున్నవారికి ఇక్కడ రసముకంటె ప్రబోధమూ, విషయస్ఫురణకంటె ఆవేశమూ నిలబడి అడ్డగించుతెవి. కవితకు మహోద్రేకమే, ఆవేశమే ఆయువుపట్టు అనుకుంటే చెప్పుకోతగ్గ గ్రంథాలలో దిగా ఇది భాసిస్తుంది.

'అనామకుడు'

---

### బాల

(పిల్లల సచిత్ర మాసపత్రిక)

సంపాదకుడు : న్యాయపతి రాఘవరావుగారు, 20, సుందరేశ్వర వీధి, మైలాపూరు, మద్రాసు. సంవత్సర చందా నాలుగున్నర రూపాయి. విడిసంచిక ౬ అణాలు.

తోడిభాషలలో విస్తారముగా పెరిగి పెంపొందుచున్న స్త్రీవాఙ్మయ, బాలవాఙ్మయములు మన భాషలో కరవైపోవుట కడుశోచనీయమైన సంగతి. ఈ రెండు వాఙ్మయములును చాల అత్యవసరములు. అందులో ముఖ్యముగా బాలవాఙ్మయమును గురించిన పత్రిక మనకు లేకపోయెనేయని చాల నాళ్లబట్టి దుఃఖపడుచుంటిమి. ఈ కొత్త పత్రికతో అదితీరు మార్గమేర్పడినందుకు మేము మిక్కిలి సంతోషించుచున్నాము. ఆగస్టులో వెలువడిన తొలిసంచిక ప్రమాణమును బట్టి నడుపుచు రాగలిగినచో ఇది తప్పక మూడు పువ్వులు నాలుగు కాయలుగా వెలుగొందగలదని మా ఆశయము. ఆ తొలిసంచిక సర్వాత్మనా చక్కదిరియున్నది. అందుకు సంపాదకుల నభినందింపక తీరదు.

---

### హనుమచ్ఛాస్త్రికథలు

కథకుడు : ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు. ప్రకాశకులు : సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము. వెల ౧౨ అణాలు.

కథానికా రచనలో ప్రత్యేక శిల్ప విన్నాణములను ప్రదర్శించుటయందు శాస్త్రిగారు సిద్ధహస్తులు. ఇందలి కథలన్నియు ఇదివరకొకసారి వివిధ పత్రికల ద్వారా వెలుగు చూచినవే అయినను సరిక్రొత్తందనము కోలుపోకపోవుటయే వీనిలోని విశిష్టత. వీనిలో కొన్ని సమాజములోని కుళ్లును కదిపి ప్రజలదృష్టికి తేజాలినవి; కొన్ని ఒక్కొక్క వ్యవస్థలోని విచ్ఛిత్తి విశేషములను చూపగలవి; కొన్ని కేవలము శిల్పమును, నైచిత్రిని ప్రదర్శించునవి. ఇవి సహృదయుల ఆదరాభిమానములను తప్పక చూరగొనగలవు.

## గ్రంథ స్వీకారము

### అశ్విన్-ఇంజక్షను విధానము

రచయిత : డాక్టరు జి. వి. యన్. ఆచార్యులు గారు, చేబ్రోలు (పశ్చిమ గోదావరి). ప్రచురణకర్తలు : డాక్టరు బ్రదర్సు, చేబ్రోలు. వెల 3 రూపాయలు.

### కు రూ పి

కథల సంపుటి. కథకుడు : చావలి వెంకటశాస్త్రిగారు. ప్రకాశకులు: నవ్యకళా ప్రచురణాలయము, నరసారావుపేట. వెల రూపాయి.

# విమర్శనము

### జాగృతి

ఎలిజీ. రచయితలు : వద్దిపర్తి వెంకటేశ్వరశర్మ, రాచకొండ నరసింహమూర్తి (కేసరి హైస్కూలు, మైలాపూరు) గార్లు. వెల ౬ అణాలు.

### జైలు

కథల సంపుటి. కథకుడు : పొట్లపల్లి రామారావుగారు. ప్రకాశకులు: ఆంధ్ర పబ్లిషింగ్ కంపెనీ, సుల్తాన్ బజారు, హైదరాబాదు, దక్కను. వెల ౭ అణాలు.

### ఔరంగ్ - బాజీప్రభు - కాంచన

మూడు ఏకాంకికల సంపుటి. రచయిత : మూర్తిబాబు (భాస్కర్ల సూర్యనారాయణమూర్తి) గారు. ప్రకాశకులు : సత్సారసాపబ్లికేషన్సు, 3౪3, 3-౪, గుల్ బాగ్, హైదరాబాదు, దక్కను. వెల ౧౦ అణాలు.

### ఫాంటమారా

మూలము : ఇగ్నిషియో సైలోను. అనువాదము: నిడమర్తి అశ్వినీకుమారదత్తుగా ప్రకాశకులు : విజ్ఞానసాహిత్యవనము, బెజవాడ వెల రెండు రూపాయల పధ్నాలుగణాలు.

### అనాసరోగవిజ్ఞానం

గ్రంథకర్త : వైద్య శ్రీ ప్రకాశచంద్ర శతపథి గారు. ప్రకాశకులు : కస్తూరి గ్రంథమండలి, గవర్నరుపేట, బెజవాడ. వెల ౪ అణాలు.

### శ్రీ వ్యాసపాణినిభావనిర్ణయః

వేదాంత, వ్యాకరణ విమర్శము. రచయిత : మహామహోపాధ్యాయ వ్యాకరణం శ్రీముష్ణం సేతు మాధవాచార్యులుగారు. ప్రకాశకులు : ఆర్. రామమూర్తిశర్మగారు, 'వ్యాకరణ పండితుడు, సంస్కృత కళాశాల, తిరుపతి. వెల 3 రూపాయలు.








Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.

# ఇండియన్ టీలలో అత్యుత్తమమైనది



చక్కని రుచి, ఘుమ ఘుమలాడే
సువాసన, నేత్ర పర్వంగావుండే
రంగు, తక్కువధర, వీటి అన్నింటి
నిబట్టి లిప్టన్స్ వైట్ లేబుల్
మిగతా వాటిని తలదన్ని అత్య
ధిక గౌరవాన్ని తెచ్చుకున్నది.




# లిప్టన్స్
## వైట్ లేబుల్

మృదు మధురమైన ఇండియన్ లీఫ్ టీ

LTK 84 WTG